# బీజలక్ష్మి

(Pearal Buck's Dragon Seed)

అనువాదం

బెల్లంకొండ రామదాసు






ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# బీజలక్ష్మి

వరిపొలంలో మోకాటిలోతునీటిలో నిల్చున్న లింగ్‌టాన్ వంచినతల ఎత్తి చూశాడు. చేనికి ఆవలినుంచి అతనిభార్యకేక వినిపించింది. అది అన్నంతినేవేళా కాదు, నిద్రించేవేళా కాదు. తనభార్య ఎందుకు పిలుస్తున్నదా అని లింగ్‌టాన్ ఆశ్చర్యపోయాడు. చేనికి ఆవలిమూల అతని కొడుకు లిద్దరూ నడుములువంచి వరి నాటువేస్తున్నారు.

'ఓహో' - లింగ్‌టాన్ కేకవేశాడు. కేకవిని కొడుకు లిద్దరూ లేచినిల్చున్నారు,

'అమ్మటరా కేకపెట్టింది ?' - అడిగాడు లింగ్‌టాన్.

కొడుకు లిద్దరూ విన్నారు. ఇద్దరూ ఆజానుబాహువులు. శిలతో మలచినట్టు బలంగా ఉన్నారు. కొడుకులను చూడగానే లింగ్‌టాన్ నరాల్లో నెత్తురు గర్వాతిరేకంచే పొంగెత్తింది. ఇద్దరికి పెళ్ళిళ్ళయినాయి. పెద్దకొడుకు లాయ్‌టాకు ఇద్దరు కొడుకులు - సంతానంకూడా కలిగింది. చిన్నవాడికి ఒక నెల వయస్సు. రెండవకొడుకు లాయ్‌ఎక్‌కు వివాహమై నాలుగునెలలైంది. అతనిభార్యకు ఎప్పుడూ చిరాకు, కోపమూ. లింగ్‌టాన్ కడగొట్టు కొడుకు లాయ్‌సాన్ బహుశా ఈ సమయంలో ఏ పచ్చని లోయలోనో గొడ్లను మేపుతూ ఉంటాడు. అతనికి ఇద్దరు కూతుళ్ళు. పెద్ద

మ్మాయికి వివాహమైంది. పక్కనగరంలో ఒక వర్తకుని ఇంటి కోడలుగా వెళ్ళింది.

ఈ క్షణంలో అతనిభార్యగొంతు దూరంనుంచి ఎంతో స్పష్టంగా వినిపిస్తోంది. 'చెవుడా ఏమిటి ? పలకవేం ?' అంటున్నది.

'అమ్మేటరా పిలుస్తున్నది ?' అనడిగాడు లాయ్‌టా. ముగ్గురూ ఒకరివంక ఒకరు చూచుకున్నారు. లింగ్‌టాన్ ఎడమచేతిలోఉన్న వరిమొక్కలు నాటాడు.

'అలా నాటుపెట్టకుండా చూస్తూ నుంచుటారేం ? ఒక్కక్షణం పాడైనా డబ్బు పారబోసుకోడమే' అంటూ కొడుకులను గద్దించాడు లింగ్‌టాన్.

కొడుకు లిద్దరూ నడుములువంచి నాటువెయ్యడం మొదలెట్టారు. వారి కాళ్ళు బురదలో కూరుకుపోయాయి. నడియెండ వారి వీపులను మాడ్చేస్తోంది. శిరస్సులకు ఎండ సోకకుండా వెదురు టోపీలు ధరించారు.

లింగ్‌టాన్ కుమారులిద్దరూ చిన్నతనంనుంచీ ఎంతో కలగలుపుగా స్నేహితుల్లా ఉంటున్నారు. వారిద్దరికీ ఒక సంవత్సరం తేడా. అంతే. ఎలాటి విషయాన్నయినా ఒకరి కొకరు చెప్పుకునేవారు. వారి వివాహాలుకూడా వారి పరస్పర అనురాగాన్ని బాంధవ్యాన్ని తగ్గించలేకపోయాయి.

వారిలో ఇంకా చిన్నతనం పూర్తిగా మాసిపోలేదు. వారికి ప్రపంచాన్ని గురించిన ఊహలు ఇంకా విచిత్రంగానే ఉన్నాయి. వారి ఊహల్లో ప్రపంచంచుట్టూతా ఆకుపచ్చని కొండలు వ్యాపించిఉన్నాయి. ప్రపంచానికంతా మూల

కేంద్రం వాటిలింగ్ గ్రామమే. వారి పూర్వీకులందరూ శతాబ్దాలనుంచీ అక్కడే పుట్టిపెరిగి గతించారు. ఏదైనా వ్యాపారపు పని ఉన్నప్పుడే నగరానికి వెళ్ళేవారు. పళ్ళూ ఫలాలు, ధాన్యం కూరలు అమ్మడానికి మాత్రమే పట్టణానికి వెళ్ళేవారు. వారి చెల్లెలిని నగరంలో ఒక వర్తకునికిచ్చి వివాహంచేశారు. అంచేత వాళ్ళు అప్పుడప్పుడూ నగరానికి వెళ్ళవలసివస్తుండేది. అది వారికి ఎంతో కష్టంగా ఉండేది. పొలంపని వదలి నగరానికి వెళ్ళడం వారికి సుతరామూ నచ్చేదికాదు. వారు వరినాటుతూనే మాట్లాడుకుంటున్నారు.

లాయ్‌ఎర్ అన్నని అడిగాడు— 'సంసారంలో ప్రవేశించిన ప్రతివ్యక్తికీ సంతానం కలుగుతుందంటావా?' అని. ఈ ప్రశ్నను అతను సాంకేతికంగా, 'మొక్కనాటగానే పూవు పూస్తుందంటావా?' అని అడిగాడు 'కళ్ళుమూసుకుని మొక్కనాటకూడదు. నీవూ నీభార్యా పొత్తుగా ఉంటున్నారా?' అని అడిగాడు అన్న.

'కాపరానికి వచ్చిన కొత్తలో ఎంతో పొందికగా ఉండేవారం. ఇప్పుడూ ఎప్పుడూ ఏవో పొరుపులు వస్తుంటాయి' అన్నాడు లాయ్‌ఎర్.

'మూడు దినాలు ఆమెను విశ్రాంతిగా వదలి మళ్ళీ పునర్నవంగా ఆమెతో సంసారంచెయ్యి' అని చెప్పాడు లాయ్‌టా. 'ఒకవ్యక్తి మొక్కనాటేముందు ముందుగా పాదు సరిగా ప్రోదిచేసుకోవాలి. విత్తనం వృధా కాకూడదు, భూసారం పరిపక్వంగా ఉన్నప్పుడే విత్తనం వెదజల్లాలి. విత్తి

నాలు గాలికి చెదిరిపోకూడదు. బాగా లోతుకు నాటు పెట్టాలి' - ఈ మాటలు చెబుతూ అతను వరినారు నాటుతూనే ఉన్నాడు.

లాయ్‌ఎర్ ఈ మాటలన్నీ అతిశ్రద్ధగా విన్నాడు.

'నేను చాలా అశ్రద్ధమనిషిని' అన్నాడు ఎంతో సిగ్గుతో.

'నీకు సంతానం కలగలేదంటే అది నీతప్పే' అన్నాడు లాయ్‌టా. ఇలాఅంటున్నప్పుడు అతని పెదవులమీద ఒక చిన్న చిరునవ్వు మొలకెత్తింది. 'నీకు సంతానం కలిగితే, నీకు తల్లిమీదకన్న సంతానంమీద ఎక్కువ మమత ఏర్పడుతుంది.'

'అబ్బ, నాభార్యకు మరీ చిరాకు హెచ్చుతోంది. ప్రతిమాసం బహిష్టయినప్పుడల్లా ధుమధుమలాడుతుంది. ఈమాటలు చెప్పుకుంటూ వారిద్దరూ పకాలున నవ్వుకున్నారు. పెద్దవాడి భార్య ఎంతో మందంగా శాంతంగా నిండుగా వుండేది. ఎప్పుడైనా కోపతాపాలొచ్చినా నిగ్రహించుకుని దాచుకునేది. లాయ్‌ఎర్ భార్య సుడిగాలిలా విసురుగా వుండేది. ఆమె ఎక్కడున్నా తనచుట్టుపక్కల పరిసరాల నుజ్జీవింపజేసేది. ఆమెను ప్రథమ దృష్టిలోనే లాయ్‌ఎర్ ప్రేమించాడు.

లాయ్‌టాకూడా తన భార్యని ప్రేమించాడు. కాని తన హృదయాన్ని పరిపూర్ణంగా ఆమెకు సమర్పించుకోలేకపోయాడు. ఎంతో రాత్రి గడిచిన తరువాత కాని ఇంటికి చేరేవాడుకాదు. గ్రామంలో పెద్దలందరూ వీధిముచ్చట్లు ముగించి, ఇళ్ళకుచేరి కునుకుతీసిన తరువాత కాని తను ఇంటికి చేరేవాడు

కాదు. అతను ఇంటికి చేరినతరువాత అతని తండ్రికనక మేలుకునివున్నట్లయితే తండ్రితో పిచ్చాపాటీ మాట్లాడుతూ కూచునేవాడు. అతను అతనిభార్యను ప్రేమించడంలో ఉద్వేగంకాని, ఆవేగంకాని కనుపించేదికాదు. అతను శయన మందిరాన్ని ప్రవేశించేసరికి అక్కడ అంతకుముందే వచ్చి నిద్రిస్తున్న భార్య కనుపించేది.

లాయ్ఎర్ భార్య వట్టి చిలిపి పిల్ల. ఎప్పుడూ యేదో ఒక గందరగోళం చేస్తూండేది. ఆమె ఎప్పుడూ ఇల్లు నలుమూలలా గిలకలాగా తిరుగుతూఉండేది. ప్రతి సాయంత్రం అతను ఇంటికిచేరేసమయంలో అతని తొందరపాటును అందరూ గమనించడం చూచి అతనికి యెంతో సిగ్గయ్యేది. భార్యను జేడ్ అని పిలిచేవాడు. ఆమె పూర్తిపేరు పెద్దదైనప్పటికీ 'జేడ్' అని ముద్దుగా పిలిచేవాడు. ఆమెకోసం అతను ఇల్లు నలుమూలలా వెదికేవాడు. ఒక్కోసారి అతను రాగానే ఆమె పడకగదిలో కనుపించేదికాదు. ఇంట్లో ఎక్కడో ఒకచోట తిరుగుతూ ఉండేది. ఆమె అతన్ని ప్రేమిస్తున్నదో లేదో తెలుసుకోవాలని అతనికి ఎంతో ఆసక్తిగా ఉండేది. కాని ఈ ప్రశ్న ఆమెను అడగాలంటే అతనికి సిగ్గయ్యేది. ఆమెకు కోపం ఎంత తొందరగా వస్తుందో నవ్వూ అంత తొందరగా వస్తుంది. ఈ ప్రశ్న విని ఆమె పకాలున నవ్వేయవచ్చునని అతని భయం. ఈక్షణంలో ఆమె ఎక్కడ వుండివుంటుందా అని అతను ఆలోచించాడు. ప్రొద్దునే పొలానికి వచ్చింది. తనకు వరినాటులో సహాయం చేసింది. మధ్యాహ్నం భోజనా లయ్యాక మళ్ళీరాలేదు.

'నాకు నిద్రవస్తోంది' అనిపక్కమీదపడుకునినిద్రించింది. ఆమె ప్రక్కనే తనూ పడుకుని నిద్రపోదామనుకున్నాడు. కాని అతనికి ధైర్యంచాలలేదు. పగలు పనినాటుపని బొచ్చెడంత ఉంటే పనంతా మానేసి భార్యతో పడుకుంటే తండ్రి మండిపడతాడని భయమేసింది.

అందుచేత నిద్రిస్తున్న ఆమెను వదిలేసి అతను పొలానికి వచ్చేశాడు. 'ఆమె ఎంతసేపు అలా నిద్రించి ఉంటుందో'—అతను ఆలోచిస్తూ ప్రొద్దువంక చూచాడు. ఇంకా ప్రొద్దువాటారలేదు. అతను ఒక దీర్ఘనిశ్వాసం విడిచి మళ్ళీ మొక్కనాటు ప్రారంభించాడు.

ఇక లింగ్‌టన్‌గృహంలో: లింగ్‌టాన్ ఇంటిముందు ప్రతి వేసవిలో తడికవసారా వేయిస్తాడు. అతను ఆ వసారా క్రింద కూచుని ఒక నూతన వ్యక్తి ఏదో చెబుతూఉంటే వింటున్నాడు. అతను సిల్కుగుడ్డలు తిరిగి అమ్ముకునే వర్తకుడు. దక్షిణదేశాన్నంతా పర్యటించి వర్తకంచేస్తాడు. అతనిది ఉత్తరదేశం. అతను సిల్కుబట్టలేకాక మరికొన్ని నారబట్టలుకూడా పట్టుకొచ్చాడు. నారబట్టలు రైతులు తప్ప మరెవరూ కొనరని అతనికి తెలుసు. అంచేత నారబట్టల అమ్మకంకోసం గ్రామాలమీద బయలుదేరాడు. లింగ్‌టాన్ ఇల్లు ఇతర రైతులఇండ్లకంటె పెద్దది. అంచేత ముందుగా లింగ్‌టాన్‌గృహానికి వచ్చాడు. ఇంటిముందు ఒక చక్కని పిల్లకూచుని వడుకుతోంది.

మొదట ఆమె అతన్ని అంతగా గమనించినట్లు లేదు. అతనువచ్చి ఆమెతో మాట్లాడగానే తల్లి లింగ్‌సాయ్ లోపలి

నుంచివచ్చి, 'నీవు స్త్రీతో మాట్లాడదలచుకుంటే నాతో మాట్లాడు. నా రెండో కుమారుసభార్యతో కాదు' అన్నది.

'నేనూ ఆమె అత్తగారికోసమే అడుగుతున్నాను' అన్నాడు వర్తకుడు. ఆమెను చూచీచూడడంతోటే ఆమే ఇంటి కంతకూ పెత్తనదారనీ పెద్దఇల్లాలనీ అతను గ్రహించాడు. 'ఉత్తరదేశానికి ఇంటికి మరలిపోతున్నాను. వేసవిలో ధరించడానికి పనికివచ్చే బట్ట- నారబట్ట కొద్దిగా మిగిలింది. మీ ప్రఖ్యాతి ఊరూరా వినివచ్చాను' అన్నాడు అతను.

''మాటాడకుండా బట్టలుచూపించు' అన్నదామె.

అతను వెంటనే ఆమె ఆజ్ఞను శిరసావహించాడు. ఆమె మాటలకు మెల్లగా నవ్వుతూ బట్టలమూట విప్పాడు. కొద్ది నిమిషాలలో వారు ధర విషయంలో తగాదాపడడం ప్రారంభించారు. అతను చివరకు 'ఇప్పుడు ధరలుహెచ్చాయి. ఈ వేసవిలో ఉత్తరాన యుద్ధం రానున్నది' అన్నాడు.

ఆమె చేతిలోనుంచి గుడ్డ జారిపడింది.

'ఏం యుద్ధం ? అందులో ఇప్పుడు !'- ఆశ్చర్యపడింది ఆమె.

'మన యుద్ధంకాదు, ప్రాచ్య సముద్రాన్నుంచి వచ్చిన మరుగుజ్జులు - వాళ్లె ఎప్పుడూ ఏదో ఒక యుద్ధాన్ని పట్టుకొస్తుంటారు' అన్నాడు.

'వాళ్లు ఇక్కడికికూడా వస్తారా ?' అనడిగింది ఆమె.

'ఎవరికి తెలుసు. వస్తేగావచ్చు' అన్నాడు. ఈ మాట వినడంతోటే తలుపుదగ్గరికివెళ్ళి భర్తను పిలిచింది.

లింగ్‌టాన్ వసారాలో కూచుని వర్తకుని మాటలు విననారంభించాడు. వసారా చల్లని నీడ నిస్తోంది. అతని కాళ్ళకింద చల్లని రాళ్లు పరిచి ఉన్నాయి. వసారాలో ఎంతో అందంగా హాయిగా ఉంది. ఇంటి ముంగిట అతని పూర్వీకుల్లో ఒకడు త్రవ్వించిన చిన్నకొలను ఉన్నది. ఆ కొలనులో చిన్న చిన్న చిరుపద్మాలు వెలసి ఉన్నాయి. వేసవిలో ఆ చిన్న కొలనుఒడ్డున చిన్న టేబిల్ వేసుకుని అందరూ విందారగించేవారు. వానాకాలంలోకూడా అక్కడే కూచుని భోజనంచేసేవారు. వర్తకుడు మాట్లాడుతూఉంటగా లింగ్‌టాన్ 'టీ' సేవిస్తూ కూచున్నాడు. ఒక ప్రక్కగా బెంచీమీద అతనిభార్య కూచుని పెద్ద సూదితో పాత చెప్పులు బాగు చేస్తోంది. మధ్య మధ్య సూది దిగబడినప్పుడల్లా పండ్లతో బిగించి సూది తీస్తున్నది. ఈ దృశ్యాన్ని చూచినప్పుడల్లా లింగ్‌టాన్ కండ్లు తిప్పేస్తున్నాడు.

'అయితే పాశ్చాత్యసముద్రపు మరుగుజ్జులు మనవారిలో కొందరిని హతంచేశారన్నమాట' అన్నాడు లింగ్‌టాన్.

'ఉత్తరంలో వారు పసిపాప బాలాదిగా ఎందరినో పొట్టనపెట్టుకున్నారు' అన్నాడు వర్తకుడు. పాత్రలోని 'టీ' ఒక్క గుక్కలో ముగించి 'రేపు నేను పెంగ్‌ఫూ చేరాలి. అంచేత ఇక సెలవు తీసుకుంటాను' అన్నాడు. పర్యటన సాగించే అందరు వర్తకులలాగే అతనుకూడా అతి సామాన్యంగానే ఉన్నాడు.

లింగ్‌టాన్ చలించలేదు. 'ఇప్పుడేం చెయ్యాలి' అనుకున్నాడు తనలో తాను. అతను ఎవరినీ అడగలేడు. అంచేత

అతనికి ఎవరూ సమాధానమూ చెప్పలేదు. వర్తకుడు లేచి నిల్చుని నమస్కరించి వెళ్ళిపోయాడు. లింగ్‌టాన్, అతని భార్యా మిగిలిపోయారు. ఆమె కుడుతూనే ఉంది. కుడుతూ ఇల్లంతా కలయచూస్తోంది. ఇల్లు పాతరకం ఇటుకలతో కట్టినది. వసారా వంగి, ఎంతో ఎత్తుగా లేదు. ఈ గృహంలోనే అతని పూర్వీకులు నివసించి చనిపోయారు. అతను ఈ గృహంలోనే జన్మించాడు. ఈ ఇంట్లోనే అతని కుమారులూ, మనుమడూ ఈనాడు నివసిస్తున్నారు.

మధ్యాహ్నం నిశ్చలంగా వెచ్చగా ఉంది. చిన్న చిన్న చిరుకమలాలు మెల్లమెల్లగా చలిస్తున్నాయి. ఆ నిశ్చల నిశ్శబ్దంలోనుంచి అతనికి మనుమని కేక వినిపించింది. లింగ్‌టాన్ లేచి ఇంట్లోకి వెళ్ళి శాంతంగా కూచున్నాడు. నిశ్చలంగా కూచున్న అతనికి అతనిజీవితం జ్ఞాపకంవచ్చింది. 'నా జీవితం ధన్యమైనదే' అనుకున్నాడు. ఒక విధంగా అతని జీవితం అదృష్ట జీవితమే. అతనిగ్రామం ఒక పెద్ద నగరానికి దరిదాపుల్లో ఉన్నది. పక్కగా ఒక పెద్దనది, కొండలు, ఒక అందమైన పచ్చనిలోయ. కొండల మీది నుంచి ఒక సన్నని ప్రవాహం లోయలోకి ప్రవహిస్తున్నది. అతనికి 'ఇది కావాలి' అని ఆకాంక్ష లేదు. అంత శ్రీమంతుడూ కాదు, అంత దరిద్రుడూ కాదు. ఎన్నడూ అతనికి జీవితంలో కాస్త జలుబైనా చేసిన పాపానపోలేదు. ఇప్పుడతనికి 56 సంవత్సరాలు. అయినా అతని శరీరదార్ఢ్యం చెడలేదు. అతనిభార్యకు వయస్సు మళ్ళిపోయింది. లేకుంటే అతనికింకా సంతానం కలిగేదే. ఊరిలో వాక ముసలిది వొక

ఉంపుడుక త్తెను తెచ్చుకోమని అతనికి సలహానిచ్చింది. కాని అతను అంగీకరించ లేదు.

'పిల్లలుగలవాణ్ణి. ఇలా వెళ్ళిపోనీ నా బ్రతుకు' అన్నాడు ఆ ఆశబోతు ముసలిదానితో.

'ఈరోజుల్లో ఒక వ్యక్తికి ఎందరో కుమారులుండడానికి వీల్లేదు. ఈ యుద్ధాలు కబళిస్తాయి' అన్నది ముసలిది. అతను నవ్వి ఊరుకున్నాడు. ఉన్న సంతానంతో అతను సంతృప్తి చెందాడు. పైగా కొత్త స్త్రీ రాకతో గృహశాంతి భంగమై పోతుంది. అతను చేతితో టేబిల్‌ను గుద్ది టీ త్రాగడం ముగించి నిటారుగ నిల్చుని, 'ఇక పనికి వెడతాను' అన్నాడు.

'ఇక పనికి వెడతాను' పెద్దగా కేకేట్టాడు. ఎవరూ సమాధానం చెప్పలేదు. అందరూ స్త్రీలేకావడంచేత అతనికి ఎవరూ సమాధానం చెప్పలేదు. అతను వెళ్ళిపోయాడు. అతను పొలంవెళ్ళి చూచేసరికి అతను ప్రారంభించిన పని కొడుకులు ముగింపుకుతీసుకురావడంచూచి అతను యెంతో సంతోషించాడు. మరోగంట పనిచేస్తే పొద్దుగూకేసరికల్లా పని పూర్తి అవుతుంది. ఇది చివర ఎకరం. ఈ ఎకరం పూర్తి చేస్తే నాటంతా పూర్తి అయినట్టే. ఒక సంవత్సరం వారంతా హాయిగా బ్రతకొచ్చు అతను మళ్ళీ నడుముపంచి పని ప్రారంభించాడు.

లింగ్‌టాన్ చదువుకున్నవాడు కాదు. పూర్తిగా నిరక్షరాస్యుడు. అతనికి చదువుకోవలసిన ఆవశ్యకతకూడా ఎన్నడూ కలగలేదు. 'చదువుకుని చేసేదేముంది? వినికిడివల

ఎలాటి విషయాన్నైనా తెలుసుకోవచ్చు' అంటూండేవాడు. శుభవిషయాన్నయితే వినడానికి యెంతో ఆతురపడేవాడు. అశుభవిషయంపట్ల అంత ఉత్సుకత చూపేవాడుకాదు. కొడుకులనుకూడా చదివించలేదు. అందుకు అతను విచారించడం లేదుకూడాను. నగరంలో చదువుతున్న యువకులు గ్రామాలకు వచ్చి విద్యావశ్యకతను గూర్చి చెబుతున్నప్పటికీ అతను ఈ విషయానికి అంత విచారించడంలేదు. ఎంతో బలహీనంగా కనుపించే ఆ విద్యార్థులవంక చూచినప్పుడు వారిని నమ్మవలసిన అగత్యం అతనికి కనుపించేదికాదు. ఎప్పుడూ తనకు అనుసరణీయమని తోచిన మార్గాన తను వెళ్ళేవాడు.

పొలంలో పనిచేసేప్పుడు మౌనంగా వుండేవాడు. కొడుకులతో అనవసర ప్రసంగంలోకి దిగేవాడుకాదు. కొడుకులు కడసారినాటు ముగిస్తున్నారు. కడసారినాటు ముగించి నిటారుగా నిల్చున్నారు.

'అమ్మ ఏమిటి కావాలంటున్నది?' లాయ్‌టా అడిగాడు.

'ఉత్తర ప్రాంతంనుంచి ఒక వర్తకుడు వచ్చాడు. యుద్ధవార్త తీసుకునివచ్చాడు' అన్నాడు లాయ్‌టా. అతను ఈ వార్తవిని ఒక గంట అయింది. ఇప్పుడతనికి ఈ వార్త అంత ప్రధానమైనదిగా కనుపించడంలేదు. వుత్తరప్రాంతం ఇక్కడికి ఎంతోదూరం. అతను సూదుల్లాంటి చూపులతో నారుబారును చూచాడు. పచ్చని తీగలాగ కనుపించింది. తన కొడుకుల బాహువులవంక చూచాడు. తన బాహువుల లాగానే బలంగా ధృఢంగా వున్నాయి.

"వెళ్ళి కొంచెం పందిమాసం తీసుకునిరండి. ఇవాళ రాత్రి కాబేజితో కలిపి భుజిద్దాం' అన్నాడు చిన్నకొడుకుతో. 'నేను వెడతాలే!' అన్నాడు పెద్దకొడుకు చిలిపిగా.

లింగ్‌టాన్ ఇరువురు కొడుకులవంకా చూచాడు. లాయ్‌ఎర్ ముఖం ఎర్రబారింది. 'ఏమిటి మీ గొడవ?' అన్నాడు. లాయ్‌టా నవ్వాడు. మాట్లాడలేదు చిన్నవాడు చిలిపిగా కిలకిలమన్నాడు. తండ్రి నవ్వాడు. ఇంకా వీళ్ళు చిన్న వెధవలే' అనుకున్నాడు.

'సరే, మీ ఇష్టం. చెబితే చెప్పండి, లేకపోతే లేదు. మీ గొడవలు నాకెందుకు?' అన్నాడు నవ్వుతూ.

ఇలా ఎంతో సంతృప్తిగా మాట్లాడిన తరువాత ఇంటి ముఖం పట్టాడు. ఒక క్షణం తరువాత రెండవకొడుకు ఇంటికి రావడంచూచాడు. అతను అంతత్వరగా రావడానికి కారణం అతనిభార్యేనని అతను గమనించలేకపోయాడు.

లాయ్‌ఎర్ జేద్ వున్నగదిలోకి వెళ్ళాడు. జేద్ అక్కడలేదు.

'జేద్!' పిలిచాడు. జవాబులేదు. 'జేద్!' మళ్ళీ పిలిచాడు. ఈ మాటు నెమ్మదిగా పిలిచాడు. ఆమె ఎక్కడో దాక్కొని వుంటుంది. ఆమె ఒక్కోమాటు అలాగే దాక్కొని హఠాత్తుగావచ్చి అతన్ని నవ్వించేది. కాని ఈమాటు ఎంత పిలిచినా పలకలేదు. గది ఖాళీగావుంది.

ఆమె కనుపించనప్పుడల్లా అతనికి ఒకవిధమైన భయం కలిగేది. అలాంటి భయమేకలిగింది ఇప్పుడుకూడా. ఎక్కడికైనా వెళ్ళిపోయిందా ఏమిటి ?' అనిపించింది. తల్లిని

అడుగుదామని లోనికి వెళ్లాడు. తల్లి అక్కడలేదు. వంటింటి లోకి వెళ్లాడు. సాయంకాల భోజనానికి యెసరు కాగుతోంది. ఒకమూల కుప్పలా కూచునివుంది తల్లి. పొయ్యిలో ఎండు గడ్డి తోస్తున్నది. 'భార్య ఎక్కడున్నది?' అని అడగడానికి అత నికి సిగ్గయింది. అంచేత 'అదేమిటమ్మా ! ఎండుగడ్డి నీవు వేస్తున్నావు ? అది ఏమైంది ?' అన్నాడు కొంచెం కోపోద్రిక్త మైన కంఠంతో.

'ఎక్కడ చచ్చిందో ! మధ్యాహ్నంనుంచి ఎక్కడా కనుపించలేదు. ఈ రోజుల్లో మరీ పడుచువాళ్ళను పట్టలేకుండా వున్నాం. నా చిన్నతనంలో గడపదాటి వెళ్లేవాళ్ళంకాదు. ఇప్పుడు పడుచులు ఊరంతా ఒకకొలిక్కి తెలుస్తున్నారు!' అన్నది తల్లి.

'ఎక్కడుందో వెదికి పట్టుకొచ్చి వీపుచితగ్గొడతాను' అన్నాడు. అతనికి నిజంగా అంత కోపం వచ్చింది.

'అలాగేచెయ్యి' అన్నది తల్లి, కాని వెంటనే ఆమె చిన్నకళ్ళలోకి ఒక చిన్నినవ్వు వచ్చింది. ...సి ముందు నీ శక్తి ఆలోచించుకో. ఈ రోజుల్లో భా... అంత సులభంకాదు' అన్నది తల్లి.

పీలనంగా చిరునవ్వు న...

లింగ్‌సాయ్ పేదరైతుకూత...

భూమి కలిగివుండేవాడు...

అన్నవస్త్రాలు అనవసరం...

ఆమె పొయిలో గడ్డివేస్తూ కూచుని కొడుకుల భార్యలను గురించి ఆలోచించడం మొదలెట్టింది. ఏమైనా ఇంటి మంచికి కాని చెడుకుకాని వారే కారకులవుతారు. పెద్దల జీవితాలుకూడా వారిమీదనే ఆధారపడి వుంటాయి. కొడుకులను అంతగా నమ్మడానికి వీల్లేదు. ఎంచేతనంటే ఇంట్లో మగవారి బలంకంటే ఆడవారి బలమే ఎక్కువ. అంచేతనే జేన్‌ను కొడతానని కొడుకు చెప్పినప్పుడు ఆమె నమ్మలేదు.

'కొట్టడు' అనుకుంది తనలోతాను. తన భర్త తనను చిన్నతనంలో రెండుసార్లు కొట్టాడు. ఒకమాటు కోపంలో కొట్టాడు. మరోమాటు అసూయవల్ల కొట్టాడు కాని తన కొడుకుల కంటె ఎంతో బలశాలి. కాని తనుమాత్రం తన భర్త కొట్టడాన్ని ఎంతమాత్రం సహించలేదుకూడా. తనూ తనభర్తను గుద్ది అతని చెవిని కొరికింది.

'ఏమిటీ ఈ మచ్చ?' అని ఇప్పటికీ అతన్ని కొందరు గేలిచేస్తుంటారు.

'ఒక ...సులి' అంటూ అతను నవ్వుతూవుంటాడు.
ఆమె ... గామం. కాని జేన్!—జేన్‌ను ఎవ
...? ఆమె ఒక దీర్ఘనిశ్వాసం విడి
...తూవున్నది. ఆమె మోకాళ్లు
... అంతగా లెక్కచెయ్య
...వాసనచూచింది. అన్నం
...టింది. ఇక మంటపెట్ట

చాపకూర ఇంకా మిగిలివుంది. ఇంటి కొలనులో కావలసినన్ని చేపలువున్నాయి.

హాలులో టేబిల్ మీద అన్నంపళ్లెరాలు పరిచింది. తరువాత తనూ తనభర్తా పనుకునే గదిలోకి వెళ్ళింది. అతనక్కడ ఒళ్ళుకడుక్కుంటున్నాడు. ఒకరినొకరు చూచుకున్నారు. మాట్లాడుకోలేదు. కాని వారిముఖాల్లో ఒకవిధమైన శాంతివెలసింది. ఆమె మెల్లగా కూచుని ఒక పుల్లతో పళ్ళు గిల్లుకోడం మొదలెట్టింది. ఆమెకు అతన్ని చూస్తోంటే అతన్ని మొట్టమొదట చూచిన క్షణం జ్ఞాపకం వచ్చింది. ఆనాడు అతని శరీరం ఎలా వున్నదో ఈనాడూ ఆమె దృష్టికి అతని శరీరం అలానే కనుపించింది. అతను స్నానం ముగించి ఒళ్లు తుడుచుకుంటున్నాడు. మనిషి నిండుగా పరిశుభ్రంగా వున్నాడు. అతను నోరు తెరిచి ఆమె ముఖాన్ని దగ్గరగా తీసుకుని నవ్వితే ఒక తీయని పరిమళం తేలివచ్చేది. అతని బంధువు ఒకని దగ్గర ఒంటెవాసన కొట్టేది. 'అతని ప్రక్కన ఎలాపడుకుంటావు ?' ఒకనాడు అతని భార్యను అడిగింది. 'మగవారందరూ వాసనేస్తారు' అన్నదామె.

'నాభర్త అలాకాదు' అని సమాధానం చెప్పింది. ఎంతో గర్వంతో 'ఇక వెళ్ళి భోజనంచేస్తాను' లింగ్‌టాన్ చెప్పాడు హఠాత్తుగా. అతనికి పందిమాంసం విషయం జ్ఞాపకానికి వచ్చింది. పెద్దవాణ్ణి మాంసంకోసం పంపానే అన్నాడు. ఆమె కళ్లు పెద్దవిచేసుకుని 'మధ్యాహ్నం వండిన చేప కాస్త మిగిలింది' అన్నది.

'నాకు పందిమాంసం కావాలి' అన్నాడతను బిగ్గరగా.

'సరే నీ యిష్టం' అని లేచి వండడానికి వెళ్ళింది. ఆమె వంటింటిలోకి ప్రవేశించేసరికి టేబిల్ మీద మాంసం కనుపించింది.

ఒక ఎండుతామరాకులో కనుపించింది. ఆమె తామరాకు తీసి మాంసం పరీక్షించింది. వెంటనే చిన్న చిన్న ముక్కలుగాకోసి కాగుతున్న నీళ్ళలో ఉంచింది. వంటలో ఆమెది అమృతహస్తం. లింగ్టాన్ రెండుగుక్కలు పైప్ పీల్చే లోగా వంట తయారైంది. వంటింటి తలుపుదగ్గర నిల్చుని 'మీ అయ్య అన్నానికి వచ్చాడా?' అని అడిగింది.

లాయ్టా తన గదిలోనుంచి పిల్లాణ్ణోచంక నెత్తుకుని బైటికి వచ్చాడు.

'ఆ వచ్చాడు. మేమూ వస్తున్నాం' అన్నాడు.

లింగ్టాన్ రెండో కొడుకునుకూడా పిలిచాడు.

'వాడికిప్పుడు వినపడదులే. వాడు తన చిన్నదాని కోసం వెదుకుతున్నాడు' అన్నది తల్లి.

హాలులో ఇద్దరుకొడుకులూ పకాలున నవ్వడం వినిపించింది. తల్లి పళ్లెరాలలో అన్నంపెట్టుకుని తెచ్చి కొడుకుల ముందు ఉంచింది. తనూ వారితోపాటు నవ్వింది. పెద్దకోడలు వచ్చి జాకెట్ గుండీలు పెట్టుకుంటూ తలుపు దగ్గరగా నిల్చుంది.

'నేను వడ్డిస్తాలెండి అత్తయ్యా' అన్నది మర్యాదగా. అందరితోపాటు తనూ నవ్వింది కాని అందరూ ఎందుకు

నవ్వుతున్నారో తనకు అర్థం కాలేదు. ఇల్లంతా నవ్వుతూ ఉంటే తనూ నవ్వింది.

వారు కూచోగానే మూడవకొడుకు గొడ్లను తోలుకుని వచ్చాడు. వాడికి పదహారేళ్ళకంటె ఎక్కువ వయస్సుండదు. ఎక్కువగా మాట్లాడడు. వాడు ఇంటికిరాగానే వాడి క్షేమసమాచారాలు విచారిస్తున్నట్టుగా వాడివంక తల్లి తండ్రులు చూచారు.

ముగ్గురు కొడుకుల్లోనూ అతను ఎంతో అందమైనవాడు. వాడు భూలోకంలో పడినప్పటినుంచీ, 'ఇంత అందగాడు ఎలా బ్రతికి బట్టగడతాడో' అనుకునేవారు తల్లిదండ్రులు. వాడి కళ్ళు చిరుమీనాల్లా మిలమిలా మెరుస్తుండేవి. ముఖం చంద్రబింబంలా ఎంతో అందంగా ఉండేది. వాడు ఇంటికిరాగానే వాకిట్లో స్నానంచేసివచ్చి భోజనానికి కూచున్నాడు.

ముగ్గురు కొడుకులనూ చూడగానే తండ్రికి ఎంతో గర్వంకలిగింది. లాయ్‌ఎర్ స్థలం ఇంకా ఖాళీగావుంది. అతనింకారాలేదు. అతను రాగానే పంక్తి నిండుగా వుంటుంది. లాయ్‌టాకొడుకు అతనిఒళ్లోకూచున్నాడు. మధ్య మధ్యలో అతననోటికి అన్నం అందిస్తున్నాడు. సాయంకాలపు గాలి చల్లగా వీస్తోంది. పద్మాలు ముకుళించుకుంటున్నాయి. అంతా నిశ్శబ్దత వ్యాపించివుంది. నేతగదిలో మాత్రం మగ్గం ఆడినధ్వని వినిపిస్తోంది. లాయ్‌టాన్ చిన్నకోడలు ఇంకా పనిచేస్తూనే ఉంది.

లింగ్‌టాన్ భార్య గొడ్డుకు మేత వేసింది. పసుపుపచ్చ రంగుకుక్క మొరుగుతూ ఆకలితో దగ్గరికి వచ్చింది. ఇత

రులముందు ఈ కుక్క సింహంలా ఉంటుంది. కాని యజమాని ముందు పిల్లిలా కూచుంటుంది. రొట్టెముక్కలకోసం టేబిల్ కింద దూరింది. లింగ్‌టాన్ దాని మెత్తని వొంటిమీద కాళ్ళు పెట్టాడు. ఈ కుక్కకూడా వారి గృహసభ్యులలో ఒక భాగమే. అంచేత దానికీ ఒకమాంసంముక్క విసిరాడు.

ఇంటి చుట్టూవున్న పొలాలలో లాయ్‌ఎక్ జేద్‌కోసం ఇంకా వెదుకుతున్నాడు. సూర్యుడింకా పూర్తిగా అస్తమించ లేదు. అతని పండిన పసుపు వెలుగు తేనెలా పచ్చని లోయపై పరుచుకుంది. ఆమె పొలాలలో వున్నట్లయితే ఆమె బ్లాకోటు కనుపించేదే. గోధుమపైరు కోశారు, వరికూడా అంత ఎత్తులేదు. ఇక ఆమె ఎక్కడదాక్కుని వుంటుంది? కాని ఆమెఅక్కడలేదు. ఊళ్లోకి ఎక్కడికో వెళ్ళివుంటుంది. ఎక్కడికి వెళ్ళివుంటుందా అని ఒక్కమాటు ఆమె వెళ్ళే స్థలాలన్నీ ఆలోచించాడు. టీ షాపుకు వెళ్ళి వుండదు, అక్కడ మగవారందరూ చేరుతారు. వారి బంధువుల ఇంటికి వెళ్ళి వుండదు. ఎంచేతనంటే బంధువు కొడుక్కు మొట్టమొదట్లో జేద్‌సంబంధంచేదామనుకున్నారు. అప్పటినుంచి ఇద్దరికీ తీవ్రమైన మనస్పర్ధలు ఏర్పడ్డాయి. ఎవ రైనా జేద్‌ను నీకు ఎవరంటే ఇష్టం అని అడిగితే జేద్‌కూడా ఏమీ చెప్పేదికాదు. 'ఇద్దరూ ఒకే రకం; ఎలా చెప్పడం' అనేది.

అంచేత ఎవరెక్కువ శుల్కమిస్తే వారికిస్తానని జేద్ తండ్రి చెప్పాడు. కొడుకు లిద్దరూ తండ్రులను అధిక శుల్కం కోసం బెదిరించారు. ఒక రోజున లింగ్‌టాన్ తన మూడవ బంధువును టీ దుకాణంవద్ద కలుసుకొని ఒక ప్రక్కకు తీసు

కునివెళ్ళి, 'నేను నీ కంటె శ్రీమంతుణ్ణి కాబట్టి నేను నీకు 30 వెండి డాలర్లిస్తాను, తీసుకో. నా కుమారుడే ఈ పిల్లను వివాహమాడడానికి నీ కుమారుణ్ణి ఒప్పించు' అన్నాడు.

ఆ బంధువు అందుకు అంగీకరించాడు. అంత డబ్బు ఒక పండితుడుకూడా ఒక అరసంవత్సరములో సంపాదించ లేడు ఈవిధంగా లాయ్‌ఎక్ జేడ్‌ల వివాహం నిశ్చయమైంది. త్వరలో వివాహం జరిగిపోయింది కాని లాయ్‌ఎక్ జేడ్‌ను ఒక విషయానికి క్షమించలేకపోయాడు. ఎంచేతనంటే జేడ్ అతన్ని ప్రత్యేకంగా ఎన్నుకోలేదు. అలా ఎందువల్ల ఎన్నుకో లేదో అనేక పర్యాయాలు అడుగుదామనుకున్నాడు. ఎన్నో పర్యాయాలు ఆమె ప్రక్కన పడుకున్నప్పుడు ఈ విషయం అడగాలనిపించేది. కాని అడగలేకపోయేవాడు. ఆమె శరీరం అతనికి బాగా సుపరిచితమైనదైనా ఆమె అంతరాత్మ అతనికి అవగాహనకాలేదు. అంచేత ఆవిడపట్ల అతనిప్రేమలో స్థిమితత్వమూ శాంతీ నెలకొనలేదు. ఇంకా అతనిప్రేమలో అంతు లేని ఆతురత కనుపిస్తూఉంది.

అతను త్వరత్వరగా అంగలు వేసుకుంటూ ఆమె కోసం గ్రామంలోకి వెళ్ళాడు. ఎక్కడైనా ఆ సన్నని అందమైనపిల్ల కనుపిస్తుందేమోనని వెదికాడు. ఇరవైరోజులక్రితం ఆమె తన దీర్ఘకేశాలను కత్తిరించుకున్నది. అప్పుడతనికి చెప్పరాని కోపం వచ్చింది.

'నీ జుట్టు నీదికాదు, నాది. నీకు కత్తిరించుకునే అధికారం లేదు' అని గద్దించాడు.

కాని ఆమె ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. ఆమె ఎంతసేపటికీ సమాధానం చెప్పకపోవటం చూచి అతను బిగ్గరగా, 'ఎక్కడ తగలేశావు, నువ్వు కత్తిరించిన జుట్టు' అని అరిచాడు. ఆమె ఈ గద్దింపుకుకూడా సమాధానం చెప్పకుండా మెల్లగా గదిలోకి వెళ్ళి జుట్టును తెచ్చి చూపింది. జుట్టుచివరను ఒక ఎర్రని పేలికతో కట్టింది. జుట్టును తెచ్చి అతని కాళ్ళమీద పడేసింది. అతని కళ్ళలో నీళ్లు తిరిగాయి. అతనికి సంబంధించినదేదో ప్రాణపదార్థం ప్రాణంపోయి తన దగ్గరపడి ఉన్నట్టుగా తోచింది.

'ఏం చెయ్యాలి దీన్ని' అన్నాడు అతను దిగులుగా.

'అమ్మండి. ఆ డబ్బుతో నేను రెండుజతలు చెవుల జోళ్లు కొనుక్కుంటాను' అన్నది జేన్.

'నీకు చెవిజోళ్లు కావాలా? కాని నీవు చెవులు కుట్టించుకోలేదుగా!' అన్నాడతను ఆశ్చర్యంతో.

'ఇప్పుడు కుట్టించుకుంటాను' అన్నది జేన్.

'నేను నీకు అంటుజోళ్లు కొనిస్తాలే. కాని నీ జుట్టుతో కాదు' అన్నాడతను.

అతను ఆజుట్టు తీసుకుని తలపెట్టెలో పెట్టాడు. అతని విలువగల బట్టలూ, అతను చిన్నతనంలో ధరిస్తూవచ్చిన వెండి హారం ఆపెట్టెలోనే దాస్తూఉంటాడు. వారి వృద్ధాప్యంలో ఆ జుట్టుతీసుకుని చూస్తారు.

చెవిజోళ్లు కొనడానికి అతని కిప్పుడు సమయంచిక్కడం లేదు. పగలంతా పనిపాటుతో సరిపోతూ ఉంది. ఇలా అనుకుంటూ అతను ఊరంతా వెదకసాగాడు. అతనికి ఎందు

చేతనో ఏదో అనుమానం తట్టసాగింది. వెంటనే తన బంధువు గృహానికి కేసి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి ఆ బంధువు భార్య వాకిట్లో నిల్చునివుంది. ఆమె పెద్దఎలుగుబంటల్లే ఉంది. అన్నంగిన్నె పట్టుకుని అన్నంతింటున్నది. ఆమెను చూడగానే జేద్ విషయం అడగడం అతని కంత ఇష్టంకాలేదు. 'అన్నం తింటున్నావా అక్కయ్యా' అని అడిగాడు ఎంతో మర్యాదగా. 'నీవుకూడా రా, భోంచేద్దువుగాని.' అన్నదిమర్యాదగా.

'ఇప్పుడు భోంచెయ్యనులే. ఇంట్లో ఎవరూలేరా?' అన్నాడు.

'నా భర్త భోజనం చేస్తున్నాడు. మీ అన్న ఇంటికి రాలేదు' అన్నది.

'అయితే ఎక్కడికెళ్ళాడు?' అన్నాడు లాయ్ఎక్.

'నగరంవైపుకు వెళ్ళాడు. పొద్దు ఆ చెట్టుమీద ఉండగా బయలుదేరాడు. ఇప్పుడెక్కడున్నాడో తెలీదు' అన్నదామె.

ఆమె మళ్ళీ అన్నం తినడం ప్రారంభించింది. అతని హృదయం ప్రళయంగా కొట్టుకుంటోంది. జేద్ కనక అతనితో వెళ్ళి ఉన్నట్టయితే అతను ఇరువురినీ హత్యచేసి వారిశవాలు అందరూ చూచేట్టుగా నడిబజారులో పరుస్తాడు. అతని నెత్తురు పొంగి అతని కపోలాలు ఎరుపెక్కాయి. అతను కుడి చెయ్యి బిగించుకున్నాడు.

ఇలా ఉద్రిక్తుడై గ్రామంలోని టీ దుకాణం ముందు ఉన్న పెద్ద బయలులోకి వచ్చాడు. ఆ బయలులో పెద్ద గుంపు కూడి ఉన్నది. బొమ్మలాటవారిని, లేక వీధి నటకులను చూడ

దానికి వచ్చేసంతమాత్రాన ఏది కాదు. నలుగురైదుగురు నగరంనుంచివచ్చిన వ్యక్తులు తోలుబొమ్మలాట చూస్తున్నారు. అతను ఆ బొమ్మలను చూడలేదు. గుంపు విడిపోగానే ఒక చక్కని బెంచీమీద కూచున్న లాసిబంసుపు అతని కళ్ళ పడ్డాడు. జేద్ తప్పకుండా అతని పక్కన ఉంటుండనుకున్నాడు, కాని లేదు. అతను ఆశ్చర్యచకితుడైనాడు. అతని నెత్తురంతా ఒక్కమాటుగా చల్లబడింది. అతనికి ఆకలివేస్తున్నట్టూ బలహీనత ఆవరించినట్టూ అనిపించింది. జేద్ కనుపిస్తే నిజంగా ఆమెను చావచితకతన్నేసేవాడు.

ఈ సమయంలో అతనికి ఒక గొంతు వినిపించింది. ఆ మాటలు జేద్ ఆలోచనలో ఇంతవరకూ అతను పట్టించుకోలేదు. ఒక యువకుడు మాట్లాడుతున్నాడు. ఆ యువకుడు ఇలా మాట్లాడుతున్నాడు 'మన ఇళ్లూ మన గృహాలూ మనం తగలెట్టాలి. ఒక ముద్దయినా శత్రువులనోట పడకూడదు. మీరందరూ ఇందుకు సిద్ధంగా ఉన్నారా?' అంటున్నాడు.

మందలో ఒక్కరూ మాట్లాడలేదు. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. అతని మాటల్లోని అర్థం వారికి తెలీలేదు. గుడ్డమీద ఆడుతున్న బొమ్మలవంకే వారు నిశ్చలంగా చూస్తున్నారు. లాయిస్ కూడా చూశాడు. అది ఒకనగరం యొక్క బొమ్మ. ఆనగరం మంటలలో తగులబడిపోతూ ఉంది. మందంతా ఆ బొమ్మవంక చూస్తూ ఉంది. కాని ఒక్కరూ ఒక్కమాటయినా మాట్లాడలేదు. అప్పుడు లాయిస్ ఎవరో కదిలి ముందుకురావడం చూశాడు. అది జేద్.

'మేం చెయ్యగలం' అరిచింది జేద్. అంటూవుండగా

జేన్ అరిచింది. అతను భయపడ్డాడు. ఈమాటలకు అర్థంఏమిటి? అతని ఆజ్ఞ లేకుండా అలా మాట్లాడడానికి ఆమెకు హక్కెవరిచ్చారు? 'త్వరగా ఇంటికి రా. నాకు ఆకలేస్తోంది' అతను పెద్దగా అరిచాడు. ఆమె వెనుదిరిగి అతన్ని చూచింది. కాని అతన్ని గమనించినట్టులేదు. కాని అతని పెద్దకేక వినగానే ఆ గుంపంతా మళ్ళీ వారి గ్రామీణజీవనంలోకి మళ్ళింది. మందంతా కదిలింది. వారికి ఆకలి జ్ఞాపకం వచ్చింది. అందరూ లేచి ఇళ్ళకు నడవడం మొదలెట్టారు.

"నేను చూపించిన విషయాలు నిజమనుకోండి' అన్నాడు ఆ యువకుడు.

జేన్ దగ్గరికి వచ్చేవరకూ అతను అక్కడే నిల్చున్నాడు. జేన్ సమీపించగానే నడవడం మొదలెట్టాడు. జేన్ నిశ్శబ్దంగా అనుసరించడం మొదలెట్టింది. గ్రామం వెలుపలికి వచ్చేవరకూ అతనేమీ మాట్లాడలేదు. 'అందరికంటాపడి నన్నెందుకు నవ్వులపాలుచేస్తావు?' అన్నాడు గొంతు బిగపట్టుకుని.

జేన్ సమాధానం చెప్పలేదు. నిశ్చలంగా అతనివెంట నడవడం మొదలెట్టింది. 'ఆకలి భగ్గుమని మండిపోతుంటే ఇంటికి వచ్చావు' అన్నాడు బిగ్గరగా.

'మరెందుకు భోంచేశావుకావు?' అన్నది మెల్లగా.

'నువ్వు ఉండవలసిన స్థలంలో లేకపోతే నాకు అన్నం ఎలా సహిస్తుంది' అన్నాడు.

'నీ వెక్కడున్నావని అడగడానికి నా కెంత సిగ్గయిందనుకున్నావు?' అన్నాడు బిగ్గరగా.

ఈ మాటకుకూడా జేద్ సమాధానం చెప్పలేదు. వెనుక నడుస్తున్న జేద్ ఏం ఆలోచిస్తూందో అని తెలుసుకోవాలన్న ఉత్సుకత అతనికి ఎక్కువైంది ఇక భరించలేకపోయాడు. వెనుదిరిగి చూచాడు. సూటిగా జేద్ కళ్ళవంక చూచాడు. జేద్ నవ్వుతోంది. వారి కనులు కలుసుకోగానే జేద్ పట్టలేక పకాలున నవ్వేసింది. అతనిలో అంతసేపూ భగ భగ మండు తున్న కోపం గాలిలా ఎగిరిపోయింది. జేద్ రెండడుగులు ముందుకు వేసి అతని చెయ్యి పట్టుకున్నది. అతను వదిలించు కోలేదు.

'నన్ను నీవు సరిగా చూడటంలేదు జేద్' అన్నాడు, ఎంతో దీనంగా.

'పాపం! చాలా చిక్కిపోయావే, నిన్ను చూచి జాలిపడా ల్సిందే' అన్నది నవ్వుతూ.

అతనికి ఆమె నవ్వు అంత ఇష్టంగా తోచలేదు. లతనికి ఏం కావాలో తోచలేదు. కాని ఆమె నవ్వుమాత్రం అతన్ని కొద్దిగా ప్రకుపితుణ్ణి చేసింది. తెల్లని వెండి బిళ్ళలా వెలుగు తున్న చంద్రబింబం బంగారురంగుగా మారుతున్నది. కప్పల అరుపులు వినిపిస్తున్నాయి. అతని చేతిలో ఆమెచెయ్యి వణుకుతున్న చిరుగుండెలా ఉన్నది. అత నా చెయ్యి తీసు కుని తన గొంతుదగ్గర ఉంచుకున్నాడు. అతనిలో ఏదో పెద్ద బరువు ఉన్నట్టనిపించింది. ఆబరువును ఎలా వ్యక్తీకరించాలో అతనికి తెలియలేదు.

'నేను చదువుకుని ఉంటే ఎంతో బావుండేది' అన్నాడు.

'ఎందుకూ చదువు!' అన్నది జేద్.

'నా బరువు దించుకోడానికి. ప్రస్తుతం నాహృదయంలో ఉన్న బరువు నీకు మాటలలో చెప్పడానికి' అన్నాడు.

'ఇప్పుడు నీవు హృదయంలో ఏమనుకుంటున్నావేం' అన్నది జేన్.

'నాకు అర్థమవుతూంది. కాని చెప్పడానికి తోచడం లేదు.' అన్నాడు. ఇద్దరూ ఒకరికి ఎదురుగా ఒకరు నిల్చున్నారు. లాయ్‌ఎన్ మెల్లగా ఆమె బుజాలమీధ చేతులు వేసి దగ్గరికి లాక్కున్నాడు. అలా ఒకనిమిషం చేతుల్లో ఉంచుకున్నాడు. ఆమె కదలకుండా అలానేఉంది అలా ఒకనిమిషం ఎంతో దగ్గరగా ఉండిపోయారు.

'నేనూ చదువుకున్న దాన్ని కాదు' అన్నది మెల్లగా.

'అందుకనేనా నాతో ఎక్కువగా మాట్లాడవు?'' అన్నాడతను.

'నీవు ఎప్పుడూ ఏమీ మాట్లాడవు. మరి నే నెలా మాట్లాడను. ఒకరి నొకరు అర్థం చేసుకోవాలంటే పరస్పరం మాట్లాడుకోవాలికదా!' అన్నది జేన్. ఒక క్షణంపాటు జేన్ అన్న ఈ మాటను గురించి అతను ఆలోచించాడు. ఇద్దరూ ఒకరిలో ఒకరు ఏదో అన్వేషిస్తున్నారు. దేనికోసమో వేచివున్నారు. ఎవరు ముందు చెబుతారా అని వేచివున్నారు. 'నా హృదయంలో ఉన్నదంతా నేను చెప్పేస్తాను. నీ హృదయంలో ఉన్నదంతా నీవు చెబుతావా?' అని అడిగాడతను.

'తప్పకుండా' అన్నది జేన్.

అతని చేతులు ఆమె బుజాలమీదినుంచి వాలి పోయాయి. ఆమెను స్పృశించకుండానే ఆమెకు యెంతో సామీప్యంలో వున్నట్టు అతనికి అనిపించింది.

'అయితే యివాళ రాత్రికి యిద్దరంకలిసి మాట్లాడు కుందాం' అన్నాడు.

'సరే' అన్నది జేద్.

ఆమెగొంతు ఎంతో మృదువుగా వున్నది, యెవరో దేవత గొంతులా. ఒకరిచేతులు వొకరు పట్టుకుని యింటి వైపు నడిచారు. ఇంటికి సమీపించగానే ఆమె వెనకాలే నడవడం మొదలెట్టింది.

వాళ్లు యింటికి చేరేసరికి అందరూ భోజనాలు ముగించారు. టేబిల్ దగ్గర తల్లి, పెద్దకోడలు, చిన్న చెల్లెలు భోజనాలు చేస్తున్నారు.

'ఇంతసేపూ ఎక్కడున్నారు? మీ కోసం ఎవరు కాచు కూర్చుంటారు?' అంది తల్లి.

'నాకోసం ఎవరూ కాచుకూర్చో నక్కరలేదు' అన్నాడతను. భార్యతో 'నా అన్నంగిన్నె పట్రా. నేను భోంచేస్తాను' అన్నాడు. జేద్ అందరు ఇల్లాండ్రలాగానే అన్నం గిన్నెనింపి అతనికిచ్చి తనువెళ్ళి ఆడవారి పంక్తిలో కూచుంది. ఏదో కలకంటున్నట్టు అన్నంగిన్నె దగ్గరికి తీసుకుని తినడం ప్రారంభించింది. ఈ రాత్రి ఆమె ఆమెభర్త హృదయాన్ని అవగతం చేసుకోబోతుంది కాబోలు. అన్నంముగించి అందరూ లేస్తున్నప్పుడు 'నీవు అన్నంవండలేదు కాబట్టి గిన్నెలు కడుగు' అన్నది అత్త.

జేడ్ 'అలాగే అత్తయ్యా' అన్నది వినయంగా. ఆమె గొంతు ఎంతో మృదువుగా ఉన్నది. కొడుకు కొట్టాడేమో అనుకున్నది తల్లి.

లింగ్‌సాన్ బయట బెంచీమీద కూచున్నది. దగ్గరగా నేలమీద కొడుకులు కూచున్నారు. చిన్నవాడు ఒక చిన్న చిరుచాపమీద పడుకుని కునుకుతీస్తున్నాడు. రెండో కొడుకు ఎంతో హాయిగా భోజనం చేస్తున్నాడు.

తప్పకుండా భార్యను కొట్టి వుంటాడు, అనుకున్నది. అందుకు ఆమెకు సంతోషం కలిగిందికూడా. ఆమె ఉద్దేశంలో భర్త భార్యను కొట్టాలి.

లాయ్‌ఎన్, జేడ్ శయనమందిరం చేరారు. అతను ఆమెప్రక్కన పడుకోగానే ఏదో కొత్తగా అనిపించింది. ఆమె పెళ్ళినాటికంటే కొత్తగా కనుపించింది. ఆమె శరీరాన్ని అతను బాగా తెలుసుకున్నాడు. కాని ఆమెహృదయం యింకా అతనికి అవగతం కాలేదు. ఈనాడు అతను ఆమెను స్పృశించ దలుచుకోలేదు. ఆమెమాటలు వినదలుచుకున్నాడు అంతే.

'నీవూ వేచి ఉన్నావా?' అతను అడిగాడు.

'అవును' అన్నది జేడ్.

'ఎవరు ముందు మాట్లాడాలి?'

'నీవే. నీవేం అడగదలుచుకున్నావో అడుగు' అన్నది జేడ్.

అతను అడగవలసిన దేమిటి? అతని నోటి చివర వరకు వచ్చింది.

'నీవు ఎప్పుడైనా నిన్ను పెండ్లి చేసుకోవాలనుకు నా బంధువును తలుచుకుంటావా?' అనడిగాడు.

'అదా నీ అనుమానం?' ఆమె బిగ్గరగా అన్నది. హఠాత్తుగా మంచంమీద లేచి కూచున్నది. 'ఓరి చిలిపికుర్రాడా! ఇదా నీ అనుమానం. చెప్పావుకావేం. నీను ఈ ప్రశ్నకు జవాబు చెప్పనులే' అన్నది.

లాయ్‌ఎర్ తలలో ఒక పెద్ద సుడిగుండం తిరుగుతున్నట్టు అనిపించింది.

'మరి పగలంతా నీవు ఏమీ మాట్లాడకుండా తిరుగుతుంటావు. రాత్రిళ్ళుకూడా ఏమీ మాట్లాడవు. నీవు ఈ విషయాన్ని గురించే ఆలోచిస్తుంటా వనుకున్నాను' అని ఏడ్చాడు లాయ్‌ఎర్.

'నేను అనేక విషయాలు ఆలోచిస్తుంటాను. నాకు అనేక ఆలోచనలు గొలుసుకట్టులా వస్తుంటాయి. ఒక పక్షిని గురించిన ఆలోచన వస్తుందనుకో. అది ఎలా ఎగురుతుందో, దానిలాగా నేనెందుకు యెగరలేనో, విమానాలు యెలా ఎగురుతాయో, వాటిని యెలా తయారుచేస్తారో, అవి నగరాలను యెలా ధ్వంసం చేస్తాయో,—ఇలా అనేక ఆలోచనా పరంపరలు వస్తాయి' అన్నది జేడ్.

ఆమె ఆలోచనాప్రవాహాన్ని అతను ఆపుతూ, 'ఉత్తరాన నగరాలు యిక్కడికి యెంతో దూరం' అన్నాడు. 'నీవు ఈనాడు, ఆ యువకుని ఉపన్యాసం వినడానికి యెందుకు వెళ్ళావు?' అన్నాడు లాయ్‌ఎర్.

'నా సీలంకోటు కుట్టుకుంటూ కూచున్నాను. దారం అయిపోయింది. అత్తయ్య నడిగితే తెల్లదారంమాత్రమే ఉన్న దన్నది. దారంకోసం వీధిలోకి వెళ్ళాను. వెళ్ళేసరికి అక్కడ జనంకూడిఉన్నారు' అన్నది జేన్.

'నీవు ఒంటరిగా వీధిలోకి వెళ్ళడం అంత సబబుకాదు' అన్నాడు. లాయ్‌ఎక్.

'ఎందుకని?'

'ఇతరులు చూస్తారు'

'నేను చూడనుగా'

'వాళ్లు నీవంక చూడడం నా కిష్టంలేదు. నీవు అందమైన పిల్లవు. నా భార్యవు.'

'కాని అస్తమానం ఇంట్లోనే ఎలా పడిఉండగలను. ఇవి పూర్వపుదినాలు కావు.'

'ఆరోజులే నాకు ఇష్టం. నీవు ఇంట్లోనే ఉండాలి. నిన్ను ఇంట్లోపెట్టి తాళంవేసేస్తాను'

'నీవు తాళంవేస్తే నేను భోజనమే చెయ్యను. చసిపోతాను'

'నిన్ను చసిపోనివ్వను.'

ఆమె నవ్వింది. 'ఇప్పుడు రోజులు మారాయి. 'నా ఇష్టంవచ్చినట్లు నేను వెళ్ళి వస్తూంటాను.'

'నీతో ఎన్నడైనా యెవరైనా మాట్లాడుతారా?'

'అవసరం వున్నంతవరకు మాట్లాడుతారు.'

ఇద్దరూ ఒక క్షణం మౌనంగావున్నారు.

'నీవు నన్ను మొట్టమొదట చూచినప్పుడు ఏమనుకున్నావో చెప్పు' అని అడిగాడు లాయ్‌ఎక్.

పక్కదుప్పటి మునివ్రేళ్ళతో మెలిపెడుతూ 'నాకు జ్ఞాపకంలేదు' అన్నది.

'మొట్టమొదటిసారి అంటే పెళ్ళయిన తరువాత' అన్నాడు

ఆమెతల ఒక పక్కకు తిప్పింది. వెన్నెట్లో ఆమె ముఖం విస్పష్టంగా కనుపిస్తున్నది. చిన్న నుదుసు, అందమైన ముక్కు, చక్కని పెదవులు—అన్నీ.

'నాకన్న నీవు పొడుగ్గా ఉండడం నా కెంతో ఇష్టం. నేను స్త్రీలలో చాలా పొడుగ్గా ఉంటాను' అన్నది జేన్.

'నీవు అంత పొడుగు లేవు' అన్నా డతను.

'నీ వేం అనుకున్నావో చెప్పలేదేం' అడిగిం దామె.

'నీవే కావాలనుకున్నాను.' అన్నా డతను.

ఆమె హఠాత్తుగా తలయెత్తి చూచింది. 'నేనూ అలాగే అనుకున్నాను. ఆశ్చర్యపోయాను. మనిద్దరం కలిసి ఎన్నడైనా మాట్లాడుతామా అనుకున్నాను.

'అందరు భార్యాభర్తల్లాగా మనమూ ఉంటామా? మనలో ఏదైనా విశిష్టతఉన్నదా? అని ఆలోచించాను. నన్ను నీవు పూర్తిగా అర్థంచేసుకుంటావా లేక ఊరికే అన్నంవండి పెట్టేభార్యగా చూస్తావా—అని ఆలోచించాను.

'నీవు చదువుకుంటావా? పుస్తకాల్లో ఎన్నో విషయాలు తెలుసుకోవలసినవి వుంటాయి. నాకో పుస్తకం కొనిస్తావా? అదీ అసలురహస్యం. నాకు చెవిజోళ్ళకు మారుగా ఒక

పుస్తకం కొనివ్వు. అందుకనే నేను జుట్టు కోసుకున్నాను. ఒకపుస్తకం కొనడానికి జుట్టు అమ్ముకుందా మనుకున్నాను. నీకు ఈ విషయం అప్పుడు చెప్పాలంటే భయమేసింది. అందుచేత అంటుజోళ్ళని చెప్పాను.

'పుస్తకం! మనలాంటివాళ్ళు పుస్తకంతో ఏంచేస్తారు?' అన్నాడతను.

'నాకు పుస్తకమే కావాలి' అన్నది జేన్.

'నీకు చదవడం రాకపోతే?'

'నేను చదవగలను.'

ఈమాట జేన్ అన్నప్పుడు అతను ఆశ్చర్యపోయాడు. పక్షిలాగ యెగరగలనన్నా అంత ఆశ్చర్యపోయేవాడు కాదు.

'ఎలా చదవగలవు? నీ లాంటి స్త్రీలకు చదు వెలా వస్తుంది?' అన్నాడు.

'నేను చదువుకున్నాను. నా చిన్నతమ్ముడొకడు బడికి వెళ్ళుతూండేవాడు. వాడిదగ్గర రోజు కొక మాటచొప్పున కొద్ది కొద్దిగా నేర్చుకున్నాను' అన్నది. ఒక నిమిషం లాయ్‌ఎర్ ఆలోచించాడు.

తరువాత నెమ్మదిగా 'నీకు పుస్తకమే అవసరమయితే అలాగే కొనిస్తాను. కాని ఈ ఇంట్లో స్త్రీ పుస్తకం చదవడం చూస్తానని నేననుకోలేదు' అన్నాడు. ఈ విధంగా అర్ధరాత్రి గడిచేవరకూ మాట్లాడుకున్నారు. వారికి అలసట, నిద్ర వచ్చాయి.

'ఇక నిద్రపోదాం. రేపు పనికి వెళ్లాలి. పుస్తకంకోసం నగరానికి కూడా వెళ్ళాలి—' అన్నాడు.

అతనికి గొంతు బిగబట్టినట్టయింది. ఆమె ముడుచు కుని అతనిపక్కన పడుకునివుంది. ఆమె అంతట ఆమే అలా పడుకోడం అతని కెంతో ముచ్చటగా అనిపించింది. అతని జీవితంలోకల్లా తీయనిక్షణం అది. పెండ్లినాటి రాత్రికన్న యెంతో మధురమైన క్షణం యిది. ఇంతవరకూ ఆమెను అర్థంచేసుకోలేకపోయినందుకు అతనెంతో విచారిం చాడు. ఈరోజున తనను తాను సమర్పించుకున్నది. అలా స్వసమర్పణ కావించుకున్న ఆమెను అతనుఅనుభోగించాడు.

ఆ రోజు అతను నిద్రపోగానే తనలోనుంచి ఏ దేవతో చెబుతున్నట్టు ఆమె తప్పక గర్భంధరిస్తుందని అతనికి తోచింది. ఈ రాత్రినుంచి అతని కో కుమారుడు ఉద్భవిస్తాడు.

## శ్రీ వేమన గ్రంథాలయము
### తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

## 2

నగరంనుంచి ఎప్పుడైనా ఏవైనా సామాన్లుకాని వస్తు వులుకాని కావాలంటే లాయిడేరే తెచ్చేవాడు. ముగ్గురు కొడుకుల్లోనూ అతని కొక్కడికే నగరంలో మసలుకోవడం బాగా తెలుసు. తండ్రి ఎప్పుడూ నగరానికి వెళ్ళేవాడుకాదు. ఎందుకనంటే అతనికి ఊపిరి సలపదనేవాడు. తల్లికూడా వెళ్లేది కాదు. ఎందువల్లనంటే నగరజీవులందరూ ఏదో వాసనేస్తారు అనేది. ఈ మాటకు లింగ్‌టాన్ పూర్తిగా అంగీకరించేవాడు కాదు. ప్రతి మనుష్యశరీరమూ ఏదో ఒక వాసన వేస్తుందనే

...డు. అప్పుడు ఆమె ఎంతో గట్టిగా గ్రామజీవితమే తనకు ఇష్టమైనదని వాదించేది. పెద్దవాడు నగరవాసుల మాటలు నమ్మేవాడు. చిన్నవాడు మరీ పసివాడు కావడంచేత అతన్ని నగరంలోకి వెళ్ళనిచ్చేవారు కాదు. అతను దుర్గలవాట్లు చేసుకుని చెడిపోవచ్చునని భయం.

అంచేత లాయ్‌పెర్ ఒక్కడుమాత్రమే నగరంలోని పనులు చూస్తుండేవాడు.

ఇలా ఎన్నో సంవత్సరాలనుంచి అతను నగరంలో పనులుచూచుకునివస్తున్నాడు. నగరద్వారం ప్రవేశించేటప్పుడు అతనికి ఇతర గ్రామవాసులలాగా ఎంతమాత్రం బిడియం ఉండేదికాదు. తల నెత్తుకుని నిటారుగా నడుస్తూ వెళ్ళేవాడు. వేసవికావడంవల్ల అతను సాక్సు వేసుకోలేదు. కొత్తవి గరికతో చేసిన చెప్పులు వేసుకున్నాడు. జుట్టు దువ్వుకున్నాడు. అతనికి తన పని ఎక్కడ చేసుకోవాలో బాగా తెలుసు. నగరవాసులతో ఏదైనా మాట్లాడవలసివస్తే సూటిగా కొద్దిగా మర్యాదగా మాట్లాడేవాడు. ఏదైనా బేరం చెయ్యవలసి వచ్చినప్పుడు ఎంతో జాగ్రత్తగా చేసేవాడు. కాని ఇవాళ అతను నగరానికి పుస్తకం కొనడానికై వచ్చాడు. పుస్తకాల విషయం అతనికి బొత్తుగా తెలీదు. పుస్తకాల బజారుకు వెళ్ళాడు. అక్కడ పుస్తకాల వర్తకులు పుస్తకాలన్నీ బల్లలమీద పరుచుకునిఉన్నారు. వాటివంక ఆశ్చర్యంతో కూడుకున్న దృష్టితో చూచాడు. కొన్నిపుస్తకాలు పెద్దవి, కొన్నిచిన్నవి. కాని అతని దృష్టికి అన్నిపుస్తకాలూ ఒకవిధంగానే కనుపించాయి. అతను అక్కడ తారట్లాడసంచూచి వర్తకులు

అతని కేలాటిపుస్తకం కావాలని అడిగారు. తన భార్యకు పుస్తకంకావాలని చెప్పడానికి అతనికి ఎంతోసిగ్గేసింది. అందు చేత పుస్తకం తనకే కావలసిఉన్నట్టుగా నటించసాగాడు.

ఈ పుస్తకాలమ్మే వర్తకులందరూ ఎంతో ముసలివారు. ఒకప్పుడు పండితులుగా, ఉపాధ్యాయులుగా ఉండేవారు. వాళ్లు జీవితంలో ఎక్కువ విజయాన్ని సాధించలేదు. అందువల్ల పుస్తకాల వ్యాపారంలోకి దిగారు. కాని వారిలో ఎవరూ లాయ్ఎర్‌కు చదువురాదని ఊహించలేకపోయారు. వారు తమ పుస్తకాలు చూపుతూ, ఒక్కొక్క పుస్తకాన్ని గురించి వివరించి చెప్పడం మొదలెట్టారు. పుస్తకాలన్నీ అతనిముందు ఉంచారు. ఒక మంచి అట్టఉన్న పుస్తకంతీసి, ఇదేం పుస్తకం అన్నాడతను.

'పుస్తకంమీద పేరురాసిఉంది' అని పేరుచూపించాడు వర్తకుడు.

లాయ్ఎర్ నవ్వి బిడియంతో 'నిజానికి నాకు చదువు రాదు' అన్నాడు. లాయ్ఎర్‌మాట అతను నమ్మలేక పోయాడు. 'అయితే నీకు పుస్తకం ఎందుకు? మరేదైనావస్తువు కొనుక్కోకూడదూ?' అన్నాడు.

లాయ్ఎర్‌కు కొంచెం కోపంవచ్చింది. 'నేను పుస్తకం కొంటాను. కాని నీ దగ్గరకొనను' అన్నాడు. అతను తన పెద్దచెల్లెలి ఇంటికి వెడదామనుకున్నాడు. అక్కడ ఆమె భర్తఉంటే ఏది మంచిపుస్తకం అని అడుగుదామనుకున్నాడు. అడిగివచ్చి ఈ దుకాణదారుడు చూస్తుండగానే ప్రక్క దుకాణంలో కొందామనుకున్నాడు.

ఇలా అనుకుని త్వరత్వరగా నడిచి వెళ్ళిపోయాడు. తన చెల్లెలిభర్తదుకాణంవద్దకు వచ్చాడు. ఆ దుకాణంలో విదేశవస్తువులు, ఫ్లాష్‌లైట్లు, రబ్బరు చెప్పులు, పెన్నులు, పెన్సిళ్లు మరెన్నో రకరకాల వస్తువులున్నాయి. స్త్రీల చిత్తరువులు గీసిన పటాలున్నాయి. ఇతర సమయాల్లోఅయితే లాయ్‌ఎర్ ఆపటాలు, ఆవస్తువులూ చూస్తూ కూచునేవాడే. కాని ఈనాడు సరాసరి వేగంగా లోపలికి వెళ్ళిపోయాడు. లోపలికివెళ్ళి చూచేసరికి తన బావగారు కుర్చీలో పడుకుని విసురుకుంటూ పిల్లను ఆడిస్తున్నాడు. కొంచెం లావుగా ఉన్నాడు. చొక్కా తొడుక్కునివుండకపోవడం వల్ల అతని శరీరం స్త్రీశరీరంలా వుంది. అతని స్నేహితులందరూ అతనికి సిరి హెచ్చుతూ వుండడంవల్ల అతను బాగా భుజించి తాగడంవల్ల లావెక్కుతున్నాడనుకున్నారు.

లాయ్‌ఎర్ రాగానే, 'ఓ, బావగారా, రండి, కూర్చోండి' అన్నాడు. వెంటనే తన భార్యను, 'ఒసేవ్, నీ తమ్ముడొచ్చాడేవ్' అంటూ పిలిచాడు.

ఆమె నవ్వుతూ బైటికి వచ్చింది. రాగానే, 'ఎప్పుడొచ్చావురా, అంతా బావున్నారా. నాన్నా, అమ్మా కులాసాగా ఉన్నారా? వదినను ఒక్కమారైనా తీసుకరావేం?' అంటూ క్షేమసమాచారాలు విచారించింది. ఆమె నోటిలోనుంచి ఈ మాటలు నీటి బుడగల్లావచ్చాయి. మధ్య మధ్య నవ్వుతోంది. నవ్వూ మాటలూ కలసిపోయాయి. వెంటనే లోనికి వెళ్ళి కేకులు తీసుకునవచ్చి టీతెచ్చిచ్చింది. టీ సేవించి లాయ్‌ఎర్ సంగతి సందర్భాలన్నీ చెప్పాడు. పిల్లతో ఆడు

కున్నాడు. బావ విదేశ వస్తువులకు వ్యతిరేకంగా విద్యార్థులు ప్రచారంచేస్తున్నారనీ, లేకుంటే వ్యాపారం మరింతబాగా కొనసాగేదనీ చెప్పాడు. ప్రజలలో ఈ భావాలు ప్రచారం చెయ్యకపోతే వారు ఎలాంటి బట్టలైనా ఎలాంటి వస్తువులైనా కొంటారనీ చెప్పాడు. వ్యాపారానికీ దేశభక్తికీ సంబంధం ఏమిటన్నాడు. అతను చెప్పినదంతా ముగిసిన తరువాత పుస్తకం విషయం అడగవచ్చుననుకున్నాడు లాయ్‌ఎర్.

లాయ్‌ఎర్ బావ ఊలిన్. అతను నగరవాసి కావడం వల్ల చదువుకున్నాడు. అతని తండ్రి, తాతలుకూడా నగర వాసులే. వారి తరాలవారందరూ పల్లెపిల్లలనే పెళ్ళాడారు. ఎందుచేతనంటే నగర సుందరులకు పల్లెపిల్లలకున్నంత తాలిమి వుండదు. పగలంతా నిద్రిస్తారు. రాత్రింతా పచ్చీసాడు కుంటూ కూచుంటారు. వారు పిల్లలకు పాలివ్వరు.

ఊలిన్ చిన్నతనంలో అనేకపుస్తకాలు చదివాడు. ఇప్పుడూ చదువుతున్నాడు. వేసవిలో, చలికాలంలోకూడా అనేక పుస్తకాలు చదువుతాడు.

అతను ఆడుకుంటున్నపిల్లను కాళ్ళమీదకుంచిదించి విద్యావంతునిలా ఇలా చెప్పాడు. 'ప్రతివిషయానికీ సంబంధించిన పుస్తకాలుఉన్నాయి. అసలుపుస్తకం ఎవరికికావాలో ఎవరు చదవాలో ముందు తెలుసుకోవాలి. ఒకమనిషి ప్రత్యేకంగా చదువుకోదలిస్తే దానికి తగిన పుస్తకాలున్నాయి. ప్రయాణాలను వివిధస్థలాల వివరాలను చెప్పే పుస్తకాలున్నాయి. ఒకమనిషి హత్యచేసే లేకపోతే విషాన్నిగురించి హత్యనుగురించి వివరించేపుస్తకాలున్నాయి. నీకు ఎలాంటిగ్రంథంకావాలో చెప్పు.

లాయ్‌ఎర్ కొద్దిగా సిగ్గుచెంది, 'అసలువిషయం అది కాదు బావా. నాభార్యకూడా అందరు పిల్లలలాటిదే ననుకుని పెళ్ళాడాను. కాని అది అలాంటిదికాదు. దానికి చదువొచ్చు. ఒకపుస్తకం కావాలంటోంది. పుస్తకం కొనడంకోసమై తన పొడుగాటి జుట్టు కోసేసింది. అందుచేత ఆమెకొక పుస్తకం కొనిస్తానని వాగ్దానంచేశాను. అందుకనే ఈవాళ నగరానికి వచ్చాను.'

'ఆమె కేలాటి పుస్తకం కావాలో నీవు అడిగి ఉండ వలసింది' అన్నాడు ఊలిన్.

'పుస్తకాల్లో యిలాటి విభేదాలుంటాయని నాకు తెలీదు' అన్నాడు లాయ్‌ఎర్.

ఊలిన్ ఈ విషయాన్ని గురించి ఒక నిమిషం పర్యా లోచించాడు. తర్వాత యిదంతా నోరు తెరుచుకుని వింటూ కూచున్న తన భార్యవంక చూచాడు. 'నీకు ఎలాటి పుస్తకం యిష్టమో చెప్పవే' అన్నాడు.

పుస్తకం అనేసరికి ఆమెకు నవ్వొచ్చింది. ఆమె ఎప్పుడూ చెయ్యి అడ్డంపెట్టుకుని నవ్వుతుంది. ఎందుకంటే ఆమెపండ్లు నలుపు.

'నేనెప్పుడూ ఆవిషయాన్ని ఆలోచించలేదు' అన్న దామె.

కాని ఆమెభర్త చదువువిషయం అడిగేసరికి "నేను చిన్నప్పుడు మాఊళ్ళో ఒక ఒంటికంటి ముసలాడు, కొందరు దొంగలకథలు చెబుతూఉండడం వింటూండేదాన్ని.

అతను కథలు చెబుతూఉంటే పెద్దా చిన్నా అందరూ రాత్రులు రాత్రులు వింటూఉండేవారు.

ఊలిన్ ఆమెవంక అతి గర్వంగా చూచాడు. 'సరిగ్గా తూచినట్టు అవసరమైన పుస్తకాన్నే చెప్పావు' అన్నాడు బావ మరదితో 'ఆ కథల పుస్తకం కొను. భర్తలను మోసం చేసే భార్యలు ఎలాశిక్షింపబడతారో, ఇంకా ఎన్నో విషయాలనుగురించి ఎన్నో కథలుంటాయి. ఆ పుస్తకంపేరు షూయ్ హు చౌన్. ఎందరో గొప్ప దొంగల చరిత్రలుంటాయి. నా చిన్నతనంలో నేనూ ఆ పుస్తకం చదివాను' అన్నాడు.

చిన్నతనంలో ఆ పుస్తకం చదవిన విషయం ఒక్కమాటు స్మృతికి తెచ్చుకున్నాడు. లాయ్‌ఎక్ లేచి సెలవుతీసుకుని మళ్ళీ బజారుకు వచ్చాడు. ఎవరో పోట్లాడుకుంటున్న కంఠాలు అతనికి వినిపించాయి. బేరాలు చేస్తున్న వారందరూ బేరాలు ఆపి అటువంకే చూడడం మొదలెట్టారు. రాళ్ళూ, కర్రలూ పట్టుకుని పోతున్న కొందరు యువకులు కనుపించారు.

వారిముందు వారినాయకుడున్నాడు. అతను పొడుగ్గా ఉన్నాడు. యువకుడు. ఒక దుకాణం దగ్గర ఆగి అక్కడ గుమాస్తాని తలుపు తెరవమని అడిగాడు. గుమాస్తా తెరవడం ఆలస్యమయ్యేసరికి చేతిలోఉన్న రాయి విసిరి గ్లాసుపగలకొట్టి విదేశవస్తువులు' అని అరిచాడు.

గడియారాలు, పెన్నులు, యితర వస్తువులూ తీసి వీధిలో విసిరికొట్టాడు. అతను యిలా చెయ్యగానే యువకులందరూ లోపలికి దూరి వస్తువులన్నీ విరజిమ్మడం మొద

లెట్టారు. దుకాణదారులందరూ బిగ్గరగా అరవడం మొదలెట్టారు. వస్తువులన్నీ బైటకి విరజిమ్మగానే ప్రజలందరూ ఆవస్తువుల మీదపడి ఏరుకోడం మొదలెట్టారు. కొందరు వస్తువులమధ్యగా చేరి నిప్పుపెట్టసాగారు. అంత విలువగల వస్తువులు తగులబడిపోతూంటే ప్రజలంతా స్తబ్ధులై చుట్టూచేరి చూస్తున్నారు. లాయ్ఎర్ కూడా ఈ దృశ్యాన్ని చూచి చూచి విసుకెత్తి యింటిముఖం పట్టాడు.

నగరద్వారం సమీపించేసరికి అతను పుస్తకం కొనడం మరిచానన్న విషయం జ్ఞప్తికి వచ్చింది.

మళ్ళీ వెనక్కు తిరిగి పుస్తకాలకొట్టుదగ్గరికి వెళ్ళాడు. దుకాణదారు ఒక మాసినపుస్తకాన్ని ఇచ్చాడు. 'మాసిన పుస్తకం చౌకధర అనుకుంటాను' అన్నాడు లాయ్ఎర్.

'ఈ పుస్తకంకోసం చాలారోజులనుంచి అనేకమంది విద్యార్థులు తిరిగిపోతున్నారు. ఎందుకని నన్నడక్కు. వారు ఏపని ఎందుకు చేస్తారో మనం చెప్పలేము. తాగినవాళ్ళకంటె అధమస్థంగా ప్రవర్తిస్తారు' అన్నాడు.

'ఈ పుస్తకం ఖరీదెంత?' లాయ్ఎర్ అడిగాడు.

'మూడు చిన్న వెండి నాణాలు' దుకాణదారుడు చెప్పాడు.

లాయ్ఎర్ భయచకితుడయి చూచాడు.

"ఒక పుస్తకం అంత ఖరీదా?" అన్నాడు. 'ఒకపుస్తకానికి ఇంత ఖరీదెందుకు ఉండకూడదు? ఇంతకంటె ఎక్కువ ఖరీదుపెట్టి పందిమాంసం కొనడంలేమూ? అవసరమైనంత తిని పారెయ్యడంలేదా? ఒక పుస్తకం చదివితే అందులో విష

యాలు ఎప్పుడూ మనస్సులో పడిఉంటాయి. మరిచి పోయి నప్పుడు మళ్ళీ ఆ పుస్తకం తెరిచి చదువుకోవచ్చు' అన్నాడు దుకాణాదారు.

లాయ్‌ఎక్ నడుముకు కట్టివున్న డబ్బుతీసి దుకాణాదారునికిచ్చాడు.

ఆ పుస్తకం తీసుకుని ఇంటిముఖం పట్టసాగాడు. నగరం దాటిపోయేలోగా మళ్ళీ ఒకమారు తన బావగారికొట్టుదగ్గరికి వెళ్ళి చూడాలనిపించింది తిరిగి కొట్టుదగ్గరికి వెళ్ళాడు. అక్కడ ఏమీలేదు. ఒకబూడిదకుప్ప కనుపించింది. బిచ్చగాళ్ళూ, పసి పిల్లలూ కుప్పలో ఏమైనా వస్తువులు దొరుకుతాయేమోనని వెదకడం సాగించారు. కాని వచ్చిపోయే బాటసారులు ఈ దృశ్యాన్ని మామూలు దృశ్యం చూచినట్టే చూస్తున్నారు.

లాయ్‌ఎక్ లోనికి వెళ్ళాలా వద్దా అని ఆలోచిస్తూ ఒకనిమిషం నిల్చున్నాడు. కాని ముందుగా తన తల్లి తండ్రుల క్షేమం విచారించవలసిన అగత్యం అతనికి స్ఫురించింది. అతను ఈ గొడవలలో తగుల్కొంటే వారిగతి ఏంకానో అనిపించింది. అదీకాక దుకాణంబోర్డుమీద ఏవో పెద్ద పెద్ద అక్షరాలు కనుపించాయి. ఆ అక్షరాలు చూచేసరికి అతనికి భయం కలిగింది. చాలాసేపు ఆ అక్షరాలవంక చూస్తూనిల్చున్నాడు. కాని ఆ అక్షరాలు అతనికేమీ అర్థంకాలేదు. చివరకు ప్రక్కన నిల్చునిఉన్న ఒక వృద్ధునివంకచూచి, 'అయ్యా! ఈ అక్షరాలేమిటో నాకు చెప్పగలరా?' అన్నాడు.

వెనుకనున్న ఆ వృద్ధుడు ఆగి జేబులోనుంచి అద్దాలు తీసి అక్షరాలను తనలో తాను రెండు మూడు పర్యాయాలు

చదువుకున్నాడు. తరువాత ఇలా చెప్పాడు— ఈ దుకాణానికి ఎలాంటిగతిపట్టిందో, విదేశవస్తువులు అమ్మే ప్రతిదుకాణానికి ఇలాంటిగతే పడుతుంది.' అని ఈఅక్షరాలు చెబుతున్నాయి.

'చిత్రం' అన్నాడు లాయ్‌ఎక్ ఎంతో ఆతురతతోనూ వినమ్రతతోనూ. వెంటనే ఇల్లుచేరాలనే ఆతురత అతనిలో హెచ్చింది. జేన్‌కోసం కొన్నపుస్తకాన్ని ఒకనీలపుగుడ్డలో చుట్టి త్వరత్వరగా ఇంటివైపుకు నడకసాగించాడు. నగరం దాటి బయలులోకి రాగానే నిర్మలాకాశం కనుపించింది. అతని మనస్సుకు ఒకవిధమైన శాంతి కలిగింది.

ఇల్లుచేరగానే జేన్‌కు పుస్తకం ఇచ్చాడు. అందరికీ నగరంలో తనుచూచిన విషయాలన్నీ చెప్పాడు. అందరూ అతి శ్రద్ధతో విన్నారు. అంతావిని లింగ్‌టాన్ ఒకగుక్క పైప్ త్రాగి 'ఈశత్రువుపేరేమిటో నువుకనుక్కున్నావా?'అన్నాడు.

లాయ్‌ఎక్ ఈ ప్రశ్నకు గాభరాపడి 'మరిచిపోయాను, మరిచిపోయాను.' అన్నాడు.

ఆ విషయం కనుగొనసందుకు తన మూర్ఖత్వాన్ని తనే నిందించుకున్నాడు.

కాని నగరజీవితానికి గ్రామజీవితానికి ఎంతో దూరం ఉంది. నగరంలో జరిగే విశేషాలేమీ ఈ గ్రామంలోవారికి తెలియదు. రోజూ ఎలా పొద్దుగ్రుంకుతుందో అలాగే నేడూ పొద్దుక్రుంకింది. ప్రతిరాత్రిలాగానే ఈ రాత్రికూడాను. ప్రపంచంలో జరిగే మార్పులేవీ ఈ గ్రామాన్నిఆచ్ఛాదించ లేదు. నగరవాసుల స్పర్ధాపూరిత జీవనం యింకా ఈ గ్రామీణుల జీవితాన్ని కల్మషం చెయ్యలేదు.

లింగ్‌టాన్, అతనిభార్య నిద్రపోయేముందు వారి పెద్దకూతురి విషయం కాసేపు మాట్లాడుకున్నారు.

చివరకు లింగ్‌టాన్‌భార్య యిలాఅన్నది, 'అది ఎలాగో మనపిల్లకాదు. ఇతరుల చేతులలోపెట్టిన తరువాత దాని మంచీ - చెడూ అంతా వారిదే. ఏదైనా అపద సంభవిస్తే వాళ్ళే చెప్పి పంపుతారు అప్పుడు చూచుకోవచ్చు' అన్నది. భార్యమాటలు విన్నతరువాత అతనికి కొంచెం ఉపశమనం కలిగింది. ఈ విధంగానే యెన్నో సంవత్సరాలనుంచి వారి ప్రశాంతంగా జీవితం గడిచిపోతోంది. వారు తమజీవితాశలన్నీ పుడమితల్లిమీదనే పెట్టుకుని వున్నారు.

లాయ్‌టా తన శయనమందిరంలో పిల్లాడికిపాలుకుడుపుతున్న తన భార్యతో ఇలా చెప్పాడు, 'ఇలాటి సంఘటనలు విదేశవిద్యనేర్చుకోనడంవల్ల సంభవిస్తాయి. ఈ రోజులలో ఈ విద్యార్థులకు ప్రాచీనధర్మం తెలీదు వారినివారు ఎలా కొలుచుకోవలెనో వారికి తెలీదు. ఒకరోజు ఒక మాట చెబుతారు. మరోరోజు మరోమాట చెబుతారు. వారికినిలకడఅంటూలేదు. వారు మిడిమిడిజ్ఞానంవల్ల అంధులైపోయి ఇలాంటి అరాచక చర్యలకు పూనుకుంటారు.

'మన పిల్లాణ్ణి ఇలాటి బళ్ళకు పంపవద్దు' అని ఆమె నిద్రపోయింది.

'సరే' అని అతను ఆలోచించడం మొదలెట్టాడు. నెమ్మది నెమ్మదిగా అతను ఆలోచిస్తూఉంటే అతని నుదుటి మీద స్వేదబిందువులు మొలకెత్తాయి. చిట్టచివరకు ఒక ఆలోచన తట్టేసరికి బిగ్గరగా ఇలా అన్నాడు, 'ఒక వ్యక్తి తన

గృహంలోనే ఉండి తనకు నియుక్తమైన పనులు కావిస్తుంటే యిలాంటి గొడవలేమీ ఉండవు. దేశంలో ప్రతివ్యక్తీ యిలా ప్రవర్తిస్తుంటే దేశభద్రతను యెలాంటి శత్రువూ భగ్నం చెయ్యలేడు.'

తన భార్య ఏంజవాబు చెబుతుందోనని అతను వేచాడు. కాని ఆమె నిద్రపోతోంది. ఆమె గురక వినిపిస్తోంది. వెంటనే అతనూ నిరుత్సాహపూరితుడై నిద్రాదేవిఒడిలోవాలిపోయాడు.

పాన్‌షియో వట్టి అమాయకురాలు. ఆమె ఎన్నడూ నగరానికి వెళ్ళలేదు. ఆమెభర్త చెప్పినమాటలన్నీ విని, అప్పుడే మరచిపోయి హాయిగా నిద్రిస్తోంది. పాన్‌షియో అంటే అరనవ్వీన చిరునవ్వు అని అర్థం. ఈ పేరులో ఒక విధమైన సుస్నితమైన విషాదం ఉన్నది. గ్రామస్థులందరూ ఆమెను 'అరనవ్వీన చిరునవ్వా!' అని పిలవ నారంభించారు. అంతటితో ఆమెకు ఆపేరు సార్థకం అయిపోయిందికూడాను. పాన్‌షియో తన పేరులాగానే పెరిగిపెద్దదైంది. అందంగా స్నిగ్ధముగ్ధంగా ఉండే చిరునవ్వుతో, ముఖంమీద వ్యాపించిన విషాదరేఖతో, వినయ విధేయతలతో పెరిగి పెద్దదైంది.

లాయ్‌ఎక్, జేద్‌కూడా నగరంలోని విశేషాలు మరిచిపోయారు. జేద్ భర్త తెచ్చిన పుస్తకాన్ని అతను వినేట్టు చదవడం మొదలెట్టింది. ఆమె చదువుతూ ఉంటే మంత్రాలు వింటున్నట్టు వింటూకూచున్నాడు లాయ్‌ఎక్. ఒక కథకుడు కథచెబుతూ ఉన్నప్పుడు సంగీతంతో చెప్పినట్టు ఆమె ఆ పుస్తకాన్ని గానయుక్తంగా చదువుతూఉంటే వినడానికి అతనికి ఎంతో ఆనందమైంది.

మధ్యలో చదవడం ఆపి, 'మీరలా చూస్తుంటే నాకు చదవడానికి సిగ్గేస్తుంది' అన్నది మందహాసంతో.

'పుస్తకంచూచి చదవడం నాకురాదు. కాబట్టి నీవు చదువుతుంటేనైనా చూడనీ' అన్నాడు లాయిన్ఎస్. 'ఉండండి, మీకు చదవడం నేర్పుతా' నని పుస్తకంలో కొన్నిమాటలు అతనిచేత వల్లెవేయించడం మొదలెట్టింది. కొంతసేపటికి ఇరువురూ నిద్రపోయారు.

గ్రామంమీద రాత్రి పూర్తిగా రాజ్యమేలుతున్నది. విశాలమైన పొలాలమధ్య ఆ గృహం ఒక ప్రాచీన సమాధిలా ఉన్నది. కాని అది సమాధికాదు. నిండు బ్రతుకుతో పొర్లి పోతూఉండి. ఆకాశంలో చంద్రుడు నిశ్చలంగా వెలుగుతున్నాడు. ఇలా యుగయుగాలనుంచీ ఆచంద్రబింబం వెలుగుతూనే ఉంది.

## 3

లింగ్‌టాన్ జీవితం విశాలమైనదీ, అగాధమైనదీ. అతనెన్నడూ అనవసరంగా సంచారం చెయ్యలేదు. అతను, తన తాతముత్తాతలు ఏ పుడమితల్లిని నమ్ముకుని జీవించారో ఆ భూమాతనే నమ్ముకుని జీవయాత్ర సాగిస్తున్నాడు.

లింగ్‌టాన్ శరీరం, అతని మనస్సూ ఆ పుడమితల్లికే అంకితమైనాయి. అతను అనేకసార్లు భూమి దున్నేసమయంలో అతనికి ఒక విచిత్రభావం కలిగేది ఈ పుడమి తల్లి గర్భంలో ఎలాంటి చిత్ర రహస్యాలు ఇమిడివున్నవో అనిపించేది.

అతను చిన్నతనంలో ఒకమాటు ఒక బావి త్రివ్వాడు భూగర్భంలో ఏమి ఉంటుందో చూడడం అదే మొట్టమొదటి సారి. పుడమితల్లికడుపులోని పొరల తెరలు చూచేసరికి అతని కండ్లు చెమర్చాయి. ఎన్నడూ బీరుపోని నిత్యగర్భిణిలా కనుపించింది పృథ్వి.

ఈ పుడమిహృదయం అతనికి బాగా తెలుసు. పుడమికడుపులో ఒక బిగువైన పసుపుగడ్డ కనుపించింది. అది ఎలావచ్చిందో అతనికి తెలియేదు. ఆపసుపుగడ్డకింద ఒక రాతిపలక- చిట్లిన రాతిపలక ఉన్నది. దానికింద కుండలూ మరేవేవో ప్రాచీనవస్తుస్మృతులు కనుపించాయి. ఒక ప్రాచీన వెండినాణెంకూడా కనుపించింది. ఇవన్నీ తీసుకుని వెళ్ళి తన తండ్రివద్ద సమర్పించాడు. ఇరువురూ వాటిని పరిశీలించారు.

'మనల్ని కన్న మన తాతముత్తాతలు వుపయోగించిన వస్తుజాలం యిది. మీ తాత ముత్తాతలతోపాటు వీటిని సమాధిలో వుంచుదాం' అన్నాడు తండ్రి.

అలాగే వాటిని సమాధిలో వుంచారు. లింగ్టాన్ బావి త్రవ్వడం మొదలెట్టాడు. ఒక ఉదయాన జలపడింది. ఈనాటివరకూ ఆబావి యెండిపోలేదు.

కాని అతనిదృష్టిలో ఆజలకిందకూడా పుడమితల్లి సజీవురాలై వుంటుంది. ఇలా త్రవ్వగా త్రివ్వగా యెన్నో ప్రాచీన నగరాలూ, శిథిల భవనాలూ, ఆలయాలు బయల్పడతాయని పెద్దలు చెప్పడం అతను విన్నాడు.

లింగ్టాన్ తాత ఒక మాటు ఇలాగే తవ్వాడు. ఒక చిన్నబంగారు డ్రాగన్ దొరికింది. అది ఎవరో చక్రవర్తిభవ

నంలోనిదై ఉంటుందనుకున్నాడు. దాన్ని ఒక ఉప్పుడు కత్తెను ఉంచుకోడానికై అమ్ముకున్నాడు. ఇలా ఎన్నెన్నో కథలు విన్నాడు లింగ్‌టాన్.

ఈ భూమి గుండ్రంగా ఉంటుందని అతను విన్నాడు. ఒక వేసవిలో ఎన్నో నూతన విచిత్రవిషయాలు బోధించడానికి ఆ గ్రామానికి వచ్చిన ఒక యువడుకు ఈ విషయం చెప్పాడు. గ్రామ ప్రజలకు వైజ్ఞానిక ఉజ్జీవనంకలిగించడానికై అతను వచ్చి ఈ విషయాన్ని చెప్పాడు. అతను భూమియొక్క వర్తులత్వాన్ని గురించి, మరెన్నో వివిధ విచిత్ర జంతువులను గురించి, అరణ్య సంపదనుగురించి ఉద్బోధించాడు

భూమిగుండ్రంగా ఉన్నదనే విషయం లింగ్‌టాన్‌కు విచిత్రంగా కనుపించింది. కాని ఆ యువకుడు చెప్పినమాట జ్ఞాపకం వచ్చేది. నిమ్మపండ్లను చూచినప్పుడు భూమి ఇలా ఉంటుంది కాబోలు అనుకునేవాడు.

లింగ్‌టాన్‌దృష్టికి ఆకాశంకూడా విచిత్రంగా కనుపించేది. నక్షత్రాలు చిన్న చిన్న దీపాలలాగా కనుపించేవి. సూర్యుడినుంచి చెదిరివచ్చిన చిన్న చిన్న మెరుగుముక్కలేమో అనుకునేవాడు. సూర్యుడికి చంద్రుడికీ విరోధమని ఒక విశ్వాసం. 'అతని జీవితకాలంలో రెండుమూడుసార్లు ఈయుద్ధం జరిగింది. ఒకరినొకరు కబళించుకోబోయారు. అందరికీ భయం ఆవహించింది. అందరూ కోలాహలంగా అరిచారు. అప్పుడువారిద్దరూ యుద్ధం విరమించిచమెవరిస్థానాల్లోకి వాళ్ళువెళ్ళారు.

లింగ్‌టాన్ భావాలు యిలావుండేవి. భూమి చల్లగా వుంటే ప్రపంచంలో యెలాంటి ఉపద్రవాలూ సంభవించవని అతని ఉద్దేశం. ఒక రోజున పెద్దకొడుకుతో యిలా చెప్పాడు. 'నా తదనంతరం ఈ భూమి ముగ్గురువ్యక్తులను, వారి భార్యలను, పిల్లలను పోషిస్తుందా?' అని అడిగాడు.

ఈ ప్రశ్నకు లాయిటా 'తప్పకుండా పోషిస్తుంది. పొరుపు లేకుండా సరిపెట్టుకుంటే తప్పక పోషిస్తుంది' అన్నాడు.

ఇంతకు మించి లింగ్‌టాన్ మరేమీ అడగలేదు. అతన్ని ఈ సమాధానం సంతృప్తిపరిచింది.

లింగ్‌సా, నక్షత్రాలను గురించికాని, సూర్యచంద్రులను గురించి కాని ఒక్క నిమిషంకూడా ఆలోచించలేదు. ఆమె ఆలోచించవలసిన గృహకృత్యాలు ఎన్నో ఉన్నాయి. ఆమె మనుమనికి ఎన్ని నెలలైనా తల్లి ఎవరో, అవ్వ ఎవరో తెలిసేది కాదు. తల్లి అవ్వ వాడి దృష్టిలో ఒకేవిధంగా ఉండేవారు.

ఒకనాటి రాత్రి లింగ్‌టాన్ భార్యను ఇలా అడిగాడు, 'జేడ్ కడుపుతో ఉన్నదా?

భార్య పెదవులు కొరుక్కొని 'అవును' అన్నది. తన కోడళ్ళ క్షేమసమాచారాలు విచారించడం తన విద్యుక్త ధర్మంగా యెంచుకునేది ఈమె. 'జేడ్ అస్తమానం తన భర్త కొనితెచ్చిన పుస్తకం చదువుతూంటుంది. ఇక రేపు పిల్లాణ్ణికంటే ఏంచేస్తుందో! ఆ పుస్తకాన్ని విడిచిపెట్టదు కాబోలు. ఏవేళ వచ్చిందోకాని ఆ పుస్తకం, అది మంచివేళగా కనుపించడంలేదు. ఇంతకంటే నల్లమందుకు అలవాటుపడినా [illegible]వుండేది' అన్నది.

నల్లమందు అనేసరికి లింగ్‌టాన్ అసహ్యించుకున్నాడు. 'నల్లమందుకొడవ యెత్తకు. నల్లమందుకు అలవాటుపడి మా అమ్మ వాళ్ళు గుల్లజేసుకున్నది' అన్నాడు.

'సరే. ఇక నల్లమందుమాట యెత్తనులెండి' అన్నది భార్య. లింగ్‌టాన్‌తల్లికి గర్భాలో ఒక బాధవుండేది. ఆ బాధను ఉపశమింపచేసుకోడానికి నల్లమందు సేవించేది. తిండితిప్పలు యెలావున్న ముందు నల్లమందు వుండాలి. నల్లమందుకుతుంశ పడకపోతే ఒక్కనిమిషమైనా నిలవగలిగేది కాదు. ఏడు సంవత్సరాలపాటు నల్లమందుకోసం ఎంతో డబ్బు హరించుకో పోయింది ఈ విషయం ఆమెకు తెలుసు.

లింగ్‌సా తన సంతానం యొక్క భవిష్యత్తునుగురించి ఊహించసాగింది. పాన్ పియోకు వివాహం చెయ్యడం ఎలాగా అని, అది భావిజీవితంలో ఎలా పరివర్తిస్తుందోనని విచారించ సాగింది.

లింగ్‌టాన్ గురకెట్టి నిద్రపోతున్నాడు. లింగ్‌సా కూడా ఆలోచించి ఆలోచించి ఆఖరుకు నిద్రాదేవత ఒడిలో ఒరిగిపోయింది.

అందరికంటెముందుగా లింగ్‌సా నిద్రలేచింది. ఇంకా సూర్యోదయం కాలేదు. ఒక్కఉషారేఖ అయినా కనుపించడం లేదు. ఇంకా నక్షత్రాలు వెలుగుతూనే వున్నాయి. ఆమె యిల్లంతా పరిశుభ్రంగా ఊడ్చి అలికి ముగ్గెట్టేసరికి తెల్లారుతుంది. ఆమె పనులన్నీ ముగించుకుని యెసరు మంట మీద పెట్టింది. అప్పుడుకాని తొలికోడికూత వినిపించ లేదు. ఆమె తలదువ్వుకుని ముఖం కడుక్కుంది. ఒక్కొ

ఇండ్లో నిద్రలేవడం మొదలెట్టారు. జేద్, ఆమెభర్తా అందరి కంటె ఆలస్యంగా నిద్రలేస్తారు. జేద్ కాపరానికొచ్చి ఒక సంవత్సరమైనా కాలేదు. అందుచేత ఎవరూ దీనిని అడ్డగించడం లేదు. ఒక సంవత్సరంముగిసినతరువాత వారూ అందరి లాగానే ముందుగా నిద్రలేవవలసివస్తుంది.

ఆరోజు లింగ్‌సా బాగా అలంకరించుకుంది.

ఈ అలంకారాన్ని చూచి లింగ్‌టాన్, 'ఏమిటి నిండుగా ముస్తాబయినావు?' అన్నాడు.

'ఒక్కమాటువెళ్ళి పెద్దమ్మాయిను చూచి వస్తాను' అన్నది లింగ్‌సా.

'ఒంటరిగా నగరంలోకి యెలాపోతావు' అని అడిగా డతను.

లింగ్‌సా తల యెగరవేసి 'నాకేంభయం' అన్నది.

తను ముందుగా భోజనంముగించి కూతురిని కోడళ్ళనూ పిలిచి తను లేనప్పుడు ఏం చెయ్యాలో చెప్పింది. ఎవరి పను లలో వారిని నియోగించింది. అందరూ ఆమెమాటలు అతి శ్రద్ధగా విన్నారు. లింగ్‌టాన్ తనగదిలోకివెళ్ళి ఆమెఖర్చు కోసం కొంతడబ్బు తీసుకునివచ్చి యిచ్చాడు.

ఆమె డబ్బును నిరాకరిస్తూ, 'నాకెందుకండీ డబ్బు, అనవసరంగా పాడుచెయ్యనా? గింజలు కొనడానికి వుంచండి' అన్నది తనకు డబ్బుతో అవసరంలేనట్టుగా. కాని లింగ్‌టాన్ నవ్వుతూ ఆమెచేతిలో డబ్బు వుంచాడు. అతనికి ఆమె తప్ప కుండా డబ్బు తీసుకుంటుందని తెలుసు. తను యివ్వకుండా

వుంటే ఆమె అడిగేది. తనంతటతనే యిచ్చాడుకాబట్టి అలా బెట్టుచేసింది.

చివరకు అంతా సిద్ధంచేసుకుని ప్రయాణానికి సన్నాహమైంది. అందరూ ఆమెను సాగనంపడానికి తలుపు దగ్గరివరకూ వెళ్లారు. నాలుగు కోడిగుడ్లూ, పిండివంటలూ కట్టుకుని ఆమె బయలుదేరింది.

ఆమె బయలుదేరేసరికి బాగాప్రొద్దెక్కింది. కాని ప్రొద్దు నడినెత్తివరకూ రాలేదు. గాలి ఆడడంలేదు. ఆకాశంలో ఒక మబ్బుతునకకూడా కనుపించడంలేదు. ఆమెకు కుమార్తెను చూడవలెననే ఆవేగంలో ఎండ ఏమాత్రం పట్టలేదు దారిలో ఎందరో పరిచితులు కనుపించి ఆమెను పలకరించారు. అందరికీ నవ్వుతూ సమాధానం చెప్పింది. ఆమె నగరం ప్రవేశించేసరికి ప్రొద్దు బాగా నడినెత్తికివచ్చింది. దారిలో ఒక చిన్న టీ దుకాణందగ్గరఆగి ఒక కప్పు టీ తీసుకుంది. చిట్టచివరకు తన కుమార్తెఇల్లుచేరుకుంది. ఆమె చేరుకునే సరికి దుకాణం తెరిచిఉంది. ఇద్దరు గుమాస్తాలు పని చేస్తున్నారు. అరలన్నీ నిండుగాలేవు. కొన్ని అద్దాలు పగిలిపోయి ఉన్నాయి. ఏగ్రామంలోని దుకాణంలోనైనా దొరికే సాధారణ వస్తువులు మాత్రం కొన్ని వున్నాయి. ఇతర విదేశవస్తువులు, దీపాలు, బొమ్మలు, రబ్బరు చెప్పులు, పళ్ళేరాలు అన్నీ మాయమైపోయాయి. ఆమె ఈదృశ్యాన్ని చూడగానే ఎంతో గొప్పనష్టం జరిగిఉంటుందని ఊహించింది

ఆమె లోనికివెళ్ళిచూచేసరికి ఎంతో విషాదదృశ్యం కనుపించింది. ఆమె అల్లుడు కుర్చీలో కుప్పకూలి ఉన్నాడు.

ఎంతో చిక్కి శల్యమైపోయాడు. అతనిశరీరం గాలి తీసేసిన తిత్తిలాగా వ్రేలాడుతోంది. ఆమె ప్రవేశించేసరికి అతను కుర్చీలో పడుకుని నిద్రిస్తున్నాడు. కుమార్తె ప్రక్కనకూచుని విసురుతోంది. తల్లిని చూడగానే మౌనంగా ఉండమని సైగ చేసింది.

లింగ్‌సా కుమార్తెచెవిలో 'జబ్బుగా ఉన్నాడా? అలా చిక్కిపోయాడేమిటి?' అన్నది.

'మదదృష్టంవల్ల కలిగిన జబ్బు' అన్నది కూతురు. 'అన్నంకూడా ముట్టడంలేదు' అన్నది.

అన్నంమానిన జీవపదార్థం మృత్యువువైపుకు యాత్ర చేస్తున్నదని లింగ్‌సాకు తెలుసు. తనకూతురు యింతచిన్నతనంలో విధవకావడం భావిస్తే ఆమెకెంతో దుఃఖం కలిగింది. ఆమె వెంటనే లోపలికివెళ్ళి ఎవరినీ పట్టించుకోకుండా అక్కడ నిల్చునివున్న సేవకునితో మంట చెయ్యమని చెప్పి తను తెచ్చిన మాంసం, కోడిగుడ్లు, ఉల్లిగడ్డలు వండడం ప్రారంభించింది.

ఊలిన్ ఆ చక్కనివాసనకు కళ్ళుతెరిచి చూచాడు.

'మాఅమ్మ వాళ్ళఊరినుంచి కోడిగుడ్లు తెచ్చింది. అవి వండుతోంది' అన్నదిభార్య.

'అవుతే నేను తింటాను' అన్నాడతను.

'అమ్మా, ఆయన కావాలంటున్నాడే' అంటూ తను లోపలికి పరుగెత్తుకునివెళ్ళి కొన్నిముక్కలు తీసుకునివచ్చింది.

ఊలిన్ ఆవురావురుమని కడుపార భుజించాడు. లింగ్‌సా ఆమెకూతురు అతను భుజిస్తూవుంటే చూస్తూ నిల్చున్నారు.

తల్లీ కూతుళ్ళకు యెంతో సంతోషమైంది. తల్లి కూతురును, 'టీ తీసుకుని రావే' అన్నది. కూతురు టీ కలుపుకుని తీసుకుని వచ్చింది. వెంటనే తన చిన్న మనుమణ్ణి పిలిచింది. తరువాత యిలా చెప్పడం మొదలెట్టింది, 'ఏవో కష్టనష్టాలు వస్తుంటాయి. కాని మీరు అన్నం పానం ఆపు చెయ్యకూడదు. పిల్లలున్నారు. వాళ్లు పెరిగి పెద్దవారు కావాలి. మనం జీవించడం మన కోసమే కాదు. మన సంతానంకోసంకూడా' అన్నది. ఫూలిన్ బరువుగా కళ్ళు తెరిచిచూచాడు. ఏదో దేశానికి పెద్ద ముప్పువచ్చినట్టుంది ముసలమ్మా' అన్నాడు దీనంగా. లింగ్‌సా తన కుమార్తెవంక చూచింది. భార్య, 'ఆయన ఎప్పుడూ ఇదేమాట అంటూ ఉంటారు. దేశం పతనమైపోతుందంటారు' అన్నది.

లింగ్‌సా గట్టిగా విసురుకుంటూ, 'దేశం అంటే ఏముంది? మనుష్యులే. మనుష్యులంటే మనమే. ఒక రోజు కష్టనష్టాలతో మన జీవితాలన్నీ తల్లకిందులై పోవు. మళ్ళీ వస్తువులు కొని దుకాణంలో ఉంచి ధైర్యంతో వ్యాపారం సాగించాలి' అన్నది. ఫూలిన్, 'ఇది నా ఒక్కడి దురదృష్టం కాదు. ప్రాచ్యసముద్ర శత్రువులు వారి ఓడలను తీరానికి పంపించారు. వారి సైనికులు మన గడ్డపై కాలూనారు. మన సైనికులకు వారి సైనికులకూ యుద్ధమైంది. కాని మన సైనికులకు తగినంత బలంలేదు. ఫూలిన్ యీ విషయాన్ని చెబుతున్నప్పుడు ఆ స్త్రీలకు ఈవిషయం అర్థంకాదని అతనికి తెలుసు. వాళ్ళు ఎన్నడూ వారి గ్రామాన్ని కాని నగరాన్ని కాని దాటి బైటికి వెళ్ళి ఎరుగరు. తీరానికి ఇక్కడికి మధ్యలో ఉన్న 200 మైళ్ళదూరం

వారి దృష్టిలో 2000 మైళ్ళతో సమానం. వాళ్ళు ఎప్పుడూ రైలెక్కిన పాపానకూడా పోలేదు. మోటారుకారుకూడా ఎక్క లేదు. నదీతీరానికివెళ్ళి విదేశఓడలను చూడలేదు. ఒకప్పుడు మాత్రం విదేశ తుపాకీలమోతలు విన్నారు.

'ఆ తుపాకీమోతలు జ్ఞాపకం ఉన్నాయా? ఇప్పుడు అలాంటి తుపాకీల వరుసలు సముద్రతీరంలో దిగి ఉన్నాయి' అన్నాడు వూలిన్.

'నాకు జ్ఞాపకంఉంది. నేనప్పుడు బియ్యం చెరుగు తున్నాను. ఆ తుపాకుల శబ్దానికి నా చెవులు గింగుర్లెత్తి పోయాయి' అన్నది లింగ్‌సా.

'దీనివల్ల యెంతో ఉపద్రవంవున్నది' అన్నాడువూలిన్. అతను వ్యాపారస్తుడు కావడంవల్ల ప్రతిసంవత్సరం రెండుసార్లు వస్తువులు కొనడానికి తీరానికి వెడతాడు.

'ఏమీ దిగులు పెట్టుకోవద్దు. మనవూరికి సముద్రం కాని నదికాని చాలాదూరం 'వున్నది' అన్నది లింగ్‌సా.

'వాళ్ళకు ఎగిరే పడవలున్నాయి' అన్నాడతను. 'అవి రెండు గంటలలో యెంతదూరానికైనా ఎగిరివచ్చి నగరాలను ధ్వంసం చేస్తాయి' అన్నాడువూలిన్.

'ఏమీ భయంలేదు. అప్పుడు మీరందరూవచ్చి మా ఊళ్ళో వుండవచ్చు' అన్నది లింగ్‌సాయ్ ధైర్యంగా. 'నగర జీవితం చాలా ప్రమాదకరమైనదని నాకు తెలుసు' అన్నది.

ఇలా మాట్లాడుకుంటూ ఉండగా వూలిన్ ముసలితల్లి గదిలోనుంచి వెలుపలికి వచ్చింది. ఆమెరాగానే ఆమె పెద్దది కావడంచేత లింగ్‌సాయ్ లేచినిల్చుంది. 'మళ్ళీ మీకు

శ్రీమనివ్వడానికి వచ్చాను. దుకాణంవిషయం విని నాఅంత నేనే బయలుదేరివచ్చాను. మీ అబ్బాయికి మనస్తిమితం చిక్కేవరకూ అతని మనస్సుకు మీరు యెలాటి ఆందోళనా కలిగించకూడదు. ప్రతివ్యక్తీ తన సంసారంకోసం జీవించవలసి వుంటుంది' అనిచెప్పింది.

ఊలిన్ తల్లి ఎంతో లావుగాఉన్నది. ఒకటి రెండు అడుగులకంటె ఎక్కువ ఓపికగా నడవలేదు. ఆమె మాట్లాడు తున్నప్పుడుకూడా ఆమె మాటలు నూతిలో గొంతుకల్లా వినిపిస్తాయి. ఆమె కూచోగానే దగ్గడం మొదలెట్టింది.

ఆడవాళ్ళందరూ పెద్ద సముద్రపు హోరులా మాట్లాడు కోడం మొదలెట్టారు. వూలిన్ టీ దుకాణానికి వెళ్ళి వద్దామను కున్నాడు.

దుకాణం ధ్వంసమైన దగ్గరనుంచీ సిగ్గువల్ల అక్కడికి వెళ్ళడం మానేశాడు. గదిలోకి వెళ్ళి ముస్తాబయినాడు. పంట్లాం చాలా వదులుకావడం, షైటు వదులుకావడం చూచి అతనికి ఎంతో దిగులైంది. ఒక మారుదోవగుండా బయటికి వెళ్ళాడు. అతను టీ దుకాణం చేరగానే ఒకమూల టేబిల్ వద్దకు వెళ్ళి కూచున్నాడు. అంతకు పూర్వం మధ్య టేబిల్ వద్ద కూచునేవాడు.

ఇక్కడికి మళ్ళీ రావడం కొంతసేపటివరకూ అతనికి ఆనందమనిపించింది. కాని ఈరోజు టీ దుకాణం ఏదో కొత్త గా అనిపించింది. టీ దుకాణంలో మనుష్యులున్నా దుకాణ మంతా నిశ్శబ్దంగా వున్నట్టు కనుపించింది. మనుష్యు

లంతా నిశ్శబ్దంగాకూచుని భయంతో టీ తాగుతున్నారు. ఏదో పెద్దభయం వారందరినీ ఆవరించినట్టు కనుపించింది. ఊలిన్ తన స్థానంలో కూచుని తనను యెవరైనా పలకరిస్తారేమోనని చూచాడు. కాని యెవరూ పలకరించలేదు. ఎవరిగొడవల్లో వాళ్ళున్నారు. రెండోకప్పు టీ సేవిస్తున్నప్పుడు అతనికి ఒక పరిచితవ్యక్తి కనుపించాడు. కాని అతనుకూడా పలకలేదు. అందరూ అతనిమీద ఏదో కుట్రపన్నిపున్నట్టు అనిపించింది.

అతని నోటిలోని తీయని 'టీ' ఉప్పునీరుగా మారిపోయింది. రాగినాణాలు యిచ్చేసి బయటకి నడిచిపోయాడు. వస్తూ దారిలో ఒక వార్తాపత్రికకొని చదువుతూనిల్చున్నాడు. తీరంలోవున్న నగరం తగులబడిపోతున్నదనీ, సైన్యాలు పోరాడుకుంటున్నవని వార్తవున్నది. దుకాణాలన్నీ ప్రతిచోటా ధ్వంసం గావించబడుతున్నాయి. ఎందుచేత యిలా విధ్వంసం జరుగుతూవున్నదో అతనికి అర్థంకాలేదు. అతను పేపర్ చదువుతూవుంటే అతనివేళ్లు వణికిపోసాగాయి. పుస్తకాల దుకాణాదారు 'జబ్బుగా ఉన్నారా?' అనిఅడిగాడు. 'ఇక కొత్తవస్తువులు కొనలేను. నా సంసారం పూర్తిగా చితికిపోయింది' అని చింతించాడు.

ఈ గొడవలన్నీ లింగ్‌సాయ్‌కి మాత్రం తెలీదు. ఆమె కుమార్తె పెట్టిన ఫలహారాలన్నీ సుఖంగా భోంచేసింది. అందరూ నిద్రపోయినతరువాత కుమార్తెతో, 'ఏమే, నీ భర్త నిన్ను సరిగా మాస్తున్నాడా?' అని అడిగింది.

'ఎప్పటికంటే ఎక్కువగా చూస్తున్నారు' అని చెప్పింది కుమార్తె. 'ఏదికావలసివచ్చినా నన్నే పిలుస్తారు' అన్నది.

నోరు నొక్కుకుంటూ 'రాత్రిళ్ళు బైటికి వెడుతూ ఉంటాడా?' అని అడిగింది లింగ్‌సాన్.

'ఎన్నడూ అలాటిపని చెయ్యరు' అన్నది కుమార్తె. అప్పుడు తల్లిగుండె ఉపశమించింది.

ఒక శుభదినాన మళ్ళీ లింగ్‌సాన్ గృహోన్ముఖురాలైంది. తన చేతిరుమాలలో కుమార్తె కట్టిచ్చిన రొట్టెలు, తీపి వస్తువులు కట్టుకున్నది. అందరూ నగరద్వారం వరకూ వచ్చి ఆమెను సాగనంపారు. ఆమె ఇంటికి వెడుతూ దోవలో తన పొలాలు చూచుకుంది.

ఆమె ఇల్లు చేరేసరికి అందరూ ఆమెకోసం కాచుకుని ఉన్నారు. ఆమె ఇంటికి చేరినరాత్రి లింగ్‌టాన్ ఆమె ప్రక్కనే పడుకున్నాడు. 'ఓ ముసలిదానా, నీలాటి స్త్రీ ఈ మొత్తం భువిలో లే'దన్నాడు.

# 4

ఆ రాత్రి లింగ్‌టాన్ సుఖంగా నిద్రించాడు. తెల్ల వారింది. మళ్ళీ ఒకరోజు ప్రారంభమైంది. ప్రతిరోజూ కంటే ఎక్కువ పొద్దెక్కేవరకూ నిద్రించాడు. బాగాపొద్దెక్కిందని తెలిసి ఉలికిపడి లేచి కూచున్నాడు. తనభార్య అప్పటికే నిద్ర లేచి పనులు చేసుకుంటోంది. పెద్దకొడుకు వసారాలో కూచుని ముఖం కడుక్కుంటున్నాడు. ఇతరులందరినీ తల్లి నిద్రలేపుతోంది.

అన్నిరోజులలాగానే ఈనాడుకూడా అందరూ భోజనా లకు కూచున్నారు. ఏకొడుకు ఏఏపనులు చెయ్యాలో చెప్పాడు లింగ్‌టాన్. చిన్నకొడుకుతో 'నువ్వు అన్నంతిన గానే దున్నపోతును తీసుకువెళ్ళి అరక కట్టు' అని చెప్పాడు.

ఆనాడు నిర్మలంగావుంది. ఆకాశంలో ఒక్క మబ్బు తునకకూడా కనుపించడంలేదు. మూడురోజుల క్రితం ఒక చిన్నవానజల్లు పడింది. మళ్ళీ రెండురోజులలో కాని వాన పడదు. అందువల్ల ఇవాళ దున్ని రేపు వరి నాటువేస్తారు. ఎల్లుండి వానపడవచ్చు.

కాబట్టి అతను భోజనం ముగించగానే కొడుకులతో కలిసి పనికివెళ్ళిపోయాడు.

ఇంట్లో స్త్రీలుమాత్రం మిగిలిపోయారు. లింగ్‌సా జేద్‌తో 'ఇవాళ కాస్త మగ్గందగ్గర కూచో. మగ్గంనెయ్యడం నేర్పుతాను' అన్నది.

లింగ్‌టాన్ పొలంవెళ్ళి పనిచెయ్యడం మొదలెట్టాడు. ప్రక్కచేలో కొడుకులు వరినాటువేస్తున్నారు. లోయల్లో

ఎందరో రైతులు లింగ్‌టాన్‌లాంటివారే పనిచేస్తూ కనుపించారు. ఈ సంవత్సరం వానలు బాగాపడ్డాయి. పంటతల్లి రైతులను కరుణించింది.

అతను ఈరోజు ఉదయాన ఆకాశంలో విమానాలు చూచాడు. అతను వాటిశబ్దాన్ని విన్నాడు. ఆశబ్దం ఎప్పటి కంటె ఎక్కువగా వినిపించింది.

ఆకాశంలో ఎగురుతున్న విమానాలు ఎండలో మిల మిలా మెరుస్తున్నాయి.

అతను ఆకాశంకేసి చూస్తూ ఉండగానే ఒకక్షణంలో అవన్నీ అతని నెత్తిమీద మిడుతల్లా ముసిరాయి. పొలాల్లో పనిచేసేరైతులందరూ భయాశ్చర్యాలతో వాటివంక తదేకంగా చూడసాగారు.

ఒక చిన్న వెండిముక్కలాంటిది విమానంలోంచి క్రిందపడడంకూడా చూచారు. ఆముక్క ఒక వరిచేలోపడింది. ఆముక్క పడగానే నల్లనిమబ్బులా మట్టి పైకి ఎగసివచ్చింది. అందరూ అక్కడికి పరుగెత్తుకుని వచ్చారు. లింగ్‌టాన్ కుమారులతో కలిసి పరుగెత్తుకు వచ్చాడు. అక్కడికి వారు వచ్చేసరికి వారికేమీ కనుపించలేదు. ఒకటి రెండు లోహపు ముక్కలుమాత్రం కనుపించాయి.

'ఎన్నాళ్ళనుంచో నా పొలంలో కుంట త్రవ్వుదామనుకుంటున్నాను. కాని ఎప్పుడూ వీలుచిక్కలేదు. ఈవాళ దానంతట అదే కుంట ఏర్పడింది' అన్నాడు లింగ్‌టాన్.

వారిలో ఏర్పడిన ఆశ్చర్య-భయాలు పూర్తిగా అణగారినతర్వాతకాని వారు అసలు వివరాలు మాట్లాడుకోవడం

ప్రారంభించలేదు. వారిలో ఒకడు నగరంలోకూడా ఇలాటి భీకరశబ్దాలే విన్నాడు. వెంటనే నగరం యావత్తూ విస్ఫోట్న లలో తగులబడి కొండలలాటి పొగమబ్బులు లేచిరావడం చూచాడు ఆమబ్బులు లేచిలేచి పెద్దపెద్ద తుఫాను మబ్బుల లాగా ఆకాశాన్ని అంటుతున్నాయి.

'ఇప్పుడేం చెయ్యాలి?' అన్నాడు లింగ్‌టాన్. కాని ఎవరూ సమాధానం చెప్పలేదు. ఎవరికీ ఏమి సమాధానం చెప్పవలెనో ఏమిచెయ్యవలెనో పాలుపోలేదు. అందరూ స్తబ్ధులై నిల్చుని చూస్తున్నారు.

నగరం ఎత్తయిన మంటలలో తగులడిపోతున్నది. కొండలలాటి పొగమబ్బులులేచి ఆకాశాన్ని అంటుతున్నాయి. ఆ పొగమబ్బులలో దాక్కొనిఉన్న విమానాలు పైకి లేచి వచ్చి మళ్ళీ ఎగురుతూ వెళ్ళిపోతున్నాయి. వాళ్ళకు యిదేమీ అర్థంకాలేదు. మళ్ళీ ఎవరిపనుల్లోకి వాళ్ళు వెళ్ళారు.

'ఈ విషయం అంత పెద్దవిషయమవుతే అదే మన చెవులపడుతుంది. ఇందుకోసం మనం నగరానికి వెళ్ళి కనుక్కో వలసిన అగత్యంలేదు' అన్నాడు లింగ్‌టాన్. అందరూ నవ్వు కుంటూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఆనాటి రాత్రి చంద్రాస్తమయం వేళకు లింగ్‌టాన్ ఇంటిముందు కుక్క మొరగడం మొదలుపెట్టింది. లింగ్‌టాన్ ఎంతగాఢసుషుప్తిలో ఉన్నా కుక్కమొరగడం విన్నాడంటే వెంటనే నిద్రలేస్తాడు. ఒకటి రెండుసార్లు కుక్క అరవడం విన్నాడు. తరువాత ఎవరో తలుపు తట్టడం వినిపించింది.

ఎంత తెలివిమాలినవాడైనా అర్ధరాత్రి ఎవరో తలుపు తడుతూఉంటే ఒంటరిగాలేచి తలుపుతియ్యడు. అందుచేత లింగ్‌టాన్ భార్యకుకూడా నిద్రలేపాడు. ఆమె త్వరత్వరగా లేచివెళ్ళి తలుపు తెరవబోయింది. కాని లింగ్‌టాన్ ఆమెను వారించాడు. 'ఎందరో ఇలా హఠాత్తుగా అర్ధరాత్రులందు తలుపు తెరిచి ఆగంతుకులచేతిలో ప్రాణాలు కోల్పోయారు' అన్నాడు.

తలుపుకొడుతున్న శబ్దం తీవ్రమైంది. ఇంట్లో అందరూ లేచారు. అందరూ లింగ్‌టాన్‌తో కలిసి తలుపుదగ్గరికివెళ్ళారు. అతను తలుపుదగ్గరికివెళ్ళి చూచేసరికి కుక్క కోపంతో కాక, సంతోషంతో తోక ఆడిస్తూ కనుపించింది. "ఎవరో మంచి మాంసం ముక్కను విసిరినట్టున్నారు' అన్నాడు లింగ్‌టాన్. అప్పుడు వారికి ఒక గొంతు వినిపించింది. అది స్త్రీ కంఠం. ఆ గొంతు వినేసరికి వారికి ఆశ్చర్యం కలిగింది.

"నా తల్లి తండ్రులుకూడా మరణించారా ఏమిటి? నామాటలు ఎవరూ వినిపించుకోవడంలేదు!' అంటున్నది ఆ గొంతుక. ఆ మట్టిగోడనుదాటి వినిపించిన ఈ మాటలు చెవిని పడగానే అందరికి ఆ గొంతు ఎవరిదో గ్రహింపై ఆతురతతో తలుపు తెరవడానికి వెళ్ళారు.

'పెద్దమ్మాయి! ఇంత అర్ధరాత్రివేళ ఎందుకు వచ్చింది చెప్మా' అని అరిచింది తల్లి లింగ్‌సా.

తలుపు తెరచి చూచేసరికి వారికళ్ళు చెదిరిపోయాయి. పెద్దకూతురూ, ఆమెభర్త వూలిన్, చెరొకచేతిలో పిల్లల్ని ఎత్తుకుని నిల్చుని ఉన్నారు. వూలిన్ తల్లి ముసలి వూసాకూడా

వణుకుతున్న కాళ్ళతో నిల్చునిఉంది. వారు కొన్ని గుడ్డల మూటలు, టీ పాట్, పక్కచుట్టలుకూడా మోసుకుని వచ్చారు.

పెద్దమ్మాయి తల్లితండ్రులను చూడగానే పెద్దపెట్టున ఏడ్వసాగింది.

'అందరం చచ్చిబ్రతికాం. వీధికి పదిఅడుగులదూరంలో ఉన్నట్లయితే ఒక్కళ్ళమూ బ్రతికేవాళ్ళంకాదు. ఇద్దరు సేవకులు, గుమస్తాలు-అందరూ చనిపోయారు. దుకాణం సగం ధ్వంసమైపోయింది. వందసంవత్సరాలనుంచి ఇలాంటి ఉత్పాతం ఎన్నడూ చూచిఎరగం. ప్రాణాలు చేతుల్లో ఉంచుకుని బైటపడ్డాం' అని ఏడుస్తూ చెప్పసాగింది పెద్దమ్మాయి.

ఆతురతతో 'నగరద్వారాలు ఎందుకు మూయలేదు?' అని అడిగాడు లింగ్‌టాన్. "ఆకాశంవేపు ద్వారాలేమున్నయ్ మూయటానికి?" అన్నాడు ఫ్రూలిన్. అతని శరీరమంతా చెమటతో తడిసిఉంది.

'నువ్వు అంటున్నదేమిటో నాకు అర్థంకావడంలేదు' అన్నాడు లింగ్‌టాన్.

'నగరంమీద బాంబులు పడ్డాయి. మీకు తెలీలేదా?' అన్నాడు ఫ్రూలిన్.

'బాంబులు!' లింగ్‌టాన్ ఆశ్చర్యంతో మారుపలికాడు. ఆమాట ఇంతవరకూ లింగ్‌టాన్ వినలేదు.

లింగ్‌టాన్ పెద్దకూతురు, 'ఈ ఉదయాన ఎగిరేఓడలు నగరంమీదికి ఎగురుతూ వచ్చాయి. ఎవరిపనుల్లో వారు నిమగ్నులైఉండి మేమంతగా లెక్కచెయ్యలేదు. ఒక 'గుమాస్తా

దండులుగా వచ్చిన ఆ ఓడలను చూడడానికి మనుష్యులనందరినీ బైటికి పిలిచాడు. నా మొహాన చావురాత లేదు. అందుకనే నేను పిల్లవాడికి పాలిస్తూ బైటికి వెళ్ళి చూడలేదు. లోపలే ఉన్నాను. అందరూ నిద్రపోతున్నారు. అప్పుడు పెద్ద చప్పుడైంది. అబ్బ! ఎంత చప్పుడనుకున్నారు. నా కాళ్ళక్రింద భూమి వణికిపోయింది. దుకాణం అంతా గాలివానకు చెట్టు వణికినట్టు వణికి కుప్పగా కూలింది. ఇద్దరు గుమాస్తాలూ చని పోయారు. అందులో ఒకనికి మొన్ననే పెళ్ళయింది. ఎంత మంచివాడనుకున్నారు! అంటూ గుక్కతిప్పుకోకుండా చెప్ప నారంభించింది.

'మంచివాడైతే మాత్రం లాభమేమిటి, బ్రతికి బట్ట కట్టకపోయినతరువాత-' అన్నాడు ఫూలిన్.

లింగ్సా ఇంతసేపూ ఈ దుర్గతిని గురించి ఆలోచిస్తూ నిల్చుంది. 'అందరూ వెళ్ళి కాసేపు నిద్రపోండి' అన్నది. జేద్‌తో 'వెంటనే వెళ్ళి టీ నీళ్ళకు మంటచెయ్యి' మని చెప్పింది. తెల్లవారిన తరువాత వివరాలు ఆలోచించవచ్చని చెప్పింది.

ఈ విషయాన్ని గురించిన వివరాలు జేద్‌కు బాగా తెలుసు. కాని జేద్ ఏమీ మాట్లాడకుండా లోపలికి వెళ్ళి పోయింది. ఆమెవెంట లాయ్‌ఎర్ కూడా వెళ్ళాడు. ఆమె టీ కాచటానికి నిప్పుచేస్తూఉంటే ఆమెప్రక్కనే కూచున్నాడు.

జేద్ కనుబొమ్మలు పైకెత్తి 'వాళ్ళే కదూ' అన్నది. 'వాళ్ళంటే ఎవరు?' అన్నాడు లాయ్‌ఎర్. అందరూ టీలు, భోజనాలు ముగించుకుని నిద్రించిన తరువాత జేద్, ఆమె భర్త మాట్లాడుకోవడం సాగించారు.

'దీనికి అర్థం మనభూములూ, మన నగరాలు పోతా యన్నమాట?' అన్నది జేద్.

'అంటే మనమంతా చనిపోతా మన్నమాట'అన్నాడు లాయ్‌ఎర్.

వాళ్ళు అలాగే రానున్న ప్రమాదాన్ని గురించి ఊహించుకుంటూ క్రోధంతో నిండిన హృదయాలతో నిద్ర పోయారు.

'ప్రపంచంలో ఇతరులందరికీ ఉన్నవి మనకెందుకు లేవు? తుపాకులు, విమానాలు, సైన్యాలూ మనకెందుకు లేవు?'అన్నది జేద్.

అలాంటిది మనదృష్టిలో బొమ్మలతో సమానం. మనం జీవితంమీద ప్రీతిగల వ్యక్తులం. మనకు అలాంటి వాటితో ఏంపని?'అన్నాడు లాయ్‌ఎక్. ఈమాట విన్నతరువాత జేద్‌కు తన గర్భంలో కదులాడుతున్న సంతానం జ్ఞాపకానికి వచ్చింది. తన జీవితంలోని మాధుర్యాన్ని గురించి ఊహించసాగింది. ఎన్నో తీయనికలలు కన్నది. జీవించడం, కొత్తజీవాన్ని సృష్టించడం - ఈవిషయం ఎంతో అందంగా కనుపించిందామెకు. ప్రపంచంలో అందరూ అలాంటి దుష్టపు ఆటబొమ్మలతో ఆట లాడుతూ ఉంటే మనమూ అలాగే ఆటలాడడం నేర్చుకో వాలి'అన్నది.

'అయినా అది తప్పే' అన్నాడు లాయ్ ఎక్.

ఏంచెయ్యాలో ఆలోచిస్తూ చాలాసేపు మేలుకుని ఉండి తర్వాత నిద్రించాడు.

తెల్లవారింది. పగలు ఎక్కువగా పనిచేయ్యలేదు. పెద్దమ్మాయీ, ఆమె భర్తా చెప్పే విషయాలు వింటూ కూచున్నారు. 'విమానంలోనుంచి వెండిముక్కలుపడగానే దుకాణాలన్నీ చెదిరిపోయాయి.'

'మనుష్యులు?' లింగ్‌టాన్ అడిగాడు. 'తునాతునకలై పోయారు. ఒకచోట ఒకతల, మరోచోట ఒక కాలు, వేరొక చోట మొండెం - అలా పడి ఉన్నాయి-' అన్నాడు వూలిన్.

తరువాత అందరూ నిశ్శబ్దంగా భయంతో ఒకరి వంక ఒకరు చూచుకున్నారు.

'ఎందుకు? దీనికి కారణం ఏమిటి?' జేద్ ఒక్కతే ప్రశ్నించింది.

'ఎవరికి తెలుసు? ఆకాశాన్ని అడగాలి' అన్నాడు వూలిన్.

అందరికళ్ళవెంట నీళ్ళు ధారలుగా కారడం మొదలెట్టాయి. అందరికీ మృత్యువు తప్పదని తెలుసు. కాని తీయని కలలాగా కమ్ముకుని వచ్చే సాధారణ మృత్యువు విషయం తెలుసుకొని ఇలాటి ఆకస్మిక దుర్మరణం ఎంతో భయానకమైనది.

అందరూ నిశ్శబ్దంగా లేచివెళ్ళి ఎవరి పనుల్లో వారు నిమగ్నులైనారు. లింగ్‌టాన్ కొడుకులతో కలిసి పొలానికి వెళ్ళాడు. వూలిన్ ఒక్కడే ఏకాంతంగాకూచున్నాడు. అతను వర్తకుడు కావడంవల్ల అతనికి పొలాల విషయంకాని, నాగలి విషయంకాని ఏమీ తెలిదు. అతనికి ఏపనీలేకుండా కూచోడం ఎంతో బరువుగా, బద్ధకంగా తోచింది.

లాయ్‌ఎక్, జేద్ కుంటపక్కన ఒక చెట్టునీడను సమావేశమైనారు. పగలంతా వారికి కలుసుకుని మాట్లాడు కోడానికి నిమిషమైనా తీరికచిక్కలేదు. ఇంటినిండా జనం పోగులుపడివున్నారు. పగలు గదిలోకివెళ్ళికూచుని మాట్లా డుకోడమంటే వారికి సిగ్గేసింది. ఈనాడు వారు కలుసుకున్న చెట్టునీడను వా రింతకుపూర్వం ఎన్నో పర్యాయాలు సమా వేశమైనారు. ఈచెట్టు ఎంతో దట్టమైన చక్కని నీడనిస్తుంది. లాయ్‌ఎక్, జేద్ యెన్నో పర్యాయాలు ఆ చెట్టునీడలో కూచుని మాట్లాడుకుంటూ గంటలకొద్దీ కాలక్షేపంచేశారు. తండ్రితోపాటు పనికిపోతూ ఈనాడు కూడా జేద్‌తో లాయ్ ఎక్ తలఊపి సైగచేశాడు. దానికి అర్థం ఆ నీడలోకిరమ్మని. అందుచేత మధ్యాహ్నంకాగానే ఆమెవచ్చి ఆ చెట్టునీడలో అతనికోసం కాచుకుని కూచుంది. అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడప్పుడూ చిరుగాలికి ఎగిరిన ఎండుటాకుల ధ్వనిమాత్రం వినిపిస్తోంది. తనభర్త తనకొరకై తెచ్చిన పుస్తకం చదవడం వల్ల మానవులమధ్య శాంతి ఎలా నశించిపోతున్నదీ, మానవులు పరస్పరం ఎలా హింసించుకుంటున్నదీ జేద్‌కు తెలిసింది. శాంతినశించినప్పుడు మానవులు ఎలాటి పశుప్రవర్తనకు దిగజారేది జేద్‌కు తెలుసు.

'మనం ఈ ముప్పునుంచి ఎలా తప్పించుకోగలం? మన శిశువును ఈ గండంనుంచి ఎలా సంరక్షించుకోగలం?' అని జేద్ ఆలోచించింది. ఆమెకు టీ దుకాణంవద్ద మాట్లాడిన యువకుడు జ్ఞాపకంవచ్చాడు. 'మన పంటలూ, మన ఇళ్ళూ

తగలేస్తే శత్రువుల చేతుల్లో చిక్కకుండా పోతాయి'అని చెప్పాడు. అందరూ 'అలా చెయ్యగలం'అన్నారు.

'అయితే నేను గర్భం ధరించకుండా ఉండిఉండవలసింది' అనుకున్నది జేద్.

ఆమె అలాగేకూచుని దీన్నిగురించి ఆలోచించడం మొదలెట్టింది. ఆమెకు 'ప్రాణి' అన్నిటికన్న పవిత్రమైన పదార్థంగా తోచింది. ఆమె ఒక నూతనప్రాణిని సృష్టిస్తున్నది. ఆమెకు జీవితంలో అన్నిటికన్న అధికమైనది ఈప్రాణి.

ఇలా ఆలోచిస్తూ ఆమె కొమ్మలఅడ్డం తొలగించింది. లాయ్ఎర్ వచ్చి ఆమెప్రక్కన కూచున్నాడు. ఆమె అతని నుదుటిచెమట తుడిచింది.

'నేను నాలో వస్తున్నమార్పుకు ఆశ్చర్యపోతున్నాను. నాలో పెరుగుతున్న శిశువునుగురించితప్ప మరి దేన్నిగురించీ నేను ఆలోచించడంలేదు' అన్నది.

'నేనూ పనిచేస్తూ అదేవిషయం ఆలోచించాను. మనం యిక్కడవుండొద్దు. శత్రువులు మనల్ని చేరలేనిచోటుకు వెళదాం. నీవు కనేవరకూ అక్కడ భద్రంగా ఉండొచ్చు' అన్నాడు.

'ఇల్లువదిలి వెళ్ళడమా? నాన్నగారు ఒప్పుకుంటారా?' అన్నది జేద్.

'ఎలాగో ఒకలా ఒప్పిస్తాను' అన్నాడు లాయ్ఎర్.

ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుని కాసేపు అలాగే పట్టుకున్నాడు. ఇరువురి మనస్సుల్లోను ఒకవిధమైన తీయదనం వ్యాపించింది.

'నీయిష్టంఎలాగో నేనూ అలాగేచేస్తాను' అన్నది జేద్.

మళ్ళీ విమానాలదండులు వచ్చాయి. అప్పుడు లింగ్‌టాన్ నగరంలోవున్నాడు. నగరంలో చాలామంది మళ్ళీ విమానాలదండు రాదనుకున్నారు. అందుచేత శిథిలాలైన ఇండ్లనూ, దుకాణాలనూ మళ్ళీ నిర్మించుకోవడం మొదలెట్టారు. భూకంపం ఒకమారు వచ్చిపోయిన తరువాత మళ్ళీ యెలారాదో అలాగే దండుకూడా మళ్ళీ రాదనుకొన్నారు. ఆనాటి ఉదయానకూడా లింగ్‌టాన్ కొడుకులకు పొలం వెళ్ళమనిచెప్పి తను నగరానికివెళ్ళాడు. అతను నగరానికి వెడదామని రెండడుగులు వేసేసరికి మూడోకుర్రాడు అతని వెంటపడ్డాడు.

'నాన్నా, నన్నుకూడా నీతో తీసుకెళ్ళవూ?' అంటూ మారాంచెయ్యడం మొదలెట్టాడు. లింగ్‌టాన్ వాడిగొడవ పడలేక 'రారా వెధవ!' అన్నాడు. ఇద్దరూ నగరంవైపుకు నడవసాగారు. వాన పడకపోయినా ఆకాశం మేఘావృతంగా ఉన్నది.

నగర దక్షిణద్వారం ప్రవేశించేసరికి నిర్జీవ దృక్కులతో వచ్చిపోతున్న ప్రజలు ఎందరో కనుపించారు. ఇంతకు పూర్వం ఈ నగరంలో ప్రజలు ఎంతో హుందాగా నడుస్తూ వెళ్ళేవారు. నడక అందంలో ఈ నగరవాసులు ఎంతో ప్రసిద్ధి వహించారు. ఇది ఎంతో పురాతనమైన నగరం. ఈ నగరంలో ఎందరో చక్రవర్తులు, శ్రీమంతులు, భోగలాలసులు నివసించారు. ప్రతిరాత్రి ప్రతివీధిలో నవ్వులు, గజ్జెలమ్రోతలు, సంగీతం వినిపిస్తూ ఉండేవి. ఎందరో అందగత్తెలు అందరికీ అందు

బాటులో ఉండేవారు. కొలనుల్లో భోగులు వాహ్యాళి వెళ్ళ డానికై అందచందాలు చెక్కిన చిన్నచిన్న పడవలు తేలా డుతూ ఉండేవి. ఎన్నో పెద్దపెద్ద ఆలయాలు, పగోడాలు, ప్రాచీనశిల్పాలు ఉన్నాయి.

విప్లవం వచ్చిననాటినుంచి రాజులు, చక్రవర్తులు అంతరించారు. కాని పరిపాలకులుమాత్రం అంతరించలేదు. వారు ఎన్నో అందమైన భవనాలు నిర్మించారు. కొత్తకొత్త పద్ధతుల్లో గృహాలు కట్టారు. ఆ గృహాల్లో ఎన్నో విచిత్రపద్ధ తులలో నీటి రాకపోకలకు మార్గాలు ఏర్పరిచారు. కాని ఈ వైభవమంతా విమానాలదండు రాకపూర్వం.

ఈనాడు లింగ్‌టాన్ ఆ నగరంలో ప్రవేశించేసరికి అందరూ విదేశవస్తువులను నిందించడం, నగర ధ్వంసానికి శోకించడం విన్నాడు.

లింగ్‌టాన్ ఒక టీ దుకాణంలోని వెయిటర్‌తో 'నగ రం ఎక్కడ విధ్వంసమైంది?'అని అడిగాడు. ఈప్రశ్న వినగానే వెయిటర్ పెద్దపెట్టున ఏడ్వడం సాగించాడు. అదిచూచి లింగ్ టాన్ ఆశ్చర్యపోయాడు.

'నార్తుగేటు బ్రిడ్జివీథిలో నాకో చిన్నఇల్లు వుంది. మాఇంటి నానుకొనిఉన్నఇల్లు ఒక ధనికుడిది. నాఇల్లు అతని ఇల్లూకూడా ధ్వంసమైపోయినై. ఆయనఇంట్లో ఎవరెవరు చచ్చిపోయారో నాకు తెలియదుగాని, మాఇంట్లో మాత్రం అందరూ తుడిచిపెట్టుకపోయారు. నాకిద్దరు కొడుకులు; పసి వాళ్లు; ఏడాదితేడాతో ఫుట్టారు. నేనిక్కడ ఉండకపోయిన ట్లయితే వాళ్లల్లో జమ అయ్యేవాణ్ణే. నా కొడుకుల దగ్గరికి

పోవాలనే నాకోరిక'' అని తనకథ చెప్పాడు వెయిటర్.

"లింగ్‌టాన్ అతన్ని ఓదారుస్తూ మరికొంతడబ్బు చేతిలోపెట్టాడు. ఆ తర్వాత తన కొడుకుతోకలిసి ఆ వీధిలోకి వెళ్ళాడు. అలా వీధిలోకివెళ్ళి ఒకచోట నిశ్చేష్టుడై నిల బడ్డాడు. ఆపరిదేశమంతా భీభత్సంగావుంది. ఇటుకలు, సున్నం, కాలిపోయిన దూలాలు, కలప సామగ్రి కుప్పలు తెప్పలుగా పడివున్నాయి. మట్టికుప్పలమీద కొందరు కూర్చుని యేడు స్తున్నారు. చేతుల్తో మట్టిని పెళ్ళగిస్తున్నారు. కొందరి చేతుల్లో యినపగునపాలున్నాయి. వారిమధ్యలోవున్న ఒక ఆడమనిషి తనభర్త కాలిబూటు పైకితీసింది.

"ఆయనకాలు నాకింకెక్కడా కనపడదా!'' అంటూ ఆమె పెద్దపెట్టున ఏడ్వసాగింది.

అలాఏడుస్తూ ఆమె కుప్పలు పెళ్ళగిస్తోంది. మరి కొంతసేపటికి విరిగిన కాలిలో చిన్నముక్క ఒకటి బయటి కొచ్చింది. పాపం! ఆమె ఎంతవెదికినా మరేమీ కన్పించలేదు.

ఇదంతా నిల్చుని చూస్తోన్న లింగ్‌టాన్ గుండెలు కొట్టుకోవడం మొదలుపెట్టాయి. అతనివళ్లు వణుకుతోంది. ఇంతలో అతనికి బలమైన ఓకరింపు విన్పించింది. లింగ్‌టాన్ వెనక్కు తిరిగి చూచాడు. అతనికొడుకు వాంతిచేసుకుంటు న్నాడు. "భరింప శక్యంకాకుండా వుంది. అందుకు నిన్నేమీ అనడంలేదు. కొంచెం ఓర్చుకో నాయనా, ఇంకా ఇలా వాంతి చేసుకుంటే నీ ఆరోగ్యం విషపూరితమౌతుంది'' అన్నాడు లింగ్‌టాన్.

ఆకురాత్రిడు తిన్నదంతా వాంతిచేసుకున్నాడు. అప్పుడు లింగ్‌టాన్ తిన్నగా కొడుకును లేవదీసి టీషాపుదగ్గరికి తీసు కెళ్ళాడు. అక్కడ అతనోరు కడిగించి కొంచెం వేడి 'టీ' ఇప్పించాడు. ఎంతో అభిమానంగల కురవ్రాడు తన బలహీన తకు సిగ్గుచెందాడు. తండ్రి కుమారునితో ఇలా చెప్పాడు. 'ఇలాటి దృశ్యాలు చూచినప్పుడు మానసికంగా బాధపడడం సహజంకాదు. అభిమానంగల వ్యక్తికైనా కోపతాపాలు తప్పకుండా కలుగుతాయి. ఇక్కడి అమాయక ప్రజలు ఇలాటి దురాచారానికి దురాగతానికి పాలుపడడంచూచి ఒక్క అడవిజంతువులుమాత్రమే సిగ్గుజగా ఉండగలవు.'

ఇరువురూ ఎంతో బరువుగా నిశ్శబ్దంగా కూచున్నారు. లింగ్‌టాన్‌హృదయం మరీ భారంగా ఉన్నది. ఈ విధ్వంసాని కంతటికీ అర్థం ఏమిటో అతనికి అవగతంకావటంలేదు. లింగ్ టాన్ ఇలా ఆలోచిస్తూఉండగా ఆ దుకాణంలోకి ఒక యువక విద్యార్థి వచ్చాడు. ఇలాటి యువకవిద్యార్థులు ఈరోజుల్లో ఎందరో తయారవుతున్నారు. హోటల్లో పది పదిహేనుమంది కూడిఉండడంచూచి అతను ఒకబెంచీఎక్కి నిల్చుని మాట్లాడ సాగాడు. అతను ఇలా మాట్లాడాడు :

'ఓ దేశభక్తులారా! నామాటవినండి. నిన్న మనశత్రువు మన నగరంమీద బాంబులు వెదజల్లి మనఇళ్ళనూ, మన వాకి ళ్ళనూ ధ్వంసంచేశాడు. ప్రజలను హతమార్చాడు. పసిపిల్ల బాలాదిగా ఎందరో హతమైపోయారు. యుద్ధం ప్రారంభ మైంది. మనం అందుకోసం తయారుగా ఉండాలి. శత్రువును ఎదిరించి పోరాడాలి. మనప్రాణాలు ఒడ్డిఅయినా సరే మనం

పోరాడాలి. వీరులారా! వినండి! మొదట్లో గెలుపు శత్రువు దిగా కనుపించినా చివరకు గెలుపు మనదే అవుతుంది. ఇప్ప టికే ఒక వందమైళ్ళు మనభూమిని శత్రువులాక్రమించారు. ఇక ఒక్క మైలయినా వారు ఆక్రమించకుండా మనల్ని మనం పరిరక్షించుకోవాలి. అందరూ పోరాడండి! పోరాడండి!'

లింగ్‌టాన్ కొడుకు ఈమాటలు వినగానే 'మంచిది మంచిది' అని అరిచాడు. ఇతర యువకులందరూ అలాగే చేశారు. కాని లింగ్‌టాన్ మాత్రం తన శూన్యహస్తాలకేసి చూచుకొని 'నేనెలా పోరాడగలను?' అన్నాడు. లింగ్‌టాన్ ఈమాట అనీఅనకముందే ఆ యువకుడు బెంచిదిగి వెళ్ళి పోయాడు. అతనిప్రశ్నకు సమాధానం చెప్పేవారు ఎవరూ లేకపోయారు. ఎందుచేతనంటే అందరూ అతనిలాగా శూన్య హస్తులే. ఈ శూన్యహస్తులందరినీ పరిహసించడానికా అన్నట్టు మళ్ళీ 'ఎగిరే ఓడల' శబ్దం వినిపించింది.

'ఎగిరేఓడలు! ఎగిరేఓడలు' అంటూ అందరూ ఊపిరి బిగబట్టుకుని హోటల్ విడిచివెళ్ళారు. గదిఅంతా ఖాళీ అయింది. లింగ్‌టాన్, అతనికొడుకు, వెయిటర్ మాత్రం మిగిలారు.

'మీరువెళ్ళి యెక్కడైనా దాక్కోండి' అన్నాడు వెయిటర్.

'ఎక్కడ దాక్కోవాలి? నీవు దాక్కోవా?' అని అరిచాడు లింగ్‌టాన్.

'నేను దాక్కోవలసిన అవసరంలేదు. నాకు లోకంలో వున్నదంతా యెప్పుడో నశించిపోయింది' అన్నాడు వెయిటర్.

శబ్దం దాపురరాసాగింది. వెయిటర్ బల్లలన్నీ తుడిచి హోటలంతా సర్దడం మొదలెట్టాడు. లింగ్‌టాన్ కొడుకుతో యేదో చెప్పబోయేసరికి విమానాలశబ్దం నెత్తిమీదికివచ్చింది. అతనిగొంతు అతనికే వినిపించలేదు. వెయిటర్ వాళ్ళదగ్గరికి వచ్చి బల్లలక్రింద దూరమని చెప్పాడు. వారిద్దరూ ఒక బెంచీ క్రింద దూరారు. ప్రతిక్షణం కప్పువిరిగి తమమీద పడుతుందా అన్నంత భయంతో కూచున్నారు.

పెద్దపెద్ద పిడుగులు పడుతున్నట్టు శబ్దంకాజొచ్చింది. అతనిచెవులు ఉబ్బి పగిలిపోయేట్టు ఉన్నవి. ప్రతిక్షణం మృత్యువుతో పోరాటంలావున్నది. మృత్యుభూతం వారి నెత్తిమీదినుంచి వెళ్ళిపోయేవరకూ వారు యెలాగో ఒకలా భరించారు. తరువాత అగ్నిధార కురిపిస్తున్నశబ్దం వినిపించింది. 'రా, త్వరగా యింటికిపోదాం' అని అరిచాడు లింగ్‌టాన్.

నెమ్మదిగా బైటికివచ్చారు. ఒకక్షణం పచ్చగావున్న నగరమంతా శ్మశానవాటికలా వుంది. లింగ్‌టాన్ కొడుకు చెయ్యిపుచ్చుకుని శిథిలాల్లోగుండా నడుస్తూవెళ్ళాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు. ఒక్కరూ మాట్లాడడంలేదు.

వారు గ్రామం చేరేసరికి సాయంకాలమైంది. లింగ్‌టాన్ నడివీధిలో ప్రవేశించగానే అందరూ, 'ఏంజరిగింది? ఏంజరిగింది?' అని ప్రశ్నించారు. అతను జరిగిన వివరాలన్నీ వారికి చెప్పాడు. వారందరూ ఎంతో శ్రద్ధతో భయంతో గుమిగూడి విన్నారు. అతను చెప్పినదంతా విని ఒక ముసలి వ్యక్తి—ఆ ఊరికంతా ముసలివ్యక్తి అతనొక్కడే—ఇలా అన్నాడు-

'పూర్వపు పద్ధతులే మంచివి. పూర్వపు రోజులే మంచివి. ఎవరిదేశంలో వాళ్ళు దేశం కదలకుండా ఉన్న ఆరోజులే మంచివి. విదేశీయులు మంచివారని కొందరు అనడం విన్నాను. కాని నాదృష్టిలో ఈ చెడుకంతా మూలకారకులు వారే. వారి చెడు వారి మంచికంటేకూడా హెచ్చు. వారు తాము పుట్టినచోటు కదలకుండాఉంటే ఎంతో బావుండే దని నా అభిప్రాయం.

సముద్రాలు దాటి వారు ఈశ్వరేచ్ఛకు వ్యతిరేకంగా నడిచారు.'

ఆ ముసలివాని మాటలు అందరూ శ్రద్ధతో విన్నారు. విషాదపూరిత వదనాలతో ఇళ్ళకు మళ్లారు. ఆరోజు రాత్రి లింగ్‌టాన్ గృహం ఎవరో చనిపోయినవారి గృహంలా ఉన్నది. ఏడుపులూ, నిశ్వాసలూ నిండాయి. చివరకు లింగ్ టాన్ అందరినీ కూచోబెట్టి ఒకవిషయం వినమన్నాడు. అంద రూవచ్చి అతనిచుట్టూ కూచున్నారు. ఆరాత్రి ఎవరికీ భోజనం సయించలేదు. తనవారి నందరినీ ఒక్కమాటుగా చుట్టూ చూచేసరికి లింగ్‌టాన్ కళ్ళు చెమ్మగిలాయి. అతనిహృదయం ద్రవించింది. 'వీళ్ళను రక్షించాలంటే నేనేంచెయ్యాలి?' అను కున్నాడు. ఇతర కష్టాలనుంచి వారిని రక్షించగల సామర్థ్యం అతనికున్నది. కరువునుంచికాని, వరదలనుంచికాని, దుర్మార్గత నుంచికాని, దారిద్ర్యంనుంచికాని, మరే మానవ సహజమైన బాధనుంచైనా వారిని అతను రక్షించగలడు. కాని ఇలాంటి కష్టంనుంచి అత నెలాతప్పించగలడు? 'నేను మిమ్మల్ని రక్షించ లేను. ఎందుచేతనంటే ఇప్పుడుమనలను ఎదుర్కొన్న ఈ క్రొత్త

ఆపదనుంచి నన్ను నేనే రక్షించుకోలేని పరిస్థితిలో ఉన్నాను. ఈరోజున నేను నాకళ్ళారా ఎన్నడూ నా జీవితంలో చూడనంత విపత్తు చూచాను. మనకు ఈ చక్కని మెత్తనిశరీరాన్ని ఈశ్వరుడు దుర్వినియోగం చేసుకుని దుష్టచర్యలకు దిగడానికై ఇవ్వలేదు. ఈ విపత్తులను ఎలా భరించాలో నాకు మట్టుకు తోచడంలేదు' అన్నాడు.

ఊలిన్ దగ్గి ఇలాచెప్పాడు—'నాకు ఎలా రక్షించుకోవలెనో దారి తోచలేదు. నా సంసారంతోపాటు మీఇంటికి వచ్చి ఉన్నందుకు మీ అందరినీ క్షమించమని కోరుతున్నాను. నాకు వర్తకవ్యాపారాలుతప్ప జీవనోపాధికి మరోమార్గం తెలీదు.'

లాయ్‌టా ఇలా అన్నాడు: 'ఆకాశంనుంచి అగ్నిధార కురుస్తున్నప్పుడు తప్పించుకోడానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి దాన్నుంచి తప్పించుకుని పరుగెత్తడం. మరొకటి భరించడం. నేను నాతండ్రి అనుసరించే మార్గాన్నే అనుసరిస్తాను.'

రెండోకుమారుడు 'నేను తప్పించుకునేదోవ చూస్తాను' అన్నాడు.

లింగ్‌టాన్ ఈమాటలన్నీ విన్నతరువాత తన ముగింపు వాక్యాలు చెప్పాడు, 'నేను భూసంపత్తిలేని వ్యక్తినైతే నేనూ వెళ్ళిపోయేవాణ్ణే. యువకుణ్ణయి ఉన్నా తప్పుకునిపోయేవాణ్ణే. కాని నామట్టుకు నేను పుట్టిపెరిగిన ఈ గడ్డమీదనే ఉంటాను. ఎలాంటి విపత్తు సంభవించినా, దేశం యావత్తు అధఃపతితమైపోయినా నేను ఇక్కడే ఉంటాను నాతో కలిసి ఉండేవారు ఉండవచ్చు. వెళ్ళదలచుకున్నవారు వెళ్ళవచ్చు'

తరువాత రెండో కుమారుడు, 'నీవు నన్ను నిందిస్తున్నావు నాన్నా' అన్నాడు.

'నేను నిన్ను నిందించడంలేదు బాబూ. నీవు వెళ్ళడమే మంచిదని నా ఉద్దేశం. ఇక్కడున్నవారందరూ దురదృష్టవశాత్తూ మరణిస్తే మన వంశంపేరు నిలబెట్టడానికైనా నీవుఉంటావు. యుద్ధం ముగిసిన తరువాతనైనా నీవు ఒకమాటు వచ్చి మేము బ్రతికిఉన్నామో లేదో చూచి పో.' అన్నాడు సాధుస్వరంతో.

'తప్పకుండా నాన్నా' అంటూ ప్రమాణంచేశాడు రెండో కుమారుడు.

ఇన్ని చర్చోపచర్చలు జరుగుతున్నా ఒక్క స్త్రీ కూడా మాట్లాడలేదు అందరూ లేచివెళ్ళినతరువాత ప్రతి స్త్రీ తనభర్తకు తనకుతోచినసలహా చెప్పింది. జేద్ తనభర్త యెంతో దృఢనిశ్చయంతో మాట్లాడినందుకు యెంతో ప్రశంసించింది.

మరుసటిరోజు, ఆమరుసటిరోజు ఎగిరేపడలు మళ్ళీ వచ్చాయి. అవి వచ్చిన ప్రతిరోజూ అవి కురిపించిన అగ్ని ధారలో నగరం స్నానంచేసినట్లయింది. రానురాను వీటి రాకపోకలు ఒక ఆటగా పరిణమించింది.

# 5

ఒక్క వానపడేరోజుతప్ప ప్రతిరోజూ మృత్యుదేవత వచ్చి నగరాన్ని సంపర్శించిపోతున్నది. నగరవాసులందరూ ఆలయాలకు వెళ్ళి దీర్ఘప్రార్థనలుచేయడం మొదలెట్టారు. అందరూ చుట్టుపక్కల గ్రామాల్లోనో, సత్రవులలోనో, చెట్టునీడనో తలదాచుకోసాగారు. లింగ్‌టాన్ ఇంత దుర్భర విషాదదృశ్యాన్ని తనజీవితంలో ఎన్నడూ చూడలేదు. ముసలివారు, స్త్రీలు, బాలురు అందరూ మూటాముల్లె కట్టుకుని ప్రాణాలు అరచేతిలోపెట్టుకుని కాలినడకన ప్రయాణం సాగిస్తున్నారు. కరువుకాటకాల రోజులలో ఉత్తరాన్నుంచి ప్రజలు ఇలా తరలిరావడం లింగ్‌టాన్‌చూచాడు. పూర్వం పేదవారుమాత్రమే తరలివచ్చేవారు. ఇప్పుడు ప్రాణభీతితో పేదా రాజూ తేడాలేకుండా అందరూ వస్తున్నారు. పేదల కంటె శ్రీమంతులే ఈ విషమపరిస్థితులలో ఎక్కువ బాధలకు లోనవుతున్నారు.

ఒక పెద్ద నదీప్రవాహంలాగ నగరంనుంచి ఈ ప్రజంతా పొంగి పొర్లివస్తున్నది.

మొదటిరోజుల్లో లింగ్‌టాన్‌గృహం ఒక ధర్మసత్రమైపోయింది. ఈ పరదేశులందరూ అతనిపంచ చేరారు. అతని స్త్రీలు వీరందరికీ వంటలుచేసిపెట్టి వారి కష్టనష్టాలకు సానుభూతిచూపారు.

ఒకరోజున లింగ్‌టాన్ ఇంటికి నలభయి యాభై మంది యువతీ యువకుల పార్టీ వచ్చింది. ఈ యువకులతో

కలసివచ్చిన యువతులు ఎంతో నవనాగరికంగా కనుపిం చారు. జేడ్ చూడగానే వారంటే ఎంతో ఇష్టపడింది ప్రతి స్త్రీ తనలాగే జుట్టు కత్తిరించుకుంది. ప్రతి స్త్రీదగ్గరా పుస్త కాలు వున్నాయి.

'మేము ఫలానా పాఠశాలలో విద్యార్థినులం. మేము ఇక్కడికి ఎంతో దూరానఉన్న కొండగుహాల్లోకి వెడు తున్నాం. మా గురువులు అప్పుడే అక్కడికి వెళ్లారు. మేము అక్కడికి మావిద్య పరిపూర్తి గావించుకోడానికి వెడుతున్నాం' అని చెప్పారు. 'మేము తిరిగివచ్చిన తరువాత శాంతిని రూపొం దిస్తాము' అని చెప్పారు. వీరిలో ఒక్కరూ తమజీవితాల్ని యుద్ధంలో ఆహుతి చెయ్యదలచుకోలేదు. ఇది లింగ్‌టాన్‌కు ఎంతో ఇష్టమయింది. వారు తనఇంట్లోఆగినమధ్యాహ్నం వారికి టీ మొదలైన సదుపాయాల ఏర్పరచి వారిని ఇలా ప్రశంసించాడు.

'విద్యలేనివారికి వట్టి శరీరాలుమాత్రమే ఉంటాయి. యుద్ధంలో అలాటివారే పాల్గొనాలి. విద్యావంతులు తమ విద్యాధనాన్ని అనవసరంగా వృధాచెయ్యకూడదు' అన్నాడు. లింగ్‌టాన్ ఇంకా ఇలాచెప్పాడు 'మానవుల కోరికలన్నిటికీ మూలంలో భూమిఉన్నది. కొందరికి మరీ హెచ్చుగా, కొందరికి మరీతక్కువగా భూమిఉంటే యుద్ధాలు తప్పవు' అన్నాడు.

అతనుచెప్పిన విషయాలన్నీ వారెంతో శ్రద్ధతో విన్నారు. వారు హృదయాల్లో అతను చెప్పినదాన్ని విశ్వ సించకపోయినా, 'నిజం తాతా' అన్నారు. ఆ మధ్యాహ్నం తన రెండోకుమారుడు లింగ్‌టాన్‌వద్దకు వచ్చి, 'నేనూ జేడ్

ఈ విద్యార్థులతో కలిసి వెడతాం' అన్నాడు. లింగ్టన్ వెంటనే వెళ్ళి తన అలవాటుచొప్పున తనభార్యతో సంప్రదించాడు.

'ఇలాంటి సమయంలో జేన్ వెళ్ళిపోవడం నాకేమీ బాగాలేదు. కనేసమయంలో దాన్ని ఎవరు చూస్తారు? అదీ కాక మనుమడు ఎక్కడో పూరాన జన్మించడం నాకిష్టం లేదు' అన్నది. ఈ మాటలకు లింగ్టన్ ఎంతో గంభీరంగా ఇలా జవాబుచెప్పాడు—'మనఇంట్లో కొద్దికుంది మాత్రమే యువతులు ఉండడం మంచిది. జేన్లాంటి అందగత్తె మనింట్లో ఈ సందర్భంలో ఉండకపోవడమే మంచిది' అన్నాడు. శత్రువులు అందగత్తెలను ఎలా మానభంగం చేస్తారో లింగ్టన్కు ఒక విద్యార్థి చెప్పాడు. అందుకని లింగ్టన్కు భయంగా వుంది. కాని ఎంతకూ భార్య ఒప్పుకున్నది కాదు. లింగ్టన్, 'అది వెళ్ళకపోతే వాడిక్షేమం ఎవరు విచారిస్తారు?' అన్నాడు.

తరువాత లింగ్టన్ లోపలికివెళ్ళి తనకుమారునితో 'జేన్ను తీసుకువెళ్ళమని చెప్పాడు. 'జేన్ కనినవెంటనే నాకు కబురుపంపించు' అన్నాడు.

'జేన్ చేత తప్పకుండా ఉత్తరం వ్రాయిస్తాను' అన్నాడు లాయ్ఎక్. జేన్ తనబట్టలు, కావలసిన సామాన్లు సర్దుకుంది. లాయ్ఎక్ కోసం కాచుకుని తన పక్కచుట్టపై కూచుంది. లాయ్ఎక్ రాగానే తన బరువైన కనురెప్పలెత్తి 'ఇక మనం బయలుదేరవచ్చా?' అన్నది.

లాయ్ఎక్ ఆమెపక్కగా కూచుని మృదువుగా, 'గర్భంతో వున్న నీవు నడవడం తలుచుకుంటే నాకెంతో

దిగులేస్తోంది' అన్నాడు. 'పిల్లాణ్ణి నేను భరిస్తే బావుండేది' అన్నాడు.

'పుట్టినతరువాత నీవే ఎత్తుకుని తిరగాలి' అన్నది జేద్.

వారిని సాగనంపుతూ లింగ్‌టాన్ జేన్‌తో ఇలా చెప్పాడు—'అమ్మాయీ, ఎన్నడూ ధర్మాన్ని తప్పకు. స్త్రీ ధర్మంగా ఉంటే ఎలాంటి ఉపద్రవమూ రాదు. స్త్రీ మూలం, పురుషుడు వృక్షంలాంటివారు. మూలం బలంగా ఉన్నప్పుడే వృక్షం చక్కగా పెరుగుతుంది' అన్నాడు.

ఈ మాటలు విన్నప్పుడు ఆమె అందమైన పెదవుల మీద ఒక చిన్న చిరునవ్వు మొలకెత్తింది. ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. తలవంచుకుంది. వారు కనుచూపు మేర దాటిపోయేవరకూ లింగ్‌టాన్ అలాగే చూస్తూ నిల్చున్నాడు.

వాళ్లు వెళ్ళిపోయిన రెండు మూడు రోజులవరకూ ఇల్లంతా బోసికొట్టినట్టుంది. ఇంట్లో అందరి మనస్సులోను ఏదో ఒక విధమైన దిగులు ఆవరించింది, కాని, రానురాను అలవాటుపడిపోయారు. జేన్ వెళ్ళిపోవడం అందరికంటె కూడా పాన్‌షియోకు హెచ్చుదుఃఖాన్ని కలిగించింది. జేద్ చివరి రోజులలో పాన్‌షియోకు కొద్దికొద్దిగా చదువు నేర్పింది. లింగ్‌టాన్‌కు మాత్రం అందరూ మళ్ళీ తమ మామూలు జీవితానికి అలవాటుపడడం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. మళ్ళీ రోజుమార్చిరోజు ఎగిరే ఓడలు రావడం మొదలెట్టాయి. నగరం సగానికిపైగా ధ్వంసమైపోయింది. ఒకరోజు సాయంకాలం లింగ్‌టాన్ టీ దుకాణానికి వెళ్ళాడు. అక్కడ గ్రామస్థు

లెందరో ఇంటిపనులు ముగించుకుని కూచుని ఉన్నారు. వారం దరి మధ్య లింగ్‌టాన్ లేచినిల్చుని ఇలా చెప్పాడు—'సోదరులారా! మనందరం శ్రామికులం. యుద్ధం ఉన్నా లేకపోయినా మనం ఆహారాన్ని పండించితీరాలి. మనం ఆహారాన్ని పండించాలంటే రోజంతా వెదురుపొదలో కూచుని వృథా చెయ్యడంవల్ల ఎలా పండించగలం?' అన్నాడు.

'అయితే మమ్మల్ని ఏం చెయ్యమంటావు?' అని అడిగారు కొందరు.

లింగ్‌టాన్ నవ్వి ఇలా చెప్పాడు. 'మనం ఎవరమూ వెదురుపొదల్లో దాక్కుని ఉండకూడదు. ఎగిరేవిడలు వచ్చినప్పటికీ మనం వాటిని చూచినట్టు నటించకూడదు. అలా మనందరం కలిసిచేస్తే వాటంతట అవే వెళ్ళిపోతాయి' అన్నాడు.

అందరూ ఇందుకు ఆనందించారు. ఆరోజునుంచీ అందరూ విమానాలు వచ్చివెళ్ళినా వాటిసంగతి పట్టించుకోకుండా పొలాల్లో పనిచెయ్యడం మొదలెట్టారు. వారి తలటోపీలకు గడ్డిబొమ్మలు తగిలించుకోడం మొదలెట్టారు. అందుచేత పైన విమానాలలో వెళ్ళేవారికి అవి గడ్డిమైదానాల లాగా కనుపిస్తాయి. రానురాను శత్రువులు నగరాలన్నీ ఆక్రమించుకుంటున్నారని విజయాలు సాధిస్తున్నారని లింగ్‌టాన్‌కు తెలియవచ్చింది.

'మనసైన్యాలన్నీ ఏమైనాయి?' అని అడిగేవాడు లింగ్‌టాన్. కాని ఈ మాటకు ఎవరూ సమాధానం చెప్పలేదు.

శత్రువు మంచివాడా? దుర్మార్గుడా? అని లింగ్‌టాన్ ఆలోచించేవాడు అతనికి బోధపడేదికాదు. తనఇంట్లో నివసిస్తున్న ఫ్రాలిన్ ప్రాచ్యసముద్రవర్తకులు మర్యాదస్తులనే చెప్పేవాడు. కాని అలాటివారివల్లనే ఇంత ఉపద్రవం సంభవించడం లింగ్‌టాన్‌కు ఎంతో ఆశ్చర్యం కలిగించింది.

అతను పొలాల్లో పనిచేస్తూ అనేకపర్యాయాలు ఈ విషయాన్ని గురించే ఆలోచించేవాడు. 'నాపని చేసుకుంటాను. నాకు ఎలాటి ఉపద్రవమూ రాదు' అనుకునేవాడు. కోతలరోజులు వచ్చాయి. లింగ్‌టాన్ ఒక్క వ్రాలిన్‌నుతప్ప అందరినీ పనికి రమ్మని ఒత్తిడిచేశాడు. వ్రాలిన్‌కు కొడవలి పట్టుకోడం తెలీదు. పెద్దమ్మాయి భర్తతో నవ్వుతూ ఇలాఅనేది: మీరు పిల్లల్నిచూస్తూ ఇంట్లోఉండండి. నేను చిన్నతనంలోలాగానే పొలానికివెళ్ళి పనిచేస్తాను' వ్రాలిన్‌కు ఒకటి రెండురోజులు పిల్లల్ని ఆడించేసరికి విసుకెత్తిపోయింది. ఒకరోజున భార్యతో కోపంగా, 'ఇవాళ పిల్లల్ని ఆడించమన్నావు. రేపు పాలివ్వమంటావు' అన్నాడు. భార్య పెద్దగా నవ్వింది. వ్రాలిన్ భార్యను కొట్టాడు. దాంతో నవ్వు ఒక పెద్ద పోట్లాటగా పరిణమించింది. లింగ్‌సా పెద్దకూతురును భర్తతోపోట్లాడకూడదని మందలించింది.

భార్యాభర్తలు పోట్లాడుకోవడం చూచి లింగ్‌టాన్ పెద్దమ్మాయిని పొలంపనికి రావద్దని చెప్పాడు.

# 6

పదకొండో నెల ప్రారంభంలో శత్రువులు నగరాన్ని సమీపించారు. పగలు ప్రశాంతంగా ఉన్నప్పుడు పొలంలో పనిచేస్తున్న లింగ్‌టాన్ తలెత్తితే దూరంగా చెలరేగుతున్న సమరసంరంభం అతనికి వినిపించేది. ఉండి ఉండి పిడుగుపడ్డట్టు పెద్దధ్వని వినవచ్చేది. ఆధ్వని ఏమైందీ ఎవరికి తెలిసేది కాదు. నగరంనుంచి వచ్చినవారు అది విదేశీ ఫిరంగులధ్వని అని చెప్పేవారు.

పారిపోయేవారి సంఖ్య తగ్గిపోయింది. వెళ్ళదలుచుకున్న వారందరూ వెళ్ళిపోయారు. ఏం జరిగినా భరించడానికి సిద్ధంగా ఉన్నవారే మిగిలిపోయారు. లింగ్‌టాన్ పగలంతా చలికాలపు పనిలో నిమగ్నుడై ఉండేవాడు. రాత్రిపూట గడ్డి చెప్పులు అల్లుతూ కూడా చేసేవాడు.

ఒక చిన్న మంచు వాన కురిసింది. ఆ మంచువానకు గోధుమ ఆకు పచ్చబడింది. వాన వెలిసిపోయింది. రోజులు మందంగా దొర్లిపోతున్నాయి. ప్రతిరోజూ ఒక దుర్వార్తను మోసుకుని వస్తోంది.

ఆ నెల ఏడవరోజు సైన్యసమూహాలన్నీ వెళ్ళిపోయాయి. నగరంలో శత్రువుతో పోరాడడంకోసం ఒక పటాలాన్ని మాత్రం నిలిపిఉంచారు. కాని సైన్యాధిపతులు వెళ్ళిపోయిన తరువాత సైన్యం ధైర్య సాహసాలతో ఉంటుందని ఏం నమ్మకం? నగరం చుట్టూతా ప్రజలందరూ వారి తాతముత్తాతలిచ్చిన కత్తి కటారులతో ఆత్మ సంరక్షణార్థం కాపాలా కాచు

కోడం మొదలెట్టారు. లింగ్‌టాన్ వద్దకూడా అతనితాత ఉపయోగించిన పెద్దకత్తి ఒకటి ఉన్నది. లింగ్‌టాన్ ఎన్నాళ్ళనుంచో పూడ్చిపెట్టిఉన్న ఆకత్తిని ఇప్పుడు బైటికితీశాడు. అతనిభార్య ఆకత్తికి పదునుపెట్టింది. రోజురోజుకూ సమరచ్ఛాయలు మరీ దట్టమవుతున్నవి. దూరాన్నుంచి పిడుగుల్లాగా ఫిరంగిమ్రోతలు వినిపిస్తున్నాయి. ఒక్కోసారి ఆ ఫిరంగి మ్రోతలు వినగానే అన్నం తింటున్నవారి చేతిలోముద్దలు అలాగే ఆగిపోయేవి. పసిపిల్లలు ఇల్లు ఎగిరిపోయేట్టు ఏడవడం మొదలెట్టేవారు.

చివరి దినాలలో లింగ్‌టాన్ ఎన్నో దుర్వార్తలు విన్నాడు. లింగ్‌టాన్, అతని బంధువులు ఒకవిధంగా అదృష్టవంతులు. ఎందువల్లనంటే వారిగ్రామం నగరానికి మూడు మైళ్ళకంటె ఎక్కువ దూరంలోఉన్నది. రెండుమూడు మైళ్ళ దూరంలోఉన్న గ్రామాలన్నిటిని శత్రువులనుంచి సంరక్షించడంకోసమై సంరక్షకసైనికులు కాల్చివేశారు. యాత్రికులు వారి సంసారాలతో, పిల్లలతో కరువుపాలపడిన వారిలా సాగిరావడం మొదలెట్టారు. లింగ్‌టాన్ వారిని ఏల దేశాంతరగతులైనారని ప్రశ్నించాడు. వారు 'మాఇండ్లు, పంటలు తగులపెట్టబడినవి. మాభూమి ఈనాడు వట్టి ఎండు నేల. ఇక మాకు మాగ్రామాలలో ఉండవలసిన పని ఏముంది? అక్కడే ఉంటే శత్రువులు మమ్మల్ని బ్రతకనివ్వరు'అని చెప్పారు. ఇలాచెప్పి వారిదోవన వారు వెళ్ళిపోయారు.

ఆరోజు సమరసంరంభం మిన్నుముట్టేటట్టు వినిపిస్తోంది. లింగ్‌టాన్ బైటికివెళ్ళి తనభూమివంక చూచాడు. తనూ తన

భూమిని బీడుపెట్టవలసిన అవసరం వస్తుందా? తను భూమిని బీడుపెట్టి ఎక్కడికి వెడతాడు? తను పెద్దసంసారి. .. గంపెడు పిల్లలు, స్త్రీలు. వీరందరితో కలసి తను ఎక్కడికి వెళతాడు? అతన్ని ఎవరు పోషిస్తారు ? లింగ్‌టాన్ మథనపడినాడు. అతన్ని అతనిభూమి గాఢంగా బంధించింది, భూమిని చాపలా చుట్టుకునిపోవటానికి వీలుంటే ఎంత బావుండేది ! అను కున్నాడు లింగ్‌టాన్. ఆవిషయమే ఆరాత్రి తనభార్యతో చెప్పాడు. కాని నాభూమి ఎంతో లోతయినది. పుడమికడుపు లోనికి చొచ్చుకొనిపోయిఉన్నది. కాని నేను నాభూమిని వదలిపెట్టను. ఎలాటి ఉపద్రవం వచ్చినా నేనిక్కడేఉంటాను. నాభూమిని నేను కాపాడుకుంటాను.' అన్నాడు.

'నేనుకూడా నీతోనే ఉంటాను' అన్నది లింగ్‌సా.

రోజులు గడిచిపోతున్నాయి. ఆనెల పదవరోజున సుడి గాలిలా ఒకవార్త వచ్చింది- మూడు రోజుల్లో శత్రువులు వస్తున్నారని. లింగ్‌టాన్ ఈవార్త వినగానే తనతలుపు గట్టిగా మూశాడు. ఎవరెంత పిలిచినా తలుపు తెరిచేవాడు కాదు. అందుచేత యాత్రికులందరూ మరెక్కడికైనా వెళ్ళేవారు. కాబట్టి అతని గృహక్షేమానికి ఎంతమాత్రం భంగం కలిగేది కాదు. యాత్రికులు ఈగ్రామాలలో కలిగించే అలజడి ఎంతో ఎక్కువగా ఉండేది. శత్రువు వచ్చి పరిపాలిస్తేనయినా దేశం చక్కబడుతుందని కొందరనుకునేవారు. ప్రతిచోటా బంది పోటు దొంగలగుంపులు హెచ్చిపోయాయి. గింజలమ్మి నిలవ చేసుకున్న ధనం ఈగుంపులపాలయిపోతోంది.

ఏవిధంగానైనా దేశపరిస్థితులు చక్కబడితే చాలని కోరినవారిలో ఫ్రూలిన్ ఒకడు.

ఒకరోజున లింగ్‌టాన్ గ్రామస్థులందరిని తనయింటికి టీకి పిలిచాడు. అతనిఇంట్లోచేరి గ్రామస్థులందరూ శత్రువును ఎలా ఎదుర్కొనవలెనో అని ఆలోచించారు. 'శత్రువు వచ్చేసమయం సమీపించిందని వారనుకున్నారు.

'మనగ్రామం అరక్షణీయమైనదని వారికి తప్పకుండా తెలుస్తుంది. ఇలాంటి అరక్షణీయగ్రామాన్ని శత్రువులు విధ్వంసం చెయ్యరని నేననుకుంటాను. ఎందుకంటే మనం వారితో తగాదాపడబోవడంలేదు. మర్యాదగా మన విజేతలను మనం ఎలా కలుసుకోవలెనో మనం ఆలోచించవలసి ఉన్నది. మనం అవివేకులంకాదని వారికి తెలియచెప్పాలి' అన్నాడు లింగ్‌టాన్.

అందరూ అతనిమాటలను అంగీకరించారు. కొందరు, 'ఈ శత్రువు ఎక్కడనుంచి వస్తాడు? ఎలా వస్తాడు? అతన్ని మనం ఎలా కలుసుకోవాలి?' అని ప్రశ్నించారు. వీరిలో ఒక్కరూ. తమ జీవితకాలంలో విదేశవిజేతను చూడలేదు. అందుచేత విదేశవిజేతలు వచ్చిన సందర్భంలో వారిని ఎలా కలుసుకొనవలెనో ఎవరికీ తెలీదు. వాళ్ళు ఇలా ప్రశ్నించిన తరువాత తొంభయిఏళ్ళముసలి తన వృద్ధవిజ్ఞానసంపదతో ఇలా చెప్పాడు: 'మనకు మన పద్ధతులుతప్ప మరే పద్ధతులు తెలుసు?' మనఊరికివచ్చే పెద్దమనుష్యులందరినీ ఎలా స్వీకరిస్తామో అలాగే స్వీకరిద్దాం' అన్నాడు.

అతను అంతకన్నా వృద్ధుడు. అందరూ అతని పలుకులు ఎంతో శ్రద్ధతో విన్నారు. కాబట్టి వారొక పథకాన్ని నిర్ణయించుకున్నారు.

శత్రువు సమీపించేసమయానికి కొందరు ఒక కూట మిగా ఊరివెలుపలికి వెళ్ళాలి. వృద్ధుడు అందరి కన్న ముందుగా వెళ్ళాలి. అతనవెంట తతిమ్మావారు వెడతారు. టీ, ఫలాలు, కేకులు తీసుకుని వెడతారు.

ఇలా నిశ్చయించుకున్న తరువాత గ్రామదుకాణ దారును పిలిచి టీ, కేకులు మొదలైన వస్తువులు తయారుగా ఉంచమని చెప్పారు.

పదకొండో నెల పదమూడవ రోజు తెల్లవారింది. ఆనాడు నిద్రలేవడంతోటే ఆరోజు ఎలాంటిరోజో లింగ్‌టాన్ గ్రహించాడు. సమరసంరంభమంతా ఆగింది. శత్రువుల రాక ముందు వాతావరణం ఎలానిశ్చలంగాఉండేదో అలా నిశ్చలంగా ఉన్నది. అది ఒక చల్లని శీతకాలపు ఉదయం. నేలంతా మంచు తెరతో కప్పబడి ఉన్నది. ఆరోజున లింగ్‌టాన్ పెందల కడనే లేచాడు. రాత్రికూడా సరిగా నిద్రపట్టలేదు. ఒంటరిగా వాకిట్లోకివెళ్ళి తనపొలాలవంక చూచాడు. చలికాలంలో గోధుమ మంచుపొరక్రింద ఆకుపచ్చని తివాసిలా కనపిస్తోంది. 'నేను ఈ గోధుమ కోతకువచ్చేవరకూ బ్రతుకుతానో లేదో. లేక ఈ గోధుమ మరెవరైనా కోస్తారో' అనుకున్నాడు.

ఇలా అనుకుంటూ లింగ్‌టాన్ లోనికివెళ్ళాడు. లింగ్‌సా వంటచేస్తోంది.

'ఈవాళ మనకు గండం ఉన్నది' అన్నాడు లింగ్‌టాన్.

'నాకు తెలుసు' అన్నది లింగ్‌సా. ఆమె కళ్ళెత్తి అతనివంకచూచింది. ఆమెకళ్ళలో నిశ్చలత కనుపించింది. 'నాకు మానవపుడంతే భయంలేదు' అన్నది. ఆమె ఎన్నో సార్లు ఇదేమాట అన్నది. ఆమె ఈమాట అన్నపుడల్లా అందులో కొత్త అర్థం ఉన్నట్టు అ త ని కి స్ఫురించేది. 'నేనుభయపడను' అన్నాడు లింగ్‌టాన్.

మౌనంగా స్నానంచేశారు. అందరూ నిద్రలేచి నిశ్శబ్దంగా కాలకృత్యాలు ముగించి అన్నం దగ్గరికివచ్చి కూచుని వున్నారు. ఇతర సమయాల్లో ఎంతో అల్లరిచేసేపిల్లలు కూడా ఈ సమయంలో ముసల్లా ఎంతో మౌనంగాఉన్నారు. భోజనంకాగానే లింగ్‌టాన్ ఇంటిపెద్దగా అందరితో ఇలా చెప్పాడు: 'నేలంతానిండిన ప్రశాంతి కారణంగా సమరం ముగిసిందని నా అభిప్రాయం. మనసైన్యం పరాజితమై తిరోగమించింది. ఈపాటికి శత్రువులు నగరాన్ని స్వాధీనంచేసుకుని ఉంటారు. మనంమాత్రం ఇల్లువిడిచి పోకూడదు. మీలో ఎవరూకూడా నాతో చెప్పకుండా కాలు బైటపెట్టకూడదు. ముఖ్యంగా స్త్రీలూ శిశువులూ బైటికివెళ్ళకూడదు. అన్ని పనులూ నేనే చూచుకుంటాను. ఎవరైనా పరదేశీవచ్చినా నేనే మాట్లాడతాను. నా పెద్దకుమారుడుతప్ప మీలో ఎవరూ నాకు కనుపించవలసిన అవసరం లేదు. అతనైనా నా ముఖంమీద ఏదైనా విషాదరేఖ కనుపించినప్పుడే దగ్గరకు రావాలి.'

అతను చెప్పినమాటలు అందరూ శ్రద్ధగా విన్నారు. తరువాత ఎవరి పనుల్లోకి వారు వెళ్ళిపోయారు. ప్రాలిన్ తన

గదిలోకి వెళ్ళాడు. స్త్రీలు తమపరుల్లో నిమగ్నులైనారు. లింగ్‌టాన్ పైపుకాల్చుకుంటూ కూచున్నాడు. అతని మనస్సు నిశ్చలంగాఉంది. ఆ నిశ్చలతకు కారణం ఏమిటా అని అతను ఆలోచించసాగాడు అతను దేనినో వింటున్నట్టుగా ఉన్నాడు. కాని అతనికి ఏదీ స్పష్టంగా వినిపించడంలేదు. ఈ గంభీర నిశ్శబ్దతకు అంతరార్థం ఏమిటో తెలుసుకోవాలనే ఉత్సుకత అతినికి హెచ్చింది. కొద్దిగా తలుపుతెరచి చూచాడు. మంచు కరిగిపోయింది. సూర్యుడు వెలుపలికి వచ్చాడు. వెచ్చని ఎండ పచ్చని పొలాలమీద తళతళలాడుతోంది. పెంపుడు కుక్క తనకాళ్ళదగ్గరికి వచ్చి ఎంతో అనునయంగా తోక ఆడించడం మొదలెట్టింది. కనుచూపుమేరలో ఎక్కడా ఒక్క జీవపదార్థమైనా కనుపించడంలేదు. అందరూ ఇళ్ళలోకూచుని తలుపులు బిగించుకున్నారు. ఎంతమేరచూచినా రోడ్డుమీద ఒక్క పురుగుకూడా కదలడంలేదు.

లింగ్‌టాన్ వాకిలిదాటి బైటికివచ్చి పైపుకాలుస్తూ ఒకక్షణం నిల్చున్నాడు. నగరంవంక చూచాడు. మంటలు కాని, పొగలుకాని ఏమీ కనుపించలేదు. నగరంచుట్టూ ఆకాశమంటే పెద్దగోడ. లోపల ప్రజలు ఎలాంటి అవస్థల పాలవుతున్నారో ఎవరికీ తెలీదు. అతను అలా నిల్చుని ఉండగా మరికొందరు తలుపులు కొద్దిగా తెరుచుకుని బైటికివచ్చి అతన్ని చూచారు. ఒకరిద్దరు బైటికివచ్చారు. ఒకరిద్దరల్లా పది పదిహేనుమంది అయినారు. వారు లింగ్‌టాన్‌వద్దకు వచ్చారు.

'మీకేమైనా వార్తలు తెలిశాయా?' అని అడిగాడు లింగ్‌టాన్.

'ఏమీ లేదు' అంటూ వారు తలలూపారు.

'మనం యెలాగైనా వార్త తెలుసుకోవాలి' అన్నాడు ఒకబంధువు.

'మనం యెలా తెలుసుకోగలం? నువ్వు నగరానికి వెళ్ళి అక్కడి విశేషాలు తెలుసుకొనిరాగలవా?' అని అడిగాడు లింగ్‌టాన్.

'నేను వెడతాను. నాకేంభయంలేదు' అన్నాడతను.

'వెళ్ళిమీనాన్ననుకనుక్కొనిరా' అన్నాడు లింగ్‌టాన్.

'నావిషయాలు నేనే చూచుకుంటాను' అన్నాడతను. ఇలా అని అతను వెంటనే నగరంవైపుకు నడకసాగించాడు.

తరువాత అందరూ ఎవరియిండ్లకువారు చేరుకుని తలుపులు బిగించుకున్నారు.

ఆ మధ్యాహ్నమంతా ప్రశాంతంగాగడిచింది. మధ్య మధ్య అప్పుడప్పుడూ తుపాకి మోత వినిపించేది.

లింగ్‌టాన్ ఆ రోజంతా యింట్లోనే గడిపాడు. అతను బైటికివచ్చి చూచేసరికి పొద్దుగూకవస్తోంది. నిద్రించేలోగా ఒక్కమాటు వాకిట్లోకివెళ్ళి చూచివస్తానన్నాడు భార్యతో. అతను తలుపుతెరిచి చూచేసరికి ఎవరో మూలుగుతున్నట్టు వినిపించింది. అతను నిదానంగా విన్నాడు. అతని హృదయం కొట్టుకోసాగింది. అతను భయంతో తలుపు మూయబోయాడు అంతలో ఒక శుష్కస్వరం 'అన్నా' అన్నది. ఆ స్వరం వినగానే మూస్తున్నతలుపు తెరచి లింగ్‌సాను దీపంతీసుకుని రమ్మని కేకవేశాడు. ఆమె వెంటనే దీపంతెచ్చింది. దీపంతెచ్చి

చూచేసరికి ఉదయాన నగరానికి వెళ్ళిన అతనిబంధువు కనుపించాడు. అతని ఒళ్ళంతా నెత్తురుమయమైఉన్నది.

'నీ విలాగే దీపంపట్టుకొని ఉండు. నేను వారి ఇంటికి వెళ్ళి ఇతనితల్లి-తండ్రిలను పిలుచుకుని వస్తాను' అని లింగ్‌టాన్ పరుగెత్తి వెళ్ళి వాళ్ళింటితలుపు గుద్దాడు. వెంటనే ఆ కుర్రవానితల్లివచ్చి తలుపు తెరచింది.

'మీ కుర్రవాడు గాయాలతో తిరిగివచ్చాడు. మా ఇంటిముందు పడిపోయాడు' అని చెప్పాడు లింగ్‌టాన్. ఆమె పెద్దగా ఒక కేకపెట్టింది. ఆ కేకవిని తండ్రి పరుగెత్తుకుంటూ వచ్చాడు అందరూకలసి పరుగెత్తుతూ కుర్రవాడు పడిఉన్న చోటుకు వెళ్ళారు. ఈలోగా ఈ చప్పుడుకు లింగ్‌టాన్ గృహంలో అందరూ నిద్ర లేచారు. కొద్దినిమిషాల్లో అక్కడ ఒక చిన్నగుంపుచేరింది కాని తల్లిదండ్రులు వచ్చేవరకూ ఆ కుర్రవాణ్ణి తాకడానికి ఎవరూసాహసించలేదు. ఆకుర్రవాణ్ణి చూడగానే అతనితండ్రిప్రాణాలు పైవిపేనే లేచిపోయాయి. తల్లి అతన్నితాకి అటూ ఇటూ తిప్పి అతను చనిపోయాడనుకుని గావుకేకపెట్టింది.

మినుకు మినుకుమంటున్న దీపకాంతిలో ఆ కుర్రవానిముఖం పాలిపోయి కనుపిస్తోంది. 'ఎవరు నాయనా నిన్నిలా చేసింది?' అంటూ తల్లి ఏడ్వసాగింది. కాని ఆమె ఏడుపు అతను వినుపించుకోలేదు.

'మనం ఇతన్ని మెల్లగా లేవదీసి పక్కమీద పడుకోబెట్టి, డాక్టర్ని పిలవాలి' అన్నాడు లింగ్‌టాన్.

అతను ఈ మాటలు ఎంతో మెల్లగా మర్యాదగా అన్నాడు కాని అతనితల్లి, 'నీవే మావాణ్ణి నగరానికి పంపించావు. లేకపోతే మావాడికి గతి పట్టేదికాదు' అంటూ లింగ్‌టాన్‌ను తిట్టసాగింది. లింగ్‌టాన్ తననుతాను సమర్థించుకుంటూ, 'నే నతన్ని వెళ్ళమన్లేదు. అతనంతట అతనే వెళ్ళాడు' అన్నాడు. అందరినీ 'అవునా కాదా?' అని సాక్ష్యం కోరాడు. అందరూ అతనివైపే సాక్ష్యం పలికారు. అంతటితో ఆమె ఊరుకుంది. ఆమె కోపానికి భయం కారణమని గ్రహించి లింగ్‌టాన్ ఆమెను క్షమించాడు.

అందరూకలసి ఆ కుర్రివాణ్ణి మోసుకుని వెళ్ళి ప్రక్క మీద పడుకోబెట్టారు. మరి డాక్టర్లు ఎక్కడనుంచి వస్తారు? డాక్టర్లందరూ నగరంలో ఉంటారు. కాని ఇలాంటి సమయంలో నగరంలోని డాక్టర్లందరూ ఎక్కడికో వెళ్ళిపోయి ఉంటారు.

'ఈ కుర్రివాడు చనిపోలేదు. నెత్తురు పోవడంవల్ల కొద్దిగా అపస్మారకంలో ఉన్నాడు' అనుకున్నాడు లింగ్‌టాన్.

లింగ్‌టాన్ తన బంధువునడిగి కొద్దిగా ద్రాక్షరసం తెప్పించి ఆ కుర్రివానిగొంతులో పోశాడు. అంతసేపూ ఆ కుర్రివానితల్లి ముక్కుతూ మూలుగుతూ అందరినీ ఆడి పోస్తోంది. చివరకు ఒకమాటన్నది 'నువ్వు జేడ్‌కోసం మాకు డబ్బిచ్చిన నాటినుంచి మావాడు మనిషిలాలేడు. వాడికి బ్రతికినా చచ్చినా ఒకలాగానేఉన్నది.'

ఈ మాటలకు లింగ్‌టాన్‌కు ఎంతోకోపంవచ్చింది. ఎందుచేతనంటే ఈ కుటుంబానికి ఎన్నోసార్లు లింగ్‌టాన్

ఎంతో సహాయం చేశాడు. ఇలా గందరగోళంగా ఒకరినొకరు ఆడిపోసుకుంటూఉండగా ఆ కుర్రవాడు శుష్కస్వరంతో 'నాన్నా' అని పిలిచాడు. అందరూ స్తబ్ధులై అతనివంక చూచారు. అతను బ్రతికిఉన్నాడని తెలియగానే అందరి హృదయాల్లోనుంచి కోపం ఎగిరిపోయింది.

'ఓ నాతండ్రీ, నీ కెలా దెబ్బలు తగిలినవో చెప్పరా' అంటూ తల్లి అతనిప్రక్కకు పరిగెత్తుకుని వెళ్ళింది.

కుర్రవాడు చెప్పడానికి ప్రయత్నించాడు కాని అతని స్వరం సరిగా వినిపించ లేదు. అతనిమాటలు వినడానికి అందరూ అతనిమీదికి వంగారు. అతను చెదురుచెదురుగా చెప్పిన మాటలనుబట్టి వారికి ఇలా అర్థమైంది. అందరితోపాటు అతన్నికూడా పట్టుకున్నారు. గోడకు నిలబెట్టి కాల్చారు. అర్ధరాత్రి దాటేసరికి అతను కొనఊపిరితో ప్రాకుతూ వీధి లోనికి వచ్చాడు. ఆ సమయంలో ఆ దారిలో ఒక శ్రీమంతు డైన బౌద్ధుడు వెడుతున్నాడు అతన్నిచూచి కరుణించి తన బండిలో ఎక్కించుకుని గ్రామంవద్ద వదలిపెట్టాడు. అతను నెమ్మదిగా ప్రాకుకుంటూ లింగ్టాన్‌గృహంవద్దకు వచ్చాడు. తరువాత అతనికి స్మారకం తప్పింది.

'వాళ్ళకు నిన్ను చంపవలసిన అవసరంఏమిటి?' అని ఆశ్చర్యపోయాడు లింగ్టాన్.

'మేము భయంతో పరుగెత్తాము. పరుగెత్తినవారినందరినీ వారు పట్టుకుని కాల్చారు'

ఈ సమయంలో ఉషోదయమైంది. తొలి ఉషఃకాంతులు గదిలోనికి వచ్చాయి. తన ఎదురొమ్ముకు తగిలిన గాయా

నికి బాధపడుతూ యువకుడు మూలగడం మొదలెట్టాడు. లింగ్టాన్ తెల్లవారగానే మళ్ళీవస్తానని చెప్పి తనఇంటికి వెళ్ళాడు. ఇంటికిచేరగానే లింగ్సాను పిలిచాడు. అతనిగొంతు వినగానే లింగ్సా పరుగెత్తుకునివచ్చింది. ఆమె అప్పుడు జుట్టుదువ్వుకుంటోంది. సగందువ్విన కేశభారాన్ని నోటిలో వుంచుకుని వెలుపలికివచ్చింది. లింగ్టాన్ భయంతో 'శత్రువులు వస్తున్నారు. అందరూ జాగ్రత్తగావుండండి' అన్నాడు.

అతనికేంచెయ్యాలో తోచక బైటికి పరుగెత్తుకునివెళ్ళి గ్రామస్థులందరినీ లేపాడు. తొంభై సంవత్సరాల ముదుసలిని బట్టలువేసుకోమని చెప్పాడు.

టీదుకాణానికివెళ్ళి టీ తయారుగావుంచమని చెప్పాడు. కొద్దిమంది గ్రామీణులతో, తొంభై ఏళ్ళవృద్ధుని నాయకత్వాన శత్రువును కలుసుకోడానికివెళ్ళే దృశ్యాన్ని ఊహించుకునేసరికి మొండుచేతనో లింగ్టాన్కు కళ్ళనీళ్లుతిరిగాయి. మొండుచేతనో అతనిహృదయం కంపించసాగింది. కాని అతనికి మరోగత్యంతరం తోచలేదు.'

వారు బైటికివచ్చి చూచేసరికి రోడ్డుమీద దూరంగా మసకమసక మంచుపొరలనుంచి ఏవోపెద్దస్వరూపాలు కదిలి రావడం కనుపించింది.

'ఇక వెడదాం' అని లింగ్టాన్ ముదుసలిప్రక్కకు వెళ్ళి నిల్చున్నాడు. అందరూకలిసి పయనమైనారు. ఆ స్వరూపాలు రానురాను ముందుకురావడం మొదలెట్టాయి. లింగ్టాన్, తదితర గ్రామస్థులు తప్పుకుని వాటికి దారివ్వావలసివచ్చింది. వారు చూచేసరికి అవి పెద్దమిషన్లుగా కనుపించాయి.

మిషన్లకు స్వాగతం యెలా చెప్పాలో వారికి అర్థంకాలేదు. లింగ్‌టాన్ ఇతర గ్రామస్థులతో కలసి ఒక ప్రక్క కుతప్పు కుని నిల్చున్నాడు. మిషన్లు దొర్లుకుంటూ ఊరిలోగుండా వెళ్ళిపోయాయి.

తరువాత ఒకరి నొకరు 'శత్రువంటే ఇదేనా?' అని ప్రశ్నించుకున్నారు.

ఎవరూ ఇలాటిమిషన్లు ఇంతకుపూర్వం చూడలేదు. కాని వీటికి సమాధానం ఎవరు చెప్పగలరు?

వారిచుట్టూ దుమ్ము మబ్బులాకూడింది. వారు కొంత కాలం ఆ దుమ్ముమబ్బులో నిల్చున్నారు. ఇంటికి వెడదామా వద్దా అని చర్చించుకుంటూ నిల్చున్నారు.

ఈలోగా ధణధణమని నడచివస్తున్న అడుగులచప్పుడు వినిపించింది. నడచివస్తున్న మనుష్యుల స్వరూపాలు కనుపించాయి. వీరే నిజమైనశత్రువులని వారు గ్రహించారు. అందరూ దగ్గర దగ్గరగాచేరి కూటమిగాకూడి నిల్చున్నారు. శత్రువుల నాయకులు సమీపించేసరికి వంగి నమస్కరించారు. ముదుసలి తన టోపీతీశాడు. అతను వెంటనే తన దీనకంఠ స్వరంతో 'స్నేహితులారా! విజేతలారా!' అని వారిని ఆహ్వానించాడు. శత్రునాయకులవదనాలు భయంకరంగా ఉన్నాయి. భయంకరంగాఉన్న వారివదనాలపై ఒక కృత్రిమమైన చిరునవ్వు తాండవించింది.

లింగ్‌టాన్ ముందుకువచ్చి 'అయ్యలారా! మేము వ్యవసాయం చేసుకొని జీవించేరైతులం. మేము శాంతిని కోరే వారం. మేము ధర్మాన్ని న్యాయాన్ని ఎన్నడూ తప్పం. మాకు

ఆయుధాలు లేవు. తమకోరకు కొద్దిగా 'కేకు'లను, 'టీ'ని సిద్ధంగా ఉంచాము' అన్నాడు. ఒక శత్రువు బిగ్గరగా 'మీ గ్రామసత్రం ఎక్కడున్నది?' అని అరిచాడు.

ఆ మాటలు లింగ్‌టాన్‌కు స్పష్టంగా వినిపించలేదు. అంతరాళంసంగా అవ్యక్తంగా ఉన్నాయి ఆ మాటలు.

'మా గ్రామవీధి మధ్యలోఉన్నది మాగ్రామం చాలా పేదగ్రామం. మేము పేదప్రజలం' అన్నాడు లింగ్‌టాన్.

'మమ్మల్ని అక్కడికి తీసుకువెళ్ళండి అన్నాడు శత్రువు.

లింగ్‌టాన్, ఇతర గ్రామస్థులు ముందునడవడం మొదలెట్టారు. శత్రువులు వెనుకనే రాసాగారు. ఒక శత్రువు తుపాకిమడమతో ముదుసలిని పొడిచాడు.

'అబ్బ' అన్నాడు ముదుసలి ఎంతోదీనంగా అతనిపట్ల అంత కఠినంగా ఎవరూ ప్రవర్తించలేదు.

లింగ్‌టాన్ వెనుదిరిగి శత్రువును ప్రతిఘటిద్దామను కున్నాడు. కాని, శత్రువులముఖాలు చూచేసరికి అతని నెత్తురు గడ్డకట్టుకుపోయింది. నిశ్శబ్దంగా ఏడుస్తున్న ముదుసలి చుట్టూ చెయ్యిచుట్టి నడవడం మొదలెట్టాడు. తనఇల్లుచేర గానే ముదుసలిని ఇంట్లో వదలి కొడుకును పిలచి అతని పట్ల జాగ్రత్త వహించమని చెప్పాడు. తరువాత వారు టీ దుకాణం వద్దకువెళ్ళారు. టీ దుకాణాదారు టీ, కేకులు సిద్ధంగా ఉంచాడు.

టీదుకాణం చేరగానే శత్రువులందరూ లోపలికివెళ్ళి గుంపులుగా కూచున్నారు. లింగ్‌టాన్, ఇతర గ్రామస్థులు

బైట కాచుకుని ఉన్నారు. లోపల శత్రువులకప్పులలో టీ పోయగానే ఒకశబ్దం వినిపించింది. మొదట్లో లింగ్‌టాన్‌కు ఆ శబ్దమేమిటో అర్థంకాలేదు.

'మాకు సారా కావాలి!' అని అరిచారు శత్రువులు.

లింగ్‌టాన్, అతని గ్రామస్థులు ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు.

'అయ్యో! ద్రాక్షరసం లేదే!' అన్నాడు లింగ్‌టాన్.

శత్రువుల ముఖాలు నల్లబడినై. ఒకశత్రువు 'మీ గ్రామంలో స్త్రీలు ఎలాటివారున్నారు.?' అన్నాడు.

'స్త్రీలు!'—ఆశ్చర్యపోయాడు లింగ్‌టాన్.

శత్రువు జవాబు చెప్పలేదు. అవును అన్నట్లు సైగ చేశాడు.

తనతోటి గ్రామస్థులతో స్త్రీలను సంరక్షించటానికై లింగ్‌టాన్ ఒక అబద్ధం ఆడాడు.

'నేను వెళ్ళి స్త్రీలను తీసుకొని వస్తాను' అని పరుగెత్తుకొని వెళ్ళి స్త్రీలతో 'వెళ్ళండి, దాక్కోండి, శత్రువులు వస్తున్నారు' అని స్త్రీలందరితో చెప్పాడు.

కొద్దిసేపటిలో ఎన్నోఅడుగులు తనవాకిలివైపుకు వస్తున్నశబ్దం వినిపించింది. అతను వినలేనంత భయంకరంగా ఉన్నది ఆచప్పుడు. అతను తలుపు ఓరగా తెరచి వెలుపల ఏం జరుగుతున్నదో చూచాడు అతను తలుపుతెరచి చూడగా భయంకరవదనాలు కనుపించాయి. కళ్ళు రాక్షసత్వంతో ఎరుపెక్కి ఉన్నాయి. తప్పతాగినట్లుగా ఉన్నారు వారు. లింగ్‌టాన్‌ను చూడగానే ఒకపెద్ద కేకపెట్టి అతనిమీద

పడ్డారు. అతడు ఒక అడుగు వెనక్కువేసి తలుపుమూసేశాడు. వారి తుపాకులకొనలు తలుపును గుచ్చుకున్నాయి. అతని కుక్క వారిని మీదికి ముందుకు సాగింది. 'కుక్కకూ, నాకూ నేటితో రుణంతీరింది' అనుకున్నాడు లింగ్‌టాన్. లింగ్‌టాన్‌కు ఒకవిషయం స్పష్టమయింది. యుద్ధంలో పాల్గొనే మానవుడు మానవుడుకాదని మనస్సువశించిన దానవుడని గ్రహించాడు. లింగ్‌టాన్ వెంటనే ఇంట్లోకి పరుగెత్తుకెళ్ళాడు. స్త్రీలందరూ మధ్యవసారాలో గుమిగా కూచునిఉన్నారు. 'మనచావు దగ్గరికివచ్చింది' అని అరిచాడు పెద్దకొడుకు. లింగ్‌టాన్ అతన్ని మౌనంగాఉండమని సైగచేశాడు.

'మీరందరూ తక్షణం వెనకగేటుగుండా వెళ్ళి తప్పించుకునిపోండి. మగవాళ్ళు మీభార్యలనుగూర్చి శ్రద్ధతీసుకోనండి' అని చెప్పాడు. 'నేను నీతోనేఉంటాను' అన్నది లింగ్‌సా. 'వీల్లేదు. నీవూ వెళ్ళాలి' అన్నాడు లింగ్‌టాన్. వెంటనే లింగ్‌టాన్ పరుగెత్తుకుని వెళ్ళి వెనకతలుపు తెరిచాడు. అది చాల చిన్నగేటు. వూలిన్, అతనితల్లి అందులో పట్టలేదు. వాళ్ళను ఆ గేటుగుండా బయటకు పంపేసరికి బ్రహ్మప్రళయమైపోయింది. ఈలోగా వెలుపల తలుపుదగ్గర పెద్ద చప్పుడుకావడం మొదలెట్టింది. పెద్దపెద్ద అరుపులు కేకలు వినిపించాయి.

లింగ్‌టాన్ మళ్ళీ మధ్యహాలులోకి వచ్చాడు. లింగ్‌సా పిల్లిలా భయంగా కూచునిఉంది. లింగ్‌సాను నెమ్మదిగా దూలంమీదికి ఎక్కించాడు. వాకిట్లో పెద్దచప్పుడయింది. శత్రువులు తోసుకుని వసారాలోకి వచ్చారు. లింగ్‌సా

లింగ్‌టాన్‌ను కరుచుకునికూచుంది. లింగ్‌టాన్ భయంతో తన తాతముత్తాతలను ప్రార్థించడం మొదలెట్టాడు.

హాలు ఖాళీగాఉండడంచూచి శత్రువులు ఒక గది నుంచి మరోగదికి పరుగెత్తడం మొదలెట్టారు. వంటింటిలోకి వెళ్ళి గిన్నెలన్నీ కిందికితోసేసిన శబ్దం వినిపించింది. ఇంతలో లింగ్‌టాన్‌కు ఒకమూలుగు వినిపించింది. ఒక పందిని నరక బోయేముందు ఆ పంది ఎలా ఆక్రందిస్తుందో అలాఉన్నది ఆ మూలుగు. ఒకటి రెండుమాటలు, మళ్ళీ మూలుగు విని పించాయి. అప్పుడు అర్థమైంది వారికి ఆ మూలుగు ఎవరిదో. వూలిన్ ముసలితల్లిని శత్రువులు పట్టుకున్నారు. ఆమె మూలుగు వినగానే లింగ్‌టాన్ లేచి వెళ్ళబోయాడు. లింగ్‌సా అతని చెయ్యిపట్టుకుని, 'నీవు వెళ్ళొద్దు. ఆమె అప్పుడే చని పోయింది. నీవు నీపిల్లలకోసం బ్రతికిఉండాలి' అన్నది అతి రహస్యంగా. ఆమె చెబుతున్నది సత్యమేనని గ్రహించి అతను కదలకుండా ఉండిపోయాడు.

చిట్టచివరకు శత్రువులు వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిన చాలాసేపటివరకు నిశ్శబ్దత అలాగే భారంగాఉంది. లింగ్‌టా, అతనిభార్య ఊపిరిపీల్చడానికికూడా భయపడ్డారు.

చిట్టచివరకు అతను ఆమెచెవిలో, 'నేను క్రిందికి వెడ తాను. మనపిల్లలు తిరిగివచ్చి మనం చనిపోయామనుకోవచ్చు' అన్నాడు.

పిల్లలవిషయం ఆమెచెవినిసోకేసరికి సరేనన్నది లింగ్‌సా. నెమ్మదిగా వారు క్రిందికి దిగారు. వాళ్లు ఇల్లంతాతిరిగి కలయ చూచారు. బెంచీలు, టేబిళ్ళు, మంచాలు అన్నీ తునాతునకలై

పోయాయి. ఇల్లంతా చూచిన తరువాత లింగ్‌టాన్, 'వాళ్లు బియ్యంతప్ప మరేమీ తీసుకుపోలేదు. మనవస్తువులలో వారి కేమీ అవసరంరాలేదు. ఉన్మత్తతలో వారికి అనవసరమైన వస్తువులన్నీ ధ్వంసంచేసేశారు' అన్నాడు.

శత్రువులు లింగ్‌టాన్ అన్నట్టుగానే చేశారు బట్టలు చింపేశారు. పరిక్కచుట్టలు తగలెట్టారు. వంటసామగ్రి నంతా విరజిమ్మేశారు. ఒకచోట వారికి ఒకజుట్టుకుప్ప కనుపించింది.

'ఇదేమిటి?' అని అడిగాడు లింగ్‌టాన్.

'ఇది జేడ్‌జుట్టు. ఒకనాడు కత్తిరించుకున్నది' అని చెప్పింది లింగ్‌సా.

ఆరోజంతా వారు ఏకాంతంగా దిగులుగా విధ్వంసమైనగృహంలో కూచున్నారు. ఎప్పుడెప్పుడు పొద్దుగూకుతుందాఅని ఎదురుచూస్తూ కూచున్నారు. ఎప్పుడు తమ కొడుకులలో ఒకకొడుకువచ్చి ఇతరుల క్షేమసమాచారం చెబుతాడా అని ఎదురుచూస్తూకూచున్నారు. గ్రామంలో ఇతరుల ఇండ్లుగూడా ఇలాగే ధ్వంసమైఉంటాయని వారికి తెలుసు. కాని వెలుపలికివెళ్ళి చూడడానికి వారు సాహసించలేదు. చీకటిపడింది. వారు జీవితంలో ఇంత దీర్ఘమైనరోజును ఎన్నడూ గడుపలేదు. చీకటిపడినతరువాత పెద్దకొడుకు, చిన్నకొడుకు మెల్లగా అడుగులు వేసుకుంటూ ఇంటికివచ్చారు. చీకటిలోకూచున్న లింగ్‌టాన్‌సా వారి అడుగులచప్పుడు మెల్లగా వినిపించింది. తరువాత పెద్దకొడుకు 'వాళ్లు వెళ్ళిపోయారు' అన్నమాట వినిపించింది.

'మేము వెళ్ళలేదు' అన్నాడు లింగ్‌టాన్ ఆ చీకటిలో నుంచి. తరువాత తన చెయ్యిచాచి పెద్దకొడుకును స్పృశించాడు. ఇద్దరూ ఒకరినొకరు గుర్తుపట్టుకున్నారు. కాని ఎవరూ లాంతరు వెలిగించడానికి సాహసించలేదు.

'పిల్లలెక్కడున్నారు?'-లింగ్‌సా అడిగిన మొట్టమొదటి ప్రశ్న ఇది.

'అందరూ నగరంలో ఉన్నారు' మెల్లగా చెప్పాడు పెద్దకొడుకు.

'నగరంలోనా?' అన్నాడు ఆశ్చర్య - భయాలతో లింగ్‌టాన్.

తరువాత పెద్దకొడుకు జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. 'మేము నగరమంతా తిరిగాము. చివరకు చిన్న జలద్వారంవద్దకు వచ్చాము. అక్కడ కొందరు నగరమంతా మృత్యుపూరితం గాను, దుఃఖభాజనంగానూ ఉన్నప్పటికీ స్త్రీలు శిశువులూ సుఖంగా ఉండదగిన స్థలం ఒకటి ఉన్నదని చెప్పారు. ఈ స్థలం జలద్వారంలోపల ఉన్నది. ద్వారంలోపల విశాలము ప్రశాంతమైన పెద్దమైదానం ఉన్నది. శత్రువులు ఆ స్థలానికి రాలేదు. ఎందుచేతనంటే ఆస్థలంలో శత్రువులు తీసుకోదగినది ఏమీ దొరకలేదు. అక్కడ మేము చీకటిపడేవరకూ వేచి ఉన్నాము. శత్రుపటాలం సమీపించడంచూచి జలద్వారం తెరిచారు. మేమంతా నెమ్మదిగా లోపలికివెళ్ళాము. అదిఒక విదేశపాఠశాల. అక్కడ ఒక విదేశీయస్త్రీ ఉన్నది.

నేను ఆమెను చాలాదగ్గరగ ఉండి చూచాను. ఆమె అన్యమతస్థురాలైనా ఆమె ముఖం ఎంతో ప్రసన్నంగా ఉన్నది.

ఆమె పాఠశాలచుట్టూ ఒకపెద్దప్రాకారం ఉన్నది. మేము తలుపు తట్టగానే ఆ స్త్రీ బైటికివచ్చి చూచింది. మమ్మల్ని భార్యాబిడ్డలతో చూడగానే తలుపుతెరచి లోనికి రమ్మన్నది.'

'మీ రక్కడ ఎందుకు ఉండలేదు ?' అని అడిగాడు లింగ్టాన్. 'స్త్రీలకూ పిల్లలకూ మాత్రమే అక్కడ చోటుంది' అన్నాడు పెద్దకొడుకు.

'వారక్కడ నిజంగానే క్షేమంగా ఉన్నారా?' అని అడిగాడు లింగ్టాన్.

'ప్రపంచమంతా దెయ్యాలు తాండవిస్తున్నా అక్కడికి రావు' అన్నాడు కొడుకు.

లింగ్టాన్ కొడుకుతో, 'ఇప్పుడు మీరు ఒకపని చెయ్యాలి. అక్కడ స్త్రీలకు క్షేమంగాఉన్నది కాబట్టి మీ అమ్మనుకూడా అచ్చటికి తీసుకువెళ్ళండి. ఇంకా రాత్రి బాగా ప్రొద్దుపోలేదు' అన్నాడు.

కొడుకులిద్దరూ తల్లివంక చూచారు. ఆమె సిగ్గుతో తలవంచుకుంది. ఆమె జీవితంలో మొట్టమొదటసారిగా, 'నాకు ఏ మానవుడన్నా భయంలేదు' అనలేకపోయింది. తండ్రి వ్రాలిన్ తల్లికి జరిగిన దురంతమంతా చెప్పాడు. కొడుకు లా ఉదంతమంతా విన్నారు. ఒక్కమాటకూడా ప్రతిపల్కలేదు. చివరకు పెద్దకొడుకు 'అమ్మా, రా, నిన్ను తీసుకుపోతాను. తమ్ముడు నాన్నతోకలసి ఇక్కడే ఉంటాడు. నిన్ను అక్కడ క్షేమంగాదించి నేను మళ్లీ ఇంటికివస్తాను. మేము ముగ్గురం ఉపద్రవం తప్పేవరకూ ఎలాగో ఒకలా కాలక్షేపం చేస్తాము' అన్నాడు.

భార్యాభర్తలు విడిపోతుంటే ఆ దృశ్యాన్ని చూడలేక కొడుకులిద్దరూ తలలు తిప్పేశారు. లింగ్‌సా తన 18వ సం॥రంలో కాపరానికివచ్చింది. ఆ నాటినుంచీ నేటివరకు ఒక్క నాడుకూడా వారు విడిగా లేరు. ఈనాడుమాత్రం వారు విడిగా ఎలాఉండగలరు ? కొడుకులు మొహాలు త్రిప్పుకున్న సమయంలో వారిద్దరూ ఎంతో అనురాగంతో కౌగలించుకున్నారు.

'నేను నిన్నువదలి వెళ్ళవలసిందేనా?'అన్నది లింగ్‌సా. 'ఈనాటికి మనకు ఈ పాడుయుద్ధంకారణంగా వియోగం ప్రాప్తించింది'అని కంటతడిపెట్టుకున్నాడు లింగ్‌టాన్. లింగ్‌టాన్ తనజీవితకాలంలో యుద్ధాలు చూచాడు. తన జాతిలోనే దుర్మార్గులైన సోల్జర్లను చూచాడు. స్త్రీలను స్పృశించే సోల్జర్లను చూచినప్పుడు అతనికి అడవిజంతువులను చూచినట్టుఉండేది. ఒక్క నిమిషం తనభార్య చెయ్యి పట్టుకుని నిల్చుని కొడుకును పిలిచి 'నాయనా ఇక తీసుకు వెళ్ళరా, తీసుకు వెళ్ళు. ఆమె ఒంటిమీద ఒక్క పురుగైనా వాలకుండా చూడు'అన్నాడు.

'నేను తీసుకువెళ్ళలేను'అన్నాడు కొడుకు బాధతో.

లింగ్‌టాన్ ఈవిధంగా తనభార్యను ఇంటినుంచి పంపేశాడు. ఆమెవెళ్ళిన ఆ రాత్రంతా కొడుకురాకకోసం ఎదురు చూస్తూ నిద్రించకుండా కూచున్నాడు. తనకొడుకులోపాటు తనూ వెళ్ళిఉంటే బాగుండేదని ఎన్నోసార్లు అనుకున్నాడు. కాని అతను వెళ్ళిఉంటేమాత్రం వచ్చేలాభమేముంది?

'ఇక నువువెళ్ళి నిద్రపోరా'అని చెప్పాడు మూడో కొడుకుతో. మూడోకొడుకు చిన్నవాడు. వాడికెప్పుడూ నేల మీద పడక అలవాటులేదు. ఈ దుఃఖసమయంలోకూడా వాడికి నేలమీద పడకంటే ఎంతో కష్టమైంది.

లింగ్‌టాన్‌కు నిద్ర పట్టలేదు. శిథిలమైన తనగృహంలో కండ్లలో ఒత్తులువేసుకుని కూచున్నాడు అతని పెద్దకొడుకు తిరిగివచ్చేసరికి చాలాసేపు పట్టింది.

'నేనే అమ్మను గేటులోపల వదిలిపెట్టాను. ఆ విదేశ స్త్రీ ఆమెను భద్రంగా లోనికి తీసుకెళ్ళింది'అని చెప్పాడు.

లింగ్‌టాన్ నిశ్వసించాడు. కాని సమాధానం చెప్ప లేదు. అతనిగుండెలో బరువుదిగినట్టయింది. అతనికి మాట్లాడ డానికి కదలడానికికూడా బుద్ధిపుట్టలేదు. తన కుమా రుడు కుప్పకూలి నిద్రించడం మొదలెట్టాడు. లింగ్‌టాన్ నిద్రి స్తున్న కుమారులపక్క కూచున్నాడు. కోడి కూసేవరకూ అలాగే కూచున్నాడు. కోడికూసింది.

'ఇంకా కోడికూస్తూఉన్నదా ?' లింగ్‌టాన్ ఆశ్చర్య పోయాడు. తెల్లవారేవరకూ అలాగే కూచున్నాడు. పల్చని ఉషఃకాంతి ఆదమరచి నిద్రిస్తున్న అతనకొడుకుల ముఖాలపై పడింది.

# 7

ఆనాటిరాత్రి మసకలో లింగ్సా ఆ తెల్లదొరసాని వంక చూచింది. ఆమె వెనకాల తలుపు మూసుకుంది. తన కొడుకు వెళ్ళిపోయాడు. ఆమె ఇప్పుడు ఒక విచిత్ర ప్రదేశంలో ఒక విచిత్రమైన స్త్రీతో కలిసిఉన్నది. పిల్లి బొచ్చులాగా పసుపుపచ్చగా ఉంది ఆ స్త్రీజుట్టు. కళ్ళు పాలి, పసుపు రంగుగా ఉన్నాయి. 'నాతో రా, నీ కుమార్తెలు ఎక్కడున్నారో చూపిస్తాను'అన్నది ఆ స్త్రీ. లింగ్సాకు ఈమాటలు అర్థమయ్యేసరికి ఎలా అర్థమైనాయాఅని భయంపుట్టింది.

'ఇక్కడ ఏదైనా మంత్రం తంత్రం ఉన్నదా ఏమిటి ? నాకు నీ మాటలు అర్థం అవుతున్నాయి' అన్నది లింగ్సా. ఆ శ్వేత స్త్రీ ఒక చిన్ననవ్వు నవ్వింది. 'నే ఇరవై సంవత్సరాలు ఈ నగరంలో గడిపాను. ప్రతిరోజూ మీభాష నేర్చుకోడానికి యత్నిస్తున్నాను. మీకు సత్యమతాన్నిగురించి చెప్పడానికై ఇలా చేస్తున్నాను. మీకు నామాటలు అర్థమైనాయంటే అందులో ఆశ్చర్యం ఏముంది? ' అన్నది. ఒక సన్నని ఇటుకరోడ్డు ప్రక్కగుండా ఆమె లింగ్సాను నడిపించుకుని వెళ్ళింది. దగ్గరగా పెద్దచెట్లు ఉన్నాయి. గుబురుగా కొమ్మలు వేళ్లాడుతున్నాయి. లింగ్సా ఎన్నడూ ఇలాంటి స్థలాన్ని చూడలేదు. తరువాత వారు ఒకపెద్దఇంటివద్దకు వచ్చారు. ఆ స్త్రీ లింగ్సాను ఆ ఇంట్లోకి ఒకపెద్దహాలుగుండా తీసుకుని వెళ్ళింది. హాలునిండా జనంఉన్నారు. కప్పుకువేళ్లాడ్తూ

ఒకచిన్నదీపం వెలుగుతోంది. వీరందరూ స్త్రీలూ, శిశువులూ. నీ కుమార్తెలూ, పిల్లలూ ఆమూల ఉన్నారు' అని చూపింది ఆ తెల్లదొరసాని లింగ్‌సా నిద్రిస్తున్నవారి మధ్యగుండా నడిచివెళ్ళింది. ఒక పెద్ద టేబిల్ దగ్గరగా నిద్రిస్తున్న ఆర్చిడ్, ఆమె ఇరువురు కూతుళ్ళూ కనుపించారు. పిల్లలూ, ఆర్చిడ్ నిద్రిస్తున్నారు.

పాన్‌షియోమాత్రం మేలుకునిఉంది వెక్కి వెక్కి ఏడుస్తోంది. తల్లినిచూడగానే వచ్చి తల్లికౌగిట్లో వాలింది. 'అమ్మా వచ్చావా?' అన్నది.

'వచ్చానమ్మా' అంటూ లింగ్‌సా పాన్‌షియో ప్రక్కన కూచుంది. లింగ్‌సా పాన్‌షియోను ఇంత లాలింపుగా ఎన్నడూ పిలవలేదు. ఇంత లాలింపుగా పిలిచేసరికి పాన్‌షియోకు ఎంతో ఓదార్పుగా ఉన్నది.

తల్లిచెయ్యి పట్టుకుని, 'నాన్న ఎక్కడున్నాడమ్మా?' అన్నది. 'ఇంట్లోఉన్నాడు. మీ అన్నలూ అక్కడే ఉన్నారు. ఇక్కడ అందరూ ఎలాంటిఅపాయమూ లేకుండా ఉన్నారా?' అని అడిగింది.

'ఇంతవరకూ అపాయం లేకుండా నేఉన్నాం. కాని నాకు అన్నం సయించలేదు. నాకు బలే భయంపుట్టింది. ఇప్పు డెంతో బలహీనంగాఉంది' అన్నది పాన్‌షియో.

'పడుకోమ్మా. తెల్లవారగానే భోజనంకోసం ప్రయత్నం చెయ్యొచ్చు' అన్నది తల్లి.

ఈలోగా పెద్దకూతురు కళ్ళుతెరిచి చూచింది. 'మా అత్తగారు ఎక్కడున్నదమ్మా? నీతో రాలేదా?' అనిఅడిగింది.

ప్రతి స్త్రీకూడా తనకు వివాహమైనతరువాత తనభర్త గృహానికి చెందుతుంది. కాబట్టి మొట్టమొదట అత్తవారి క్షేమసమాచారాన్ని విచారిస్తుంది. ఇలా అడగడం ఎంతో సబబని లింగ్‌సాకుకూడా తెలుసు. తనకుమార్తె ఇలా అడిగినా ఆమెమరణవార్త చెప్పడానికి లింగ్‌సాకు మనస్కరించ లేదు.

అందుచేత ఒకచక్కని అబద్ధంఆడేసింది. ఆమెఇంటివద్ద క్షేమంగానే ఉన్నదని చెప్పింది.

తరువాత పెద్దకూతురును 'నీభర్తఏడీ?'అనిప్రశ్నించింది.

'మమ్మల్ని ఇక్కడవదిలిపెట్టి షాపుదగ్గరికి వెళ్లాడు. నగరం పూర్తిగా పతనమైపోయింది కాబట్టి ఇక భయం లేదన్నాడు. నగరం ఎలాఉన్నదో చూచివచ్చి మమ్మల్ని తీసుకువెడతానని చెప్పాడు' అన్నది పెద్దకూతురు.

వీరిమాటలువిని ప్రక్కనే నిద్రిస్తున్నవారు ఒక్కొక్కరే మేల్కొనసాగారు. లింగ్‌సా పెద్దకుమార్తెప్రక్కన ఒకయువతి పడుకునిఉన్నది. ఆ యువతి వర్ణింపరానంత అందంగాఉన్నది. ఆ యువతిఅందాన్ని చూడగానే లింగ్‌సా ఇలాంటి స్త్రీ విశ్వసనీయురాలైన భార్య, పిల్లలను కన్నతల్లిఅయి ఉండడానికి వీల్లేదనుకున్నది. కాబట్టి ఆమెను పరీక్షించడానికై లింగ్‌సా ఇలా అన్నది.

'మీ కుర్రాణ్ణి నిద్ర లేపవేం అమ్మాయీ' అన్నది.

'నాకు పిల్లలులేరు' అన్నది ఆ సుందరాంగి.

'నీ విక్కడ ఒక్కతెవే ఉన్నావా?, అన్నది లింగ్‌సా.

'నాలాటి మరో ఆరుగురితో కలిసి ఇక్కడున్నాను' అన్నది ఆ యువతి.

దీనినిబట్టి లింగ్‌సా ఆమె ఒక వేశ్య అని అర్థంచేసుకున్నది. తను సంసార స్త్రీ కావడంచేత ఇక అలాటి స్త్రీలతో మాట్లాడడం సబబుకాదనుకొని తన కుమార్తెలమధ్య పడుకున్నది.

కాని ఆమెప్రక్కనడున్న అందగత్తె ఇంకా నిద్రపోలేదు.

'అమ్మా ! మీరు మా తరువాత వచ్చినారుకాబట్టి నగరం ఎలాఉన్నదో చెబుతారా ?' అన్నది మధురస్వరంతో.

ఆ అమ్మాయిగొంతులోని తీయదనానికి లింగ్‌సా ఆశ్చర్యపోయింది.

'నేను నగరంనుంచి రాలేదమ్మాయ్' అన్నది లింగ్‌సా.

'మీరు నగరంనుంచిరాలేదా? గ్రామంనుంచి వచ్చారా?' అని అడిగింది ఆ అందగత్తె.

'అవును' అన్నది లింగ్‌సా ముక్తసరిగా.

'అయితే ఈరోజున మేము నగరంలో ఎలాటి దుర్గతి పాలయినామో మీకు తెలీదన్నమాట' అన్నది ఆ తీయని గొంతుక. 'అబ్బ' అని నిశ్వసించింది.

లింగ్‌సా ఆమెను మరేదో అడగబోయేసరికి ఆర్చిడ్ లేచికూచుంది. ఆమెకళ్ళు నిద్రతో ఎరుపెక్కాయి.

'నీవుకూడా ఇక్కడేఉన్నావా అమ్మా ? ఇక్కడికి ఎలా వచ్చావు? నీ విక్కడికివస్తే ఇంటివిషయం ఎవరు చూచు కుంటారు? మేము అక్కడినుంచి వచ్చినతరువాత అక్కడ ఏం జరిగింది?' అని అడిగింది.

ఆమె ఈ ప్రశ్నలు బిగ్గరగా అడుగుతూంటే ప్రక్క నున్నవారు, 'ఊరుకో, ఊరుకో' అన్నారు. లింగ్‌సాకూడా తనకోడలిని 'ఊరుకో' అని గద్దించింది

ఆర్చిడ్ మళ్ళీ పడుకుంది. అందరూ ఆ దుఃఖపూరిత దినంతరువాత నిద్రించడానికి యత్నించారు.

లింగ్‌సా తనజీవితంలో రెండు ప్రక్కలమీద మాత్రమే పడుకున్నది. తను కన్యగాఉన్నప్పుడు తల్లిగారింటిలో ఒక చిన్న ప్రక్కమీద పడుకునేది. తనకు వివాహమైన తరువాత తనభర్తతో కలసి ఒక పెద్ద పక్కమీద పడుకున్నది. ఇప్పుడు ఇలాటి ప్రదేశంలో ఇంతమందిమధ్య నిద్రించడమంటే ఆమెకు ఎలాగోఉన్నది. హాలునిండా నిద్రిస్తున్నజనం క్రిక్కిరిసిఉన్నారు. వారి గురకలు, నిశ్వాసలు వినిపిస్తున్నాయి. ఆమె ఆ రోజున జరిగిన కల్లోలాన్నంతా స్మరిస్తూ పడుకున్నది. ఇంకా ఇలాటి దినాలు ఎన్ని గడపవలెనో, తనభర్త తను లేకుండా ఎలా ఉంటున్నాడో అని ఆలోచిస్తూ పడుకున్నది.

ఆ రాత్రి అనేకపర్యాయాలు, తెల్లవారగానే ముఖానికి మట్టిపూసుకుని గుడ్డలుచింపుకుని విరూపియై మళ్ళీ ఇంటికి వెళ్ళాలనుకున్నది. కాని ఉదయంకాగానే అలా చేయలేకపోయింది. ఆమె ఎంత కురూపినవుదామని యత్నించినా 'పూసా'కన్న విరూపికాలేదు. ఆమె పెందలాడేలేచి తన కుమార్తెలనులేపి పిల్లలకు పాలిప్పించింది. కాని ఆమెప్రక్కన పడుకున్న అందగత్తె ఇంకా నిద్రలేవలేదు. ఎర్రని సిల్కు

పరుపు కప్పుకుని నిద్రిస్తోంది. 'వేశ్యలు పొద్దు నడినెత్తికి వచ్చే వరకూ నిద్రిస్తారు' అనుకున్నది లింగ్‌సా ఒకవిధమైన అస హ్యంతో. 'వారు రాత్రిళ్ళు పనిచేస్తారుకాబట్టి పగలంతా నిద్రపోతారు' అనుకున్నది. లింగ్‌సా పెద్దకుమార్తె ఆర్చిడ్ నిద్రలేవగానే, వీరెవరని అడిగింది. వారితో మాట్లాడవద్దని చెప్పింది. పాన్‌షియోతో, 'ఆ కొత్తస్త్రీలలో ఎవరైనా నిన్ను అంటుకోనబోతే అంటుకోనివ్వకు. వారేదైనా అడిగితే సమా ధానంచెప్పకు. సాదగ్గరేఉండు' అని చెప్పింది.

తనవారి నందరినీ తనచుట్టూ చేర్చుకుని నిద్రిస్తున్న వారిని చూచింది.

బాగా ప్రొద్దెక్కిన తరువాత కొందరుస్త్రీలు పెద్దపెద్ద బకెట్లలో అన్నం, ఉప్పుచాపలు, కూరలు, గిన్నెలు, తీసుకు వచ్చారు. లింగ్‌సా 'మాదగ్గర డబ్బులేనప్పుడు మాకు అన్నం ఎలా?' అని అరిచింది.

నిన్న తను భర్తను డబ్బుఅడగడం మరిచిపోయింది. డబ్బుఇవ్వకుండా భోజనంచెయ్యడం ఎంతోఅవమానకరమైన విషయం. కాని బకెట్లుతీసుకువచ్చినస్త్రీలు నవ్వారు. ఇతరు లతోపాటు ఆమెనూ అన్నంతినమని చెప్పారు. ఎవరో పుణ్యా త్ములు పరలోకాల్లో పుణ్యంకోసం అన్నంపంపించారని చెప్పారు.

'అన్నంతిను తల్లీ, నీవు అన్నంతినడంవల్ల స్వర్గస్థురా లైన మా విదేశయజమానురాలిఆత్మ సంతృప్తిచెందుతుంది' అని చెప్పారు. లింగ్‌సాకూడా ఇతరులతో పాటు భోజనం

చేసింది. కడుపునిండినతరువాత ఆమెకు ఎంతో భారాన్ని మోస్తున్నట్టు అనిపించింది.

అందరూ అన్నంముగించినతరువాతకాని ఆ ఏడుగురు వేశ్యాంగనలు నిద్రలేవలేదు. వారు నిద్రలేచి సువాసన వెద జల్లుతున్న తమ కేశభారాన్ని వెనక్కుదువ్వుకుని ముఖాలు కడుక్కున్నారు. వారు ముఖాలు కడుక్కున్న విధానాన్నిబట్టి వారెవరో చెప్పవచ్చు. సాధారణస్త్రీలకంటె ఎక్కువకాలం ముఖాలుకడుక్కున్నారు. తరువాత వెళ్ళి తమ అన్నాలు తెచ్చుకుని వేరుగానిల్చుని తినడం ప్రారంభించారు. ఈ యువతులు ఇతరస్త్రీలవంక చూడలేదు. కాని అక్కడఉన్న ప్రతిస్త్రీ కూడా వారివంక ప్రక్కచూపులు ప్రసరించింది. కాని వారు దాపుకువచ్చినప్పుడు తమపిల్లలను దూరంగా తీసేవారు.

ఇలా ప్రారంభమయింది ఆ విచిత్రదినం. ఎందరో స్త్రీలతో పిల్లలతో కూడుకున్న ఈ భవనానికిఆవల పచ్చని పొలాలు అలాగేఉన్నాయి. గడ్డి ఇంకా పచ్చబారలేదు. కాని, మెత్తగా పట్టులాగా ఉన్నది. ఎండ కొంచెం హెచ్చిన వెంటనే వారందరూ పిల్లలనుతీసుకుని బైటికివెళ్ళారు. అప్పుడు స్త్రీలు పరస్పరం మాట్లాడుకున్నారు. చాలామందిస్త్రీలు లింగ్‌సా కరుణాపూరితవదనాన్నిచూచి ఆమెతో మాట్లా డారు. అందరూ ఆమెను 'మంచితల్లి'అని పిలిచేవారు.

కొందరుస్త్రీలు ఆమెకు విచిత్రవిషయాలు చెప్పడం మొదలెట్టారు. ఆమె ఇలాంటివిషయాలు ఎన్నడూ వినలేదు. ఆమెకు ఈ విషయాలు విన్నకొలది భయం హెచ్చింది. జాతి కంతా కేంద్రంలాంటి ఈ నగరంలోకే అడవిజంతువుల్లాగా

శత్రువులువచ్చారు. అడవిజంతువులకంటె హీనులీ శత్రువులు. జంతువులు పురుషులనూ, స్త్రీలనూ తినేస్తాయి. వీళ్ళు పురుషులను చంపి, స్త్రీలను ఎత్తుకుపోతారు. ముసలి, పడుచు అనేభేదంకూడాలేదు. ముందు పడుచులను తీసుకునిపోతారు. తరువాత ముసలివారిని తీసుకుపోతారు. ఒకపిల్ల– ఆ పిల్లకళ్లు ఏడ్చిఏడ్చి బాగా వాచిపోయాయి– యిలా చెప్పింది: 'మాఅక్క బిడ్డ పేగులూడివచ్చేట్లు ఏడ్చింది. ఆ బిడ్డకు అయిదునెలల కంటె ఎక్కువలేవు. పాలుతాగుతున్నబిడ్డను లాగేశారు. తరువాత కన్నతల్లికళ్ళముందరే పసిబిడ్డగొంతు నులిమేశారు. తరువాత ఇరవై ముప్ఫయిమంది తల్లినిచెరిచారు. ఆమె చనిపోయింది.'

'ఈ ఘోరాన్ని నీవు చూచావా?' అని అడిగింది లింగ్సా.

'నేను చూడలేదు. మానాన్న చెప్పాడు. నాకింకా వివాహంకాలేదు. నాతండ్రి నన్ను ఇక్కడికి ముందరే తీసుకొచ్చాడు. మా అక్కకు వివాహమైంది. వివాహమైనస్త్రీ ఇలాంటి దుర్మరణంపాలవుతుందని ఎవరనుకోగలరు?' అన్నది ఆ పిల్ల.

శత్రువులు ఒకనగరాన్నిజయించినప్పుడు ఏంచేస్తారో అందరికీతెలుసు. కొద్దిరోజులపాటు స్త్రీలను దాచిఉంచాలని కూడా అందరికీతెలుసు. కాని ఇలాటి దురంతం అందరికీ కొత్తగాఉన్నది. ఇతరసమయాల్లో ఇతరసైనికులు ఈనగరాన్ని ఆక్రమించారు. కాని ఇంతదురాగతాలు ఎన్నడూ సంభవించలేదు.

చనిపోయినవారిలో చాలామంది అమాయకులు, ఏమీ తెలీనివారు. కొందరు స్త్రీలు తమకళ్లారా చూచినదంతా పూసగుచ్చినట్టు లింగ్‌సాకు చెప్పారు.

ఒకమనిషి శత్రువునిచూచి వెనక్కుమళ్ళితే శత్రువులు అతన్ని కాల్చేసేవారు. అలాటిమరణాలు రోజుకు వెయ్యికి పైగాఉండేవి. ఒకమనిషి ఎవరైనా సోల్జర్‌లాగా కనుపిస్తే అతన్ని చంపేసేవారు. ఎవరికైనా ఒకపనిఇచ్చి అతను ఆపని చెయ్యడం ఆలస్యంచేస్తే అతన్ని చంపేవారు.

ఎవరైనా ముసలివాడుకాని, పండితుడుకాని పనిచెయ్యలేకపోతే అతన్నికాల్చేవారు. ఇలా వేలకువేలమందిని ప్రతి రోజూ హతమార్చేవారు.

ఆ ఉదయమంతా లింగ్‌సా ఈ దురాగతాలనువింటూ కూచున్నది. మధ్యాహ్నం మళ్ళీ భోజనంపెట్టారు. లింగ్‌సాకు అన్నం సరిగా సయించలేదు. రాత్రికూడ ఆమెకు ఆహారం అంతగా సయించనేలేదు.

రాత్రికాగానే లింగ్‌సాకు బధ్ధకమూ బడలికా ఏర్పడినై. ఆమెకు పెద్ద భయం పట్టుకుంది. మళ్ళీ తనప్రక్కన వేశ్యాంగన పడుకున్నది. 'నీ విక్కడున్నావేం? నీలాటివారు ఇక్కడ ఉండకూడదు' అన్నది లింగ్‌సా.

ఆయువతి మెల్లగా విషాదపూరితంగా నవ్వింది. 'తరువాత తీయనిగొంతుతో ప్రశాంతంగా, 'మేమూ స్త్రీలమే. మాకూ పశువులంటే భయం' అన్నది. ఇలాఅని లింగ్‌సాకు కొంచెంపక్కగా తప్పుకున్నది. తరువాత ఆమె లింగ్‌సాతో మాట్లాడలేదు. ప్రక్కనపడుకునివున్న ఇతరవేశ్యలతో మాటా

డింది. వాళ్ళు ఏంమాట్లాడుకున్నారో లింగ్‌సాకు అర్థంకాలేదు. వారు మరోనగరాన్నుంచి వస్తున్నారు. వారిభాష వేరు. వారి భాషలో వారుమాట్లాడుకున్నారు. అందుచేత లింగ్‌సాకు అర్థంకాలేదు. వాళ్లు ఎందరో పురుషులతో సంచరించవలసి ఉంటుంది కాబట్టి వారు ఎన్నోరకాలభాషలు మాట్లాడవలసి వస్తుంది. వారు కొన్నివిదేశభాషలుకూడా మాట్లాడేవారు.

'సూషో' నుంచి వచ్చినవారు కాబోలు అనుకున్నది లింగ్‌సా. అనుమానం తీర్చుకుందామనే ఉద్దేశంతో ఒక వేశ్యాంగనను 'నీవు 'సూషో'నుంచి వచ్చావా?' అనిఅడిగింది.

'అవును'అన్నది ఆ వేశ్య.

'అయితే ఈనగరంలో ఎందుకున్నారు?' అని అడిగింది లింగ్‌సా.

'మేము సూషో పతనమయ్యేసమయంలో అక్కడే ఉన్నాం మాఇంట్లో ఇరవైముగ్గురు వేశ్యాంగనలుండేవారు. ఇప్పుడు మేము ఏడుగురం మాత్రమే మిగిలాము. అందరం తప్పించుకుని రాలేకపోయాం. మాదగ్గర డబ్బు అయిపోవడం చేత ఇక్కడనుంచి వెళ్ళలేకపోయాం. ఇక్కడ ఒక తెల్లదొర సాని స్త్రీలకు శరణ్యమిస్తుందని తెలిసి ఇక్కడికివచ్చాం' అని చెప్పింది ఒక వేశ్యాంగన.

ఆమె ఇలాచెప్పి ప్రక్కకుతిరిగింది. తరువాత వారేమీ మాట్లాడలేదు. కొంతసేపటికి ఆమె మెల్లగా విలపించడం లింగ్‌సాకు వినిపించింది. ఆమె మెల్లగా విలపిస్తోంది. లింగ్‌సా దయాపూరితహృదయం ఆ దురదృష్టవంతురాలిని చూచి కరిగిపోయింది.

లింగ్‌టాన్ తన జీవితకాలంలో ఎన్నడూ ఒక్క వేశ్యాంగనవంకకూడా చూచిఉండడు ఈవిషయం లింగ్‌సాకు తెలుసు. ఆమె వేశ్యాంగనలను చూడడం ఇదే మొట్టమొదటి సారి. ఇంతవరకూ ఆమె వారిసగురించి వినడమేకాని చూచిన పాపానపోలేదు. ఆ వేశ్యాంగన అలాగే మెల్లగాశోకించి చివరకు అలసి నిద్రపోయింది.

అర్ధరాత్రివేళ లింగ్‌సాని ద్రకు భంగంకలిగింది. అందరూ నిద్రలేచారు. గోడకు అవతల ఫిరంగులమోతలు వినిపిస్తున్నాయి. స్త్రీలందరూలేచి వణికిపోతూ ఆ చీకటిలో కూచున్నారు. ఈలోగా పెద్దగొంతుకలు మాట్లాడడం వినిపించింది. ఈ గొంతుకలు మాట్లాడుతున్నభాష వారికి తెలియలేదు. శత్రువులు ఇక్కడికికూడా వచ్చారని వారు గ్రహించారు.

స్త్రీలందరూలేచి తమ దుస్తులువేసుకొని నిశ్శబ్దంగా ఉన్నారు. పసిపిల్లలనోళ్ళు నొక్కిపట్టారు. తరువాత కొద్దిసేపటికి తెల్లదొరసాని లాంతరుతీసుకుని ఆ హాలులోకివచ్చింది. ఆమె వారితో ఇలాఅన్నది. 'నేనుమీకొకదుర్వార్తతెచ్చాను. శత్రువు ద్వారందగ్గరఉన్నాడు. వారిని ప్రతిఘటించేశక్తి నా దగ్గరలేదు. నాకున్నది ఒక్కదైవబలంమాత్రమే. నా దేశబలంకూడా నాకున్నది. కాని వారు నాదేవునిచూచి భయపడరు. నాజాతి చాలాగొప్పది. కాని నాజాతిఅన్నా వీరి కంత భయంలేదు. నేను వీరితో ఒక బేరానికిదిగకతప్పలేదు అన్నది.

ఆమె వారందరిముఖాలవంక చూచింది. పాలిపోయిన ఆమెముఖంలో ఆమె సన్ననిపెదవులు కంపించడం వారు చూచారు. 'ఆ బేరం మీకుచెప్పాలంటే నాకెంతో సిగ్గేస్తు

న్నది. కాని మిమ్మల్ని మీరు రక్షించుకోవలసిన అవసరం ఉన్నది. కొద్దిమంది - అంటే అయిదారుగురు స్త్రీలను వారితో పంపితే శత్రువులు లోనికి రామంటున్నారు' అనిచెప్పి ఆమె ఊరుకున్నది. అందరూ మౌనంగాఉన్నారు. ఇతరులను రక్షించడానికై వారితో వెళ్ళడానికి ఏ స్త్రీలు సిద్ధపడతారు? ఎవరూ చెప్పలేకపోయారు.

ఎవరైనా తాము సిద్ధంగాఉన్నామని చెబుతారేమోనని తెల్లదొరసాని వేచిజూచింది. మళ్ళీ ద్వారంవద్ద అరుపులు, కేకలు ప్రారంభించాయి. తెల్లదొరసాని వెళ్ళిపోయింది. కాని ఎవరూ మాట్లాడలేదు. ప్రతి స్త్రీ 'నేనలాంటిపని ఎలా చెయ్యగలను?' అనుకున్నది. మళ్ళీ కొద్దినిమిషాల్లో తెల్లదొరసాని తిరిగివచ్చింది. ఈసారి త్వరత్వరగా మాట్లాడడం మొదలెట్టింది.

'వారినిక నేను ఆపలేను. నేను స్త్రీలను ఇవ్వనిపక్షంలో లోపలికివచ్చేస్తామని పెద్ద గోలచేస్తున్నారు. ఇలాంటిపనికి ఏ స్త్రీనైనా వెళ్ళమనిచెప్పడానికి నేనెవతెను? కాని నా మనస్సుకు ఒకవిషయం తోస్తున్నది. ఈ గదిలో పవిత్ర స్త్రీలను రక్షించడానికై ఈశ్వరుడు కొందరిని నియోగించిఉంటాడు. కాబట్టి—' ఇక మాట్లాడలేక పెదవులు కొరుక్కున్నది. ఆమె చేతిలోని లాంతరు కంపించసాగింది. అప్పుడు లింగ్‌సా ఒక సంఘటనచూచింది. ఆ సంఘటన ఆమె జీవితాంతంవరకూ మరచిపోలేదు. పాపాత్ముల్రాండ్రపట్ల ఆమెహృదయం కరుణాపూరితంగా, మృదువుగా ఉండేటట్లుచేసింది ఆసంఘటన. ఆమె ప్రక్కనున్న అందగత్తె లేచి మెల్లగా జుట్టు వెనక్కుదువ్వుకుని

చీర సవరించుకుని, ఎంతో అలసట, విషాదం కూడుకున్న స్వరంతో 'రాండే, అక్కలారా, వెడదాం రండి. మీరుజుట్టు దువ్వుకుని మళ్ళీ చిరునవ్వులు అలంకరించుకోండి. మళ్ళీ మన పనికి మనంవెళ్ళాలి' అన్నది. ఇతర వేశ్యాంగనలుకూడా లేచారు. ఎవరూ మాట్లాడలేదు. ఏడుగురు వేశ్యాంగనలూ, ద్వారంవంక నడిచి వెడుతూంటే ఎవరూ మాట్లాడలేదు.

తరువాత అందగత్తె తెల్లదొరసానిముందు నిలిచి 'మేము సిద్ధంగా ఉన్నాం' అన్నది.

'ఈశ్వరుడు నిన్ను కాపాడుగాక! ఈశ్వరుడు ఈ త్యాగానికి నీకు స్వర్గప్రాప్తి కలిగించుగాక!' అన్నది తెల్లదొరసాని.

కాని ఆ అందమైన వేశ్యాంగన తలవూపి 'మీదేవుడు మమ్మెరుగడు' అన్నది. ఇలాఅని మెల్లగా ద్వారంవైపుకు నడక సాగించింది. ఆమెను మిగతా వేశ్యలు అనుసరించారు. వారికి లాంతరుతో దారిచూపుతూ తెల్లదొరసానికూడా వెళ్ళింది. వారు వదలివెళ్ళిన ఆ గదిలో అంధకారంతప్ప మరేమీలేదు. ఏ స్త్రీకూడా ఒక్కమాటయినా మాట్లాడలేదు. తల్లులు పిల్లల ప్రక్కన పడుకున్నారు. లింగ్‌సాకూడా పడుకున్నది. ఆమె ప్రక్కన వేశ్యాంగన పడుకున్నస్థలం ఖాళీగాఉన్నది. లింగ్‌సా హృదయం ఎంతో భారమైనజాలితో బాధపడసాగింది. ఆమె కళ్ళవెంట నీళ్ళు కారజొచ్చాయి.

ద్వారందగ్గర గోల అణిగిపోయింది. తెల్లదొరసాని మళ్ళీ తిరిగిరాలేదు. మళ్ళీ తెల్లవారింది. లింగ్‌సా నిద్రలేచింది. ఆరోజూ క్రిందటిరోజులాగానే గడిచింది. రాత్రిజరిగిన ఘటనను స్త్రీలందరూ మరిచిపోయారు. ఒక్కరూ ఆ విషయాన్ని

గురించి ఒక్క మాటకూడా మాట్లాడలేదు. ఆరోజంతా నిశ్శబ్దంగా గడిచింది. తల్లులు పిల్లలను పాలిచ్చారు. ఆరోజంతా నిశ్శబ్దంగా గడిచింది. తెల్లదొరసాని మళ్ళీ తిరిగిరాలేదు. మళ్ళీ రాత్రిపడింది.

## శ్రీ వేమన గ్రంధాలయము
## తేళ్లపోలు. (కృష్ణా జిల్లా.)

ఫూలిన్ తనదుకాణంలో ఒంటరిగా పనిచెయ్యనారంభించాడు. అతను తిరిగివచ్చిన తరువాత మూడురోజులవరకు వీధిలోకే వెళ్ళలేదు. వికలమైఉన్నదుకాణాన్ని సర్దడం మొదలెట్టాడు. అతను దుకాణానికి వచ్చిరావడంతోనే సిరాలో బ్రష్ముంచి 'తూర్పుసముద్రవస్తువులు ఇక్కడ దొరుకుతాయి' అనివ్రాసి వాకిలిదగ్గర బోర్డుకట్టాడు. విద్యార్ధులువచ్చి అతనిదుకాణాన్ని ధ్వంసంచేసినతరువాత అతనికి సంతృప్తిగా ఉన్నరోజు ఇదొక్కటే. ఈ విద్యార్ధులందరూ ఎక్కడికి వెళ్ళిపోయారో! ఇప్పుడు ఒక్కడూ కనుపించడంలేదు. ఎందరో చనిపోయారు. కాని ఫూలిన్మాత్రం బ్రతికిఉన్నాడు. అతను దుకాణాన్ని మళ్ళీ తెరిచాడు. రోజులుబాగుంటే మళ్ళీ తన సంసారాన్ని తీసుకువస్తాడు. మళ్ళీ వాళ్ళు యధాపూర్వకంగా వర్ధిల్లుతారు.

'దేశభక్తిఅంటే దుకాణాలు ధ్వంసం చెయ్యడమా?' అనుకున్నాడు ఫూలిన్.

ఆ విద్యార్థులకంటె తనే గొప్ప దేశభక్తుణ్ణనుకున్నాడు ఫ్రూలిన్. అతను వాళ్ళలాగా శత్రువులతో పోట్లాడి ఇబ్బందుల్ని పడలేదు. ఇతరుల వస్తువులను ధ్వంసం చెయ్యలేదు. మళ్ళీ తను తన సంసారాన్ని పోషించి వర్తకాన్ని నెలకొల్పుకుంటున్నాడు.

అందుచేతనే, అతను జీవితంలో ఎన్నడూ తనదుకాణాన్ని తుడిచినపాపాన పోకపోయినా, ఈనాడు తనంతతానే పరిశుభ్రం చెయ్యడం మొదలెట్టాడు. ఇంకా నగరమంతా వికలంగానే ఉన్నది. రోడ్లమీద శవాలు గుట్టలుగా పడి ఉన్నాయి. రాత్రులు అరుపులు, మూల్గులు వినవస్తున్నాయి. ఇలాంటప్పుడు తనభార్యను తీసుకొనిరావడం ఎంతవరకు సబబు అనే విషయాన్ని గురించి అతనింకా ఏమీ నిశ్చయించుకోలేదు. అతను ఆరోజంతా గడపదాటి బైటికి వెళ్ళలేదు. దుకాణంలో కూచుని దుకాణం సర్దుకోడం మొదలెట్టాడు. నాకు ఈ విషయాలన్నీ అనవసరం. నేను శాంతిప్రియుణ్ణి' అనుకున్నాడు.

తరువాత ఫ్రూలిన్‌కు ఒక ఆలోచన—తనభార్యను తీసుకురావడానికిముందు నగరవిజేతలవద్దనుంచి తను మంచి పౌరుణ్ణని, ఒక రక్షణపత్రం తీసుకోడం మంచిదనితట్టింది. ఆ పత్రం తీసుకోడానికి ఎవరిదగ్గరికి వెళ్ళాలో ఎవరినిఅడగాలో ఫ్రూలిన్‌కు తెలియలేదు.

అతను దుకాణానికి బోర్డు తగిలించినతరువాత నలుగురు శత్రుసైనికులు అతనిదుకాణానికివచ్చి భోజనంకోసం అడిగారు. అందులో ఒకడు ఆఫీసర్‌లాగా ఉన్నాడు.

ఆ ఆఫీసరు ఉప్పుచేపకోసం అడిగాడు. కాని ఫ్రాలిన్ దగ్గర ఉప్పుచేపలేదు. నూనెల్లోవేసిన చేపఉన్నది. ఆ చేపలు తెచ్చి ఫ్రాలిన్ వారికి చూపించాడు. ఆఫీసర్, 'ఖరీదెంత?'అని అడిగాడు.

ఆఫీసర్ ఇలాఅడిగేసరికి ఫ్రాలిన్‌కు ఆశ్చర్యంకలిగింది. సైనికులు తనదుకాణానికి రావడం, కావలసిన వస్తువులు తీసుకుని ఏమీచెప్పకుండా వెళ్ళిపోవడం చూచాడు. కాని, ఇలా అతన్ని ధరఅడిగినవారిని చూడలేదు. అందుచేత సంతోషంతో ఒకచిరునవ్వునవ్వి, 'ధరదేముందిలెండి. బహుమతిగా పుచ్చుకోండి' అన్నాడు.

ఫ్రాలిన్ ఈ మాట అనేసరికి ఆఫీసర్‌కూడా ఆశ్చర్యపోయాడు.' 'అయితే నువ్వు మమ్మల్ని ద్వేషించవన్నమాట!' అన్నాడు.

ఫ్రాలిన్ మరింతచిరునవ్వు తెచ్చుకొని 'నేనుఎవరినీ ద్వేషించను' అన్నాడు.

ఆఫీసర్ గౌరవంతోవంగి, సోల్జర్లతో ఏదోమాట్లాడాడు. వారూ గౌరవంతో వంగారు ఆఫీసరు 'మీరు ఈవస్తువులకుగాను తప్పకుండా ఏదైనాపుచ్చుకోవాలి' అన్నాడు.

'నేను తీసుకోలేను. మీదేశంనుంచి ఈ వస్తువులు కొన్నాను. మళ్ళీ మీకే ఇస్తున్నాను' అన్నాడు ఫ్రాలిన్-తనూ వంగి నమస్కరిస్తూ.

ఆఫీసర్ ఒక చిన్న స్టూలుమీదకూచుని వీధివంక చెయ్యిచూపుతూ, ఈ జరిగిన ధ్వంసానికంతా మేమెంతో విచారిస్తున్నాం. మా సైనికులకు కోపం హెచ్చు' అన్నాడు.

వూలిన్ తలవంచి 'మాకూ మా సైనికులున్నారు. సైనికులవిషయం నాకు తెలుసు. కాని ఇకముందయినా మనం శాంతిని వాంఛిద్దాం. శాంతిలోనే మనం వ్యాపారం చెయ్యగలుగుతాం' అన్నాడు.

తరువాత ఆఫీసర్‌కు అర్థమయ్యేట్లు సాధారణమైన చిన్నచిన్నపదాలలో విద్యార్థులు తనదుకాణాన్ని ఎలా ధ్వంసంచేశారో చెప్పాడు. ఇటీవలి సంవత్సరాలలో మా దేశంలో కాలం ఎంతో విషమించింది. ఇకముందైనా బాగుంటుందనుకుంటాను' అన్నాడు.

'అందరూ నీలాంటి వారయితే తప్పకుండా బాగుంటుంది. అలా వాగ్దానంచేస్తున్నాను' అన్నాడు ఆఫీసర్. 'నాలాటివారు చాలామందిఉన్నారు. అన్నాడు వూలిన్ వినయంగా. అతనికి ధైర్యం, ఉత్సాహం అధికమైనాయి. బీరువాలోనుంచి కేకులుతీసి సైనికులకు తలాఒకటి ఇచ్చాడు. వారు ఎంతో సంతృప్తిచెందారు.

'టీ ఇవ్వలేనందుకు క్షమించండి. ప్రస్తుతం నాసంసారం ఇక్కడలేదు. నేను ఒంటరిగా ఉంటున్నాను' అన్నాడు. వూలిన్.

'ఎందువల్ల?' అని అడిగాడు ఆఫీసరు.

వూలిన్ చెయ్యి అడ్డంపెట్టుకుని దగ్గి 'తల్లిగారింటికి వెళ్ళింది. కొద్దిరోజుల్లో తిరిగివస్తుంది' అన్నాడు.

వూలిన్ భార్య అక్కడ ఎందుకు ఉండలేదో ఆఫీసర్‌కు బాగాఅర్థమైంది. వూలిన్ ఆవిషయం చెప్పకపోవడంవల్ల ఆఫీసర్ సంతోషించాడు. తరువాత వూలిన్‌ను ఒకకాగితం

కలం తీసుకున్నాడు. ఫ్రూలిన్ అది తీసుకుని రాగానే ఆఫీసరు ఫ్రూలిన్ చదవలేని అక్షరాల్లో తనపేరు, తనుఎక్కడ ఉండేది, మొదలైన వివరాలు వ్రాసి ఫ్రూలిన్‌కు ఇచ్చాడు.

'నీ కెవరైనా ఇబ్బంది కలిగిస్తే ఈచీటీ చూపించు' అన్నాడు. ఫ్రూలిన్‌కు ఆఫీసర్ పట్ల ఎలా కృతజ్ఞత చూపవలెనో తెలీలేదు. మీ రుణం ఎలా తీర్చుకోగలను? నాకు ఏం చెప్పాలో తెలీడంలేదు. ఎప్పుడూ మీ ఆజ్ఞాబద్ధుణ్ణి'అన్నాడు.

నీకు కావలసిఉంటే రక్షణకోరకు మా ప్రధాన కార్యాలయంనుంచి ఒకగార్డును పంపుతాను' అన్నాడు ఆఫీసరు. ఈమాట వినేసరికి ఫ్రూలిన్‌కు సంతోషమైంది. కాని తన దుకాణంముందు సైనికదళంఉండడం ఊహించుకునేసరికి భయం, కంపం కలిగాయి. అందుచేత వణుకుతున్న కంఠంతో, 'నాలాటి చిన్నవర్తకునికి రక్షకదళం ఎందుకులెండి. తమకు ఎప్పుడైనా నావల్ల ఎలాటిసేవయినా అవసరమైతే నన్ను పిలిపించండి. ఈ దుకాణం నా తండ్రిగారిది. ఆయన తరువాత నాకు ప్రాప్తించింది. మీ చలవవల్ల నాతరువాత నా కుమారునికి ప్రాప్తిస్తుంది'అన్నాడు.

'తప్పకుండాను. మమ్మల్ని ప్రతిఘటించనివారికి మేము ఎలాంటిద్రోహమూ చెయ్యము'అన్నాడు ఆఫీసర్.

దయామయులను నే నెందుకు ప్రతిఘటిస్తానండీ?' అన్నాడు ఫ్రూలిన్.

తరువాత ఆఫీసర్ వెళ్ళిపోయాడు. ఫ్రూలిన్ మెల్లగా కూచుని తననుదుటిపై చెమట తుడుచుకున్నాడు. అది చలి కాలం. అయినా తనదేహమంతా స్వేదంతో తడిసిపోవడం

చూచి అతనికి ఆశ్చర్యం కలిగింది. దానికికారణం అతనికి శత్రువులపట్లగల భయమేననీ, ఆ భయం తీరిపోగానే అతనికి చెమటలుపోశాయనీ అతను గ్రహించాడు. 'నేను శత్రువులను ప్రతిఘటించకూడదు. అంతే. అప్పుడు నాకు భయండుండదు' అనుకున్నాడు ఫ్రాలిన్.

అతనిమనస్సు ఒక విధమైన హాయితో నిండింది. ఇంత హాయి ఈమధ్య అతనెన్నడూ ఎరుగడు. ఆ మధ్యాహ్నమే అతని దుకాణానికి ఒకసోల్జర్ వచ్చాడు. ఆ సోల్జర్ ఒక చిన్న పెట్టె తీసుకువచ్చాడు. ఆపెట్టెలో శత్రువులజండా ఉన్నది. అది తీసుకోగానే ఇక తనకు ఎలాంటి భయమూ లేదనుకున్నాడు ఫ్రాలిన్. వెంటనే ఆ సైనికునికి కొద్ది డబ్బిచ్చిపంపి ఆ చిహ్నన్ని తనదుకాణం తలుపుకు తగిలించాడు. ఇలా ఆ చిహ్నన్ని తలుపుకు తగిలిస్తూఉండగా అతనికి ఒకమూలుగు వినిపించింది. ఆ మూలుగు ఒక అమ్మాయిది. ఒకనిమిషం ఆమూలుగు వినడానికి ఫ్రాలిన్ ఆగాడు. ఆ అమ్మాయి మూలుగుతూ 'అతనేనా ఆ సైనికుడు? ...ఆసైనికుడు?' అంటోంది.

తరువాత ఆఅమ్మాయి మాట్లాడలేదు. నిశ్శబ్దం. ఆనిశ్శబ్దానికి అర్థమేమిటో తెలుసుకుందామని ఫ్రాలిన్ అనుకున్నాడు కాని ఆ అమ్మాయిదగ్గరకు వెళ్ళలేదు. 'యుద్ధం'లో ఇలాంటివి సామాన్యంగా జరుగుతాయి' అనుకుని వేడి టీ చేసుకున్నాడు. టీ తాగుతూ ఆ అమ్మాయి దుర్దశనుగురించి ఆలోచించడం మొదలెట్టాడు. అతనికి ఆ అమ్మాయితండ్రి మీద కోపంవచ్చింది. 'ఈ యుద్ధసమయంలో ఇంత చిన్న పిల్లను ఇక్కడెందుకు ఉంచాలి?'అనుకున్నాడు. తను తెలివి

తేటలతో సురక్షింతగా ఎలాఉన్నాడో తెలుసుకుని తన తెలివి తేటలను తనే ప్రశంసించుకోవడం మొదలెట్టాడు. కాని అంతా అతను అనుకున్నట్టుగా జరగలేదు. ఆ సాయంత్రం అతను వెళ్ళి చూచేసరికి తలుపుదగ్గర అతను తగించిన శత్రువులచిహ్నాం లేదు. తను చేతులారా తగిలించిన శత్రుచిహ్నాం లేకపోవడం చూచేసరికి అతనికి భయం కలిగింది. ఎవరో విద్యార్థి దొంగ తనంగావచ్చి దీన్ని తొలగించిఉంటాడనుకున్నాడు.

'ఎవరో శత్రువు ఈపని చేసిఉంటాడు. నాప్రక్కనే ఎవరో శత్రువు ఉన్నాడు' అనుకున్నాడు. ఆ రాత్రంతా ఫూల్కాకు నిద్రపట్టలేదు.

...ఇది ఇలాఉండగా, లింగ్టాన్ తనస్వగృహంలో తనకుమారులతోకలసి ఫూల్కాతల్లికోసం శవపేటిక తయారు చేశాడు. ఈరోజుల్లో శవపేటికలు తయారుగావించే వడ్రింగులకు అహర్నిశలూ తీరికచిక్కడంలేదు. కాబట్టి అలాంటి వడ్రంగులు దొరకడం ఎంతోకష్టంగాఉన్నది శవపేటికలు తయారుచేసే వడ్రింగులలో కొందరు యుద్ధపురోజులు తమ వర్తకానికి లాభదాయకమని గ్రహించి ముందుగానే కొన్ని శవపేటికలు తయారుచేసిఉంచారు. కాని అలా ముందుగా తయారుచేసిఉంచిన శవపేటికలుకూడా మృతజీవులకు సరిపోలేదు కొందరిశవాలు శవపేటికలు లేకుండానే పూడ్చిపెట్టబడ్డాయి. శత్రువులు గుంటలుతీసి శవాలను ఆ గుంటలలో తోసేశారు. నక్కలు, కుక్కలు మళ్ళీ వాటిని బైటికిపీకేశాయి.

అది చలికాలంకావడంవల్ల సరిపోయింది. లేకపోతే ఆ దుర్వాసనకు నగరంలో ఒక్కపురుగుకూడాబ్రతకగలిగేదికాదు.

లింగ్‌టాన్, వంగ్రడంగికోసం వెదకడం నిష్ఫలమని గ్రహించాడు. అందుచేత అతనూ, అతని కొడుకులూ కలిసి పాతబల్లలు విరగగొట్టి శవపేటిక తయారుచేశారు. తరువాత ఎంతోశ్రమతో బరువైన ఆ వృద్ధురాలిదేహాన్ని అందులో ఉంచారు. ఆ పేటికను తీసుకువెళ్ళి పొలంలో పూడ్చిపెట్టి అక్కడ ఒకచిన్న మట్టిదిబ్బ ఉంచారు.

వ్రాలిన్ తిరిగివచ్చినప్పుడు అతనికి చూపడానికి ఆమెను పూడ్చిపెట్టినతరువాత మళ్ళీ ఇంటికివెళ్ళి శిథిలమైనగృహాన్ని సవరించి చక్కబెట్ట నారంభించారు. ఆ గ్రామంలో ప్రతి గృహానికీ ఇదేగతిపట్టింది. ప్రతిగృహాన్ని శత్రువులు శిథిలం చేశారు. లింగ్‌టాన్ మూడవజ్ఞాతిగృహాన్నిమాత్రం శత్రువులు ధ్వంసంచేశారు. శత్రువులు ధ్వంసంచెయ్యడానికికూడా వెనుదీసినంత పేదఇల్లుఅది. శత్రువులు వచ్చినప్పుడు ఆ జ్ఞాతి, అతనిభార్య వెళ్ళి పొలంలో గాదెలో దాక్కున్నారు.

లింగ్‌టాన్ సంసారం నగరంలోనే ఉన్నారు. లింగ్‌టాన్ లింగ్‌సాకు ఏమైనా పంపుతూండేవాడు. నల్లకోడి కొన్ని గుడ్లు పెట్టింది. లింగ్‌టాన్ వాటిని ఒకచేతిరుమాలులో కట్టి, లింగ్‌సాకు పంపించాడు. కొలనులో ఒకకొత్తచేపనుపట్టి, తామరాకులోపెట్టి, ఆ చేపను, కాబేజీగడ్డలుపంపించాడు. పంపిస్తూ ఇలాచెప్పాడు: ఇల్లుశుభ్రంచేశామనీ, వ్రాలిన్ తల్లికి మాఅంతట మేమే శవపేటికచేసి ఆమెను సమాధిచేశామని చెప్పండి'

లింగ్‌సావియోగం లింగ్‌టాన్‌ను ఎంతోకుంగదీసింది. ఇదివరకు ఎన్నడూఎరుగనంత అధికంగా అతను వియోగాన్ని అనుభవించాడు. తనలో ఒకభాగం తనకుదూరంగాఉన్నట్టు

భావించాడు. ఆమె లేనిసమయాల్లో అతనికి పురుషసాధారణ మైన ప్రకోపంకూడా లేకపోవడంచూచి అతనికి ఆశ్చర్యం కలిగింది.

ఒకరోజు తన కుమారుణ్ణిపిలిచి ఇలా అడిగాడు-

'నీకు నీభార్య దగ్గర లేకపోవడం బాధగాఉన్నదా?' అని. ఈప్రశ్నకు పెద్దకుమారుడు ఆశ్చర్యపడి, 'లేదు. నాభార్య దాపులోలేనప్పుడు నాకు కామవాంఛ కలుగక పోవడం ఆశ్చర్యకరమే. కాని నేను నిగ్రహించుకోగలను. స్త్రీలనుగురించి మనం ఎన్నో జుగుప్సాకరమైనగాథలువిన్నాం; చూచాం. ఈ దురంతాలతరువాత నాలో ఒకవిధమైన విముఖత ఏర్పడింది. స్వచ్ఛమైన హృదయంగల ప్రతిపురుషునికి ఇలాగే సంభవిస్తుందనుకుంటాను' అన్నాడు.

లింగ్‌టాన్ తనకుమారుడు చెప్పిన విషయాన్ని గురించి ఆలోచించసాగాడు. ఆలోచించేకొద్దీ ఆ విషయంలో ఎంతో సత్యంఉన్నట్టు గోచరించసాగింది. దీనినిబట్టి తనకు పరిచితులైన వ్యక్తులలో రెండురకాల మనుష్యులు ఉన్నారను కున్నాడు. ఒకరకం తన పెద్దకొడుకులాంటివారు, తనలాంటి వారు. మరోరకం దురంతాలనుచూచిన ఫలితంగా మరింత దుర్మార్గాలకు ఒడిగట్టేవారు.

రోజులు గడిచేకొద్దీ నగరం ప్రశాంతి వహించడం మొదలెట్టింది. దీనికి కారణం ప్రపంచంలో అన్ని మూలల నుంచి ఈ దురంతాలను నిరసిస్తూ గొప్పప్రతిఘటన వచ్చింది. ఈపృథ్విలో మానవుడు పుట్టిననాటినుంచి ఇంత భయంకర మైన దురాగతాలు ఎన్నడూ జరుగలేదని, శత్రువులు చేసిన

పనులు శత్రుదేశపరిపాలకులకే తలవంపులుగా ఉన్నాయని పెద్ద అలజడి ఏర్పడింది. తరువాత శత్రువులు నగరంనుంచి గ్రామాలకు రాసాగారు. ఒకరోజున లింగ్‌టాన్ తనఇంటి ముంగిట నలుగురు శత్రుసైనికులు ఉండడం చూశాడు. సాయంత్రం భోజనానికై అతను బియ్యం కడుగుతున్నాడు. కొడుకులు ఇంట్లో మగ్గంవద్దకూచునిఉన్నారు. ఆ ఇంట్లో ధ్వంసంకానివస్తువు ఆ మగ్గం ఒక్కటే.

లింగ్‌టాన్ బియ్యంబుట్ట క్రిందపెట్టి వాకిట్లోకి వెళ్ళాడు. అతనుఇంట్లోలేనట్లు నటించడం అంతక్షేమంకాదు. ఎందుచేత నంటే, అలా నటించినపక్షంలో మళ్ళీఅతనిగృహం ధ్వంసం చెయ్యబడుతుంది. అతను తలుపులు తెరవగానే ఆ సైనికులు ఏదోఅరిచారు. వారు భోజనం అడుగుతున్నారేమో అను కున్నాడు లింగ్‌టాన్. తన బియ్యంబుట్టచూపించి వారికికావల సింది అదేనేమోనని అడిగాడు. వారుఇంకాపెద్దగా ఏవోమాట లను అరిచారు. వారికి కావలసింది స్త్రీలని గ్రహించాడు లింగ్‌టాన్.

ఈ సమయంలో ఇంట్లో స్త్రీలెవరూ లేనందుకు తన తాతముత్తాలకు కృతజ్ఞతాభివందనాలు చెప్పుకుని 'నాఇంట్లో స్త్రీలు లేరు' అన్నాడు లింగ్‌టాన్. వారికేమీ అర్థంకాలేదు. అతన్ని ఒకపక్కకుతోసేసి ఇంట్లోకి వెళ్ళి, ఇల్లు నలుమూలలా వెదికారు. ఎక్కడా ఒక్క స్త్రీజాడకూడా కనుపించలేదు. ఒకమూల ఒకస్త్రీబట్టలు కనుపించాయి. ఆ బట్టలుచూడగానే వారు కోపోద్రేకంతో ఏదో అరిచారు.

'స్త్రీలు లేకపోతే నన్నేం చెయ్యమంటారు? మీలో ఒకరిని స్త్రీనిగా మార్చడానికి నేనేం ఈశ్వరుణ్ణా?' అన్నాడు లింగ్‌టాన్.

సంజంగా స్త్రీలు లేకపోవడం చూచేసరికి ఆ సైనికుల కామ ప్రకోపం పెద్దగాలివానలా వీవజొచ్చింది. లింగ్‌టాన్ తన జీవితంలో ఎన్నడైనా చూడగలనని కలకూడా కనలేనంత భీకరమైన విషయాన్ని చూచారు ఆ సైనికులు, ఎంతో అందంగా కనుపిస్తున్న అతని చిన్నకొడుకును తీసుకుని వెళ్ళి స్త్రీని ఉపయోగించినట్లు ఉపయోగించారు. లింగ్‌టాన్, అతని పెద్దకొడుకు ఈ భీకరదృశ్యాన్ని చూడలేకపోయారు. సైనికులను తిట్టేరు. కాని నిరాయుధులైనవారు ఏం చెయ్యగలుగుతారు? ఆ నలుగురు సైనికులు తండ్రినీ, కొడుకును త్రాళ్ళతో కట్టివేసి తమపని ముగించుకున్నారు చిన్నకుర్రవాడు శవంలాగ నేలమీదికి ఒరిగిపోయాడు. సైనికులు నవ్వుతూ వెళ్ళిపోయారు.

లింగ్‌టాన్, అతని కొడుకులు ఒక్కమాటకూడా మాట్లాడలేదు. నెమ్మదిగా ఎంతో ప్రయత్నంమీద కట్లు విడిపించుకున్నారు. లింగ్‌టాన్ తన చిన్నకొడుకును స్నానం చేయించి బట్టలుతొడిగి నెమ్మదిగా కూచోబెట్టాడు. ఆ కుర్రవాడు చనిపోలేదు. శిలలా నిశ్చలంగా ఉన్నాడు. అతని హృదయం మరణించినట్టుంది. తండ్రి వాడికి పిచ్చెత్తిందేమో అనుకున్నాడు.

'ఎలా ఉంది బాబూ!' అని అడిగాడు తండ్రి.

'చనిపోతే బావుండేది' అన్నాడు చిన్నకొడుకు మెల్లగా.

'నువు చావు కోరుకోకూడదు నాయనా. అది మన పూర్వులకు మనం ద్రోహం చేసినట్టవుతుంది. నువ్వు ఇంకా బ్రతికిఉండడం ఈశ్వరేచ్ఛ అన్నమాట' అన్నాడు లింగ్‌టాన్.

కాని అతనిమాటలు కుర్రివాడికి వినిపించినట్టులేదు. అతని నెత్తురంతా విరిగిపోయినట్టయింది. ఒళ్ళు పాలి పచ్చ బారింది. అతని నల్లనికళ్ళు మృతుని నేత్రాల్లాగా ఉన్నాయి.

'నే నిక్కడ ఉండలేను. ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అన్నాడు చిన్నకుర్రాడు.

'నువు ఇక్కడ ఉండొద్దులే. నేను గోడలో కొంతడబ్బు దాచిఉంచాను ఆ డబ్బు తీసుకుని నీ ఇష్టంవచ్చినచోటుకు వెళ్ళు. నీ రెండో అన్న, జేడ్ ఎక్కడున్నారో తెలిస్తే ఎంత బావుండేది!' అన్నాడు లింగ్‌టాన్. తనకొడుకు ఎర్రని నేత్రాలు చూచి లింగ్‌టాన్‌కు భయమేసింది. వాడు కొండల్లోకివెళ్ళి దొంగలగుంపులో చేరుతాడేమో ననుకున్నాడు.

'నాయనా' నువు కొండల్లోకివెడితే మనప్రజలనే దోచుకునే దొంగలగుంపులో చేరకు. శత్రువుతో పోరాడే కొండగుంపులోనే చేరు' అన్నాడు.

కుర్రవాడు సమాధానం చెప్పలేదు. తండ్రి వాడికి కోటువేశాడు. డబ్బు వాడి నడుముకట్టులో ఉంచాడు. వాడు వణుకుతూన్నకాళ్ళతో లేచాడు.

'నువ్వెలా నడవగలవు బాబూ' అన్నాడు లింగ్‌టాన్ భయంతో.

'నేను నడవగలను' అన్నాడు కుర్రవాడు.

'ఎక్కడున్నావో ఎలాగైనా కబురు పంపించు బాబూ' అన్నాడు లింగ్‌టాన్.

'తప్పకుండా కబురుపంపుతాను' అన్నాడు కొడుకు. అతనికాళ్లు తీవ్రంగా వణికిపోసాగాయి 'నాన్నా! నాన్నా! అంటూ తండ్రిబుజాలుపట్టుకున్నాడు. అతనిపెదవులు అదరసాగాయి. అతను ఎంతో శ్రమతో దుఃఖాన్ని దిగమ్రింగుకోవడం లింగ్‌టాన్ చూచాడు. అతను కొడుకునడుముచుట్టూ చేతులు వేసి, 'ఈ రాత్రికి విశ్రాంతితీసుకో బాబూ. వేడిఅన్నం వండిపెడతాను రేపు వెళ్ళొచ్చు' అన్నాడు లింగ్‌టాన్.

'నాకు విశ్రాంతి అక్కర్లేదు. నేను వెళ్ళాలి' అన్నాడు కుర్రాడు. కుర్రాడు ద్వారంవద్దకు వెళ్ళాడు. చీకటిపడింది. వెన్నెల పల్చగా వెలుగుతోంది. నక్షత్రాలు ఈనగా అప్పుడప్పుడే మొలుచుకొస్తున్నాయి. రాత్రి పరిశు[illegible]గా చల్లగా ఉంది. కుర్రవాడు మెల్లగా నడిచిపోయాడు. వెనుదిరిగి చూడలేదు. కొండలవేపుకు వెళ్ళిపోయాడు. లింగ్‌టాన్, అతని పెద్దకుమారుడు కనుచూపుమేరవరకు అతన్నిచూస్తూ నిల్చున్నారు. ఆ కుర్రాడు చూపుదాటిపోయాడు

'ఇంతకన్న ఏంఘోరం జరగాలి' అన్నాడు లింగ్‌టాన్.

కొడుకు సమాధానం చెప్పలేదు. పైన ఆకాశం ప్రశాంతంగా ప్రకాశిస్తోంది. శాంతిసమయాలలో కూడ ఆకాశం ఇంత అందంగా ఎన్నడూ లేదు.

'ఆ ఆకాశం ! ఏ మానవుడూ దాన్ని మార్చలేడను 'కుంటాను' అన్నాడు లింగ్‌టాన్.

లింగ్‌టాన్ ఆకాశంవంక చూచాడు. తండ్రికి మన స్థిమితం తప్పిందని భయపడ్డాడు లాయ్‌టా. 'లోపలికి రా నాన్నా. బయట మరీ చల్లగాఉంది' అన్నాడు. లింగ్‌టాన్‌ను లోపలికి తీసుకువెళ్ళి, తలుపుమూశాడు.

'నేను అన్నంవండుతాను, తింటావా?' అని అడిగాడు తండ్రిని.

'ఇక జీవితంలో ఎన్నడూ అన్నం ముట్టగూడదనిపిస్తోంది' అన్నాడు లింగ్‌టాన్.

'నాకూ అలాగే అనిపిస్తోంది' అన్నాడు కొడుకు.

ఎవరిగదుల్లోకివారు వెళ్ళిపడుకున్నారు. కాని ఎవరికీ నిద్రపట్టలేదు. కొద్దిసేపటికి లింగ్‌టాన్‌లేచి తనకొడుకు గది లోకి వెళ్ళాడు.

'కళ్ళుమూస్తే అదేదృశ్యం జ్ఞాపకంవస్తోంది. ఒంటరిగా ఉండలేను' అన్నాడు లింగ్‌టాన్.

'నాప్రక్కన పడుకో నాన్నా' అన్నాడు లాయ్‌టా.

తండ్రివచ్చి కొడుకుప్రక్కన పడుకున్నాడు. రాత్రి బరువైన బండిలా కదులుతోంది. ఎందరో స్త్రీపురుషులతో పిల్లలతో కలకలలాడుతూఉండే ఆ ఇంట్లో ఆ ఇద్దరే ఏకాంతంగా పడుకున్నారు. కాని వారికి నిద్రపట్టలేదు. వారిమనస్సులు ఆ రాత్రి కొండలవైపుకు కుంటుకుంటూపోతున్న ఆ కుర్రవాణ్ణి అనుసరించాయి.

నగరంలో సురక్షితంగా ఉండాలంటే, శత్రువులవద్ద నుంచి రక్షణతీసుకోవడం అవసరమనే నిశ్చయానికివచ్చాడు వ్రూలిన్. ఒకటి రెండు ఉత్పాతకరమైనరోజులు గడిచిన తరువాత వ్రూలిన్‌కు బైటికి రావడమంటే భయంపుట్టింది. అతనిదుకాణానికివచ్చి అతనితో ఎంతో మర్యాదగా మాట్లాడి పోయినఆఫీసరును కలుసుకుని, తనకష్టాలన్నీ చెప్పుకుని, తను హృదయంలో ఎన్నడూ ద్రోహికాదనీ, సంసారభారంగల వర్తకుణ్ణనీ చెప్పుకుని అతనిసహాయం పొందుదామనుకున్నాడు.

అందుచేత పూర్తిగా చీకటిపడేవరకూ వేచిఉండి, తన పాతబట్టలు తగిలించుకుని, దీపంకూడాతీసుకోకుండా, ఆ ఆఫీసర్ ఉన్నచోటుకు వెళ్ళి తలుపుతట్టాడు. ఒక సోల్జర్‌వచ్చి తలుపు తెరిచాడు. ఆ సోల్జర్‌ను చూడగానే వ్రూలిన్‌కాళ్లు వణకసాగాయి. వెంటనే ఆఫీసర్ తనకిచ్చిన కాగితం చూపాడు. సోల్జర్ అతన్ని లోపలికిలాగి కూర్చోమనిచెప్పి లోపలికి వెళ్లాడు.

చూడగానే వ్రూలిన్ ఆ ఇంటిని గుర్తించాడు. ఆ ఇల్లు ఆ నగరంలోని ఒక పెద్ద శ్రీమంతునిది. ఈ యుద్ధసమయంలో అతను పారిపోయాడు. పూర్వం ఒకమాటు ఆ ఇంట్లో స్త్రీలు, పిల్లల ఆటవస్తువులకోసం వ్రూలిన్‌కు కబురుపంపారు. ఆ రోజుల్లో ఆ ఇల్లు ఎంతో కళకళలాడుతూ ఉండేది. ఇంటినిండా పిల్లలూ, ఆడంగులూ కిక్కిరిసి ఉండేవారు. తోటలో ఎప్పుడూ వినోద - విలాసాలు, ఉత్సవాలూ సాగుతూండేవి.

ఒకమాటు ఆ తోటలో బొమ్మలాట ఏర్పరిచారు. అందరితో పాటు తనూ చూచాడు ఆ ఆట.

ఇప్పుడు ఆ తోటంతా వాడిపోయింది. ఇల్లు నిశ్శబ్దంగా సమాధిలాఉంది. సోల్జర్ తిరిగివచ్చి పూలిన్‌ను తనతోపాటు రమ్మన్నాడు. పూలిన్ అతని వెనకాలె హాలులోకివెళ్ళాడు. నలుగురు ఆఫీసర్లు కూచుని తాగుతున్నారు. అందరూ అతని వంక అదోవిధంగా చూచారు. ఇక్కడికి రాకపోతే ఎంతో బావుండేది అనుకున్నాడు పూలిన్. తాగుతున్న సమయంలో రావడం అంత మంచిదికాదనుకున్నాడు. అయినా ఎలాగో ఒకలా ధైర్యంపుంజుకుని, 'అయ్యా ఒక చిన్న పనిమీద వచ్చాను. తమరు అనుమతిస్తే...'అన్నాడు. 'చెప్పు'అన్నాడు ఆఫీసరు. కాని అతన్ని కూచోమనలేదు. ఊలిన్ వారు తనను ఒక సేవకుణ్ణిచూచినట్టు చూడడం గ్రహించాడు. కాని అతను లోకజ్ఞానం ఉన్నవాడుకాబట్టి అభిమానానికి అది సమయం కాదనుకుని, పొంగివచ్చిన అభిమానాన్ని వెంటనే దిగమ్రింగి 'అయ్యా! నేను ఈ నగరపౌరుల్లో ఒకణ్ణి. తమరు ఒకమాటు నా దుకాణానికి వచ్చారు.ఎంతోకాలం మీ ప్రాచ్య సముద్రదేశవస్తువులతో నేను వాణిజ్యంచేశాను. నేను కోరే దల్లా, నా వ్యాపారం కొనసాగడంకోసమై శాంతిఒక్కటే. వ్యాపారం స్థిమితంగా సాగితే, నాకు పరిపాలకులు ఎవరున్నా ఒకటే. నేను మీరంతుణ కోరుతున్నాను' అన్నాడు.

ఈ మాటలు విన్న తరువాత ఆఫీసర్లు వారిలో వారు కొంచెంసేపు మాట్లాడుకున్నారు.

తరువాత ఒక ఆఫీసరు 'నువ్వు కోరినపక్షంలో, నీవు మాకు ఉపయోగపడగలవు' అన్నాడు.

'నేను మీకు ఉపయోగపడలేనా?' అన్నాడు ఊలిన్.

'మేము ఇక్కడ ఒక ప్రజాప్రభుత్వాన్ని స్థాపిస్తున్నాం మాకోసం పరిపాలించేవారి ప్రభుత్వం అది. నువ్వు ఏం చెయ్యగలవో చెప్పు' అన్నాడు ఆఫీసరు.

'అయ్యో! నేను సామాన్యశక్తిసామర్థ్యాలుఉన్న వాణ్ణి' అన్నాడు ఊలిన్.

వెంటనే ఆఫీసరు అతన్ని ఆపి, 'నీకు వ్రాయడం చదవడం వచ్చునా?' అన్నాడు.

'తప్పకుండా' అన్నాడు ఊలిన్ గర్వంతో 'జమాఖర్చులవిషయం పూర్తిగావచ్చు వ్యాపారస్థుడు చెయ్యగల పనులన్నీ చెయ్యగలను. నాతండ్రిలాగానే నేనూ కాన్ఫ్యూషియన్ గ్రంథాలుచదివాను' అన్నాడు ఊలిన్.

'వాటివల్ల మాకు ఉపయోగం లేదు నీకు ఇంగ్లీషువచ్చా?'

'అయ్యో! రాదే. స్వభాషతప్ప పరభాషలు చదవడం అవసరమని నేను గ్రహించలేకపోయాను.' అన్నాడు ఊలిన్.

'నీ భాషైనా త్వరత్వరగా వ్రాయగలవా?'

'మీరు గర్వం అనుకోకుండాఉంటే ఎంతో శీఘ్రంగా వ్రాస్తాను.'

మళ్ళీ ఆఫీసర్లు వారిలోవారు ఏదోమాట్లాడుకున్నారు.

తరువాత అతనితో పరిచయముండున్న ఆఫీసరు, 'నీవు తక్షణం ఈ ఇంట్లోకివచ్చెయ్. నీ శక్తి సామర్థ్యాలనుబట్టి

నీ జీతం నిర్ణయింపబడుతుంది. నీకు బిరుదుకూడా యివ్వబడు తుంది. రేపే ఇక్కడికి వచ్చెయ్' అన్నాడు.

ఈ మాటలు వినేసరికి ఊలిన్ తల తిరిగిపోసాగింది. అతని తలలో పక్షులు సున్నాలుగా తిరుగుతున్నట్టనిపించింది.

'కాని నేను సంసారంగలవాణ్ణి; భార్య, ముసలితల్లి, ఇద్దరు పిల్లలు ఉన్నా'రన్నాడు ఊలిన్.

'వాళ్ళనుకూడా ఇక్కడికి తీసుకురా. ఇక్కడైతే వాళ్లు క్షేమంగాఉంటారు. వారికోసం గదులుకూడా ఇస్తాం'

ఎడారిలో నడుస్తున్నవానికి మంచినీటికొలను కనుపించి నట్లయింది ఊలిన్‌కు. ఎవరికీ భద్రితలేనినగరంలో తనకు భద్రితదొరకడం, అందరూ ఆకలితో చస్తూంటే తనకు జీతం లభించడం, అందరూ శత్రువుతుపాకిగుండ్లకు ఆహుతిఅయినా తను సురక్షితంగాఉండడం, ఇదంతా పూర్వజన్మ సుకృతమని పించింది ఊలిన్‌కు.

'నా సామానులు తీసుకువస్తాను. కొద్ది సామాన్లేలెండి. చాలా సామానులు ధ్వంసమైపోయాయి' అన్నాడు ఊలిన్.

ఆఫీసర్లు మళ్ళీ మాట్లాడుకున్నారు. ఆఫీసరు, 'నువు తక్షణం రావచ్చు' అన్నాడు.

'రేపు పిల్లలనూ వారితల్లిని తీసుకువస్తాను' అన్నాడు ఊలిన్. ఆఫీసర్ చిన్నచిరునవ్వునవ్వి 'తప్పకుండా' అన్నాడు.

తరువాత, 'మమ్మల్ని ప్రతిఘటించనివారిపట్ల మేమెంత దయాపూరితంగా ఉంటామో చూచావా?' అన్నాడు- 'మేము శాంతిని, అందరి మంచినీ మాత్రమే వాంఛిసాము

మాకు సహాయంచేసేవారు ఎప్పుడూ గొప్ప ప్రతిఫలం పొందుతారు.'

'అవునండీ!' అన్నాడు ఊలిన్. మూడుసార్లు వంగి నమస్కరించి వెళ్ళిపోయాడు. వాకిట్లో సోల్జర్‌కు ఒక వెండి నాణెం ఇచ్చాడు.

ఆ రాత్రింతా సామాన్లు సర్దుకోవడం మొదలెట్టాడు. తెల్లవారగానే వెళ్ళి రిక్షాతీసుకొచ్చి, రిక్షాలో సామాన్లన్నీ పెట్టాడు. సామాన్లపై తనుకూచుని శత్రుగృహానికి వెళ్ళాడు.

ఆ మరునాడు చక్కనిబట్టలు వేసుకుని, ఇద్దరు శత్రు సైనికుల రక్షణతో తనభార్య ఉన్నచోటుకు వెళ్ళినప్పుడు ఊలిన్ ఆనందానికి మేరలేదు. కారులో వెడదామను కున్నాడు కాని, ఒక పాత గుర్రపుబగ్గీలో వెళ్ళాడు. గుర్రపు బగ్గీ ఆ ద్వారంవద్ద ఆగగానే ఎంతోశీఘ్రిగా తాను బండిలోనే కూచుని డ్రైవర్‌తో 'దిగు ద్వారంవద్దకువెళ్ళి ఊలిన్ తన సంసారంకోసం వచ్చాడనిచెప్పు'అన్నాడు. కాని ఆ గుర్రపు బగ్గీనతోలేవాడు, 'నేను గుర్రాన్ని వదిలివెళ్ళితే ఇది కూచుం టుంది'అన్నాడు.

వూలిన్ మరి చేసేదిలేక తనే దిగి ద్వారందగ్గరకుపోయి చిన్నతలుపు తెరచి, 'నేను ఊలిన్‌ను. నాకుటుంబంకోసం వచ్చాను'అన్నాడు. ఆ గేటుదగ్గర ఉన్నమనిషి ఊలిన్‌ను లోప లికి రానిచ్చాడుకాని, సైనికులను లోనికి రానీయలేదు. వారు తుపాకులతో తలుపుగుద్దడం ప్రారంభించారు. ఆ గేటుకాపలా దారు ఊలిన్‌ను, 'మీరెవరు?'అని అడిగాడు.

'నేను వర్తకుణ్ణి. వీరు నా రక్షణకోసం పంపించబడ్డారు' అన్నాడు ఊలిన్.

కాపలాదారు నవ్వాడు.

'వారు ఎలాంటి అపకారం చెయ్యరని నేను గ్యారంటీ ఇవ్వగలను' అని చెప్పాడు ఊలిన్.

'నేను తెల్లదొరసానిని అడగనిదే వారిని ప్రవేశపెట్ట లేను' అన్నాడు కాపలాదారు.

అందుచేత ఊలిన్ తెల్లదొరసాని వచ్చేవరకూ వేచి ఉండవలసివచ్చింది. ఊలిన్ జరిగిన వివరమంతా ఆమెకు చెప్పాడు. ఆ తెల్లదొరసాని విదేశాలయాల్లోనిశిలావిగ్రహంలా చల్లగా ప్రశాంతంగా ఉంది. ఆమె ఊలిన్ చెప్పినమాటలన్నీ విన్నతరువాత, 'నీవు దేశద్రోహివా?' అన్నది.

ఊలిన్ భయంభయంగా, 'నేను దేశద్రోహిని అవునో కాదో నా కెలా తెలుస్తుంది? నాదృష్టిలో నే నొక సామాన్య మైన వర్తకుణ్ణి; అంతే. పైగా నాకు నేను పోషించుకోవలసిన సంసారం ఉన్నది' అన్నాడు.

ఆమె తన ప్రశాంతమైన కంఠస్వరంతో, 'నగరంలో ఎంత ధ్వంసం జరిగిందో నీవు చూడలేదా?' అన్నది.

ఊలిను, "జరిగినమాట వాస్తవమే కాని, గతాన్ని మరిచిపోవడం ఎందుకైనా మంచిది అప్పుడు మనకు శాంతి ఏర్పడుతుంది' అన్నాడు.

తరువాత ఆమె 'నీవు దేశద్రోహివి. నీవు నీసంసారాన్ని ఎంతత్వరలో తీసుకుపోతే అంతమంచిది' అన్నది. తరువాత కాపలాదారుని ద్వారం తెరిచి రక్షణకై వచ్చిన సోల్జర్లను లోనికి

రానివ్వమన్నది. కాపలాదారు అయిష్టంతో నే ద్వారం తెరిచాడు. సోల్జర్లు ఆలస్యంచేసినందుకు కోపంతో లోపలికి తోసుకొచ్చారు. కాని నిశ్చలంగాఉన్న ఆ దొరసానిని చూచేసరికి ఆగిపోయారు.

ఆమె వారితో పసిపిల్లలతో చెప్పినట్లు, 'ప్రశాంతంగా ఉండండి. ఉన్నచోటునేఉండి జాగ్రత్తగా ప్రవర్తించండి' అని చెప్పింది.

ఆమె మాట్లాడుతూంటే ఊలిన్ వణికిపోసాగాడు. సోల్జర్లు ఆమెముందు మేకపిల్లల్లాగా స్తబ్దంగా నిల్చున్నారు. తరువాత ఆమె ఊలిన్ వేపు తిరిగి 'నిన్ను వీళ్ళతో కలిసి ఇంతకన్న ఎక్కువదూరం రానివ్వడానికి వీలుండదు. కాబట్టి నేనే లోనికివెళ్ళి నీ ఆలు - బిడ్డలను తీసుకొస్తాను'అని లోపలికి వెళ్ళింది. ఆమె గడ్డిమైదానంలో నడిచిపోవడం చూస్తూ నిల్చున్నాడు ఊలిన్. అతనికి, ఈ ఆలస్యానికంతా తనే కారణమనుకుని సోల్జర్లు తనను గల్లంతు చేస్తారేమోనని భయం కలుగసాగింది. కొద్దినిమిషాల్లో తనభార్య, బిడ్డలు, లింగ్‌సా రావడం చూచాడు. ఆర్చిడ్ కూడా వచ్చేదే కాని, ఆర్చిడ్ ఇంకా చిన్నది, అందగత్తె. ఆమె సోల్జర్ల కంటపడడం ఇష్టంలేక తెల్లదొరసాని ఆమెను తీసుకురాలేదు.

లింగ్‌సాను చూడగానే ఊలిను అభివాదం చేశాడు. ఆమెకూడా అభివాదం తెలిపింది. ఊలిను ప్రక్కనున్న సోల్జర్లనుచూచి ఆమె ఆశ్చర్యపడింది. ఏవో అనబోయింది. కాని మళ్ళీ నిగ్రహించుకున్నది.

'మా ముసలాయన క్షేమసమాచారాలు ఏమన్నా తెలిశాయా?' అని అడిగింది లింగసా.

'లేదు. మీ క్షేమసమాచారంకూడా ఈనాటివరకూ నాకు తెలీలేదు.'

'నేను ఆరాత్రే వచ్చాను. నీకో దుర్వార్త చెప్ప బోతున్నాను. ఆ వార్త వినడానికి నువు సిద్ధంగా ఉండాలి. నీ ముసలితల్లి బ్రతికిలేదు. మా ఇంట్లోకి శత్రువులు వచ్చి నప్పుడు ఒక దూలంక్రిందపడి ఆమె చనిపోయింది. తరువాత నాభర్త, కొడుకులు కలిసి ఆమెను పూడ్చిపెట్టారు' అన్నది లింగ్‌సా. భర్తముందు మళ్లీకొత్తగా ఏడవడం ఆచారం కాబట్టి ఊలినుభార్య కళ్ళకు చెయ్యి అడ్డంపెట్టుకుని విలపించ సాగింది. ఊలినుకూడా కాస్సేపు విలపించి, కళ్ళనీళ్ళు తుడుచు కున్నాడు. కాని ఈ దృశ్యమంతా సోల్జర్లకు విసుకు కలిగించింది. తిరిగి వెళ్ళవలసిన సమయమైనదని సూచనగా తుపాకీమడమ లతో ఊలినుని నడుముపై పొడిచారు. ఏడుపును వాయిదా వెయ్యమన్నారు. ఊలిను తన భార్యా-పిల్లలతో వెళుతూంటే లింగ్‌సా పెద్దగా ఏడవసాగింది. ద్వారంవరకూవచ్చి, 'మా అమ్మాయిని ఇప్పుడు నీతో తీసుకెళ్ళడం ప్రమాదకరం కాదూ?' అన్నది.

ఊలిను తనసంసారాన్ని బండిలో ఎక్కించి, 'నాకు రక్షణఉంది. కాబట్టి ఏమీ భయములేదు' అన్నాడు.

బండి త్వరత్వరగా వెళ్ళిపోయింది. లింగ్‌సా ఒక్కతే మిగిలిపోయింది. తెల్లదొరసానిముందు లింగ్‌సాకు భయంగా ఉండేది. ఆమె లింగ్‌సావంక చూచి, 'నీకోసం ఎంతో విచా

రిస్తున్నాను' అని వెళ్ళిపోయింది. లింగ్‌సా, కాపలాదారు మిగిలిపోయారు.

'కష్టాలపాలయినవారు ఎందరో ఉండగా ఈమె నన్నేందుకు జాలితలుస్తోంది?' అని అడిగింది కాపలాదారును.

'నీఅల్లుడు దేశద్రోహిగామారి శత్రువుల పెంపుడు కుక్కగా తయారయ్యాడుగా' అన్నాడు కాపలాదారు.

'అందువల్లనా చక్కనిదుస్తులతో ముస్తాబై వచ్చాడు' అన్నది లింగ్‌సా. ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తూ లోపలికి వెళ్ళింది. వానకురిసి వెలిసింది. బైటంతా చలిగాఉంది. ఆమె హాల్లో అడుగుపెట్టేసరికి హాయిగా ఉన్నట్లనిపించింది. జరిగినదంతా ఆర్చిడ్‌కు చెప్పింది.

'మళ్ళీ నామునలాణ్ణి చూస్తేకాని, నాకు అన్నం సయించదు' అన్నది. ఆమె ఎప్పుడూ తన ఇంటినిగురించే ఆలోచిస్తూ కూచునేది.

కొద్దిరోజులకు పెద్దకూతురు దగ్గరనుంచి జాబువచ్చింది. తన కొత్తగదులనుగురించి ఎంతోగర్వంగా వ్రాసింది. ఆ ఉత్తరంలో తనభర్త ఎంతో గౌరవపదవి పొందాడని వ్రాసింది. తరువాత లింగ్‌సా 'నామటుకు నేను, మనంఅనుకున్నదానికంటె ఈశత్రువులు ఎంతో మంచివారనుకుంటున్నాను. నాకూతురుతోను, ఆమె భర్తతోను చాల మర్యాదగా ప్రవర్తించారు' అన్నది. కూతురువ్రాసిన ఉత్తరాలు స్వయంగా చదవలేకపోవడంవల్ల ఒక ముసలి క్రైస్తవకన్యను చదివిపెట్టమని అడిగేది. ఆ కన్య చదివి వినిపించేది. లింగ్‌సా జాబులోని ప్రతి అక్షరాన్ని నమ్మేది. ఆమెఉద్దేశంలో వ్రాసినవిషయాల్లో

అసత్యాలుండవని. 'నే నీ ఉత్తరంలోని విషయాలను అంతగా విశ్వసించను. ఇప్పటికీ నగరవీధుల్లో ఎన్నో దురాగతాలు జరుగుతూనే ఉండడం నేను వింటున్నాను' అనేది ఆ కన్య. 'ఎందరో స్త్రీలకు మానభంగాలుకావడం వింటున్నాను' అనేది ఆ వృద్ధ క్రైస్తవకన్య. ఈమాట అన్నపుడల్లా లింగ్‌సా నవ్వేది. కన్యకు ఆవిషయం ఎలా తెలుస్తుందా అనుకునేది. లింగ్‌సా ఆమెను, 'నువ్వు కన్యవా ఏమిటమ్మా?' అని అడిగేది.

'నాకు ఎన్నో పెద్దపెద్ద వివాహసంబంధాలు వచ్చాయి. కాని, విజ్ఞానసముపార్జనకోసం నాజీవితాన్ని అంకితంచేశాను' అన్నది ఆ కన్య.

'నాకూ ఒక కోడలున్నది. ఆ అమ్మాయికూడా చదువుకోడానికి వెళ్ళింది. కాని ఆ అమ్మాయికి శిశువు కలుగబోతున్నాడు' అన్నది లింగ్‌సా. లింగ్‌సాచెప్పిన ఈ మాటలకు ఆ కన్య ఎంతో అనాసక్తంగా, 'ఓహో, అలాగా!' అనేది. తరువాత లింగ్‌సా వెళ్ళి, జాబులోని విషయాలన్నీ ఆర్చిడ్‌కూ, చిన్నకూతురుకూ చెప్పేది. వారికికూడా ఎప్పుడిక్కడినుంచి వెళ్ళిపోదామా అనిపించేది. ఈ ఇంట్లో ఉండీఉండీ వారికి విసుకెత్తిపోయింది. ఈ ఇంట్లోవున్న ప్రశాంతి వారికెంతో బరువుగా తోచింది. పగలుకాని రాత్రికాని ఆ విశాలభవనంలో చీమ చిటుక్కుమన్న శబ్దంకూడా లేదు. రోజుకు రెండుపర్యాయాలుమాత్రం ఆ భవనంలో ఒకభాగంలో ఉన్న చిన్నఆలయంలో ఏదో గీతశ్రవణం వినిపిస్తుంది. విదేశమతాన్ని గూర్చి వినదలుచుకుంటే ఆ సమయంలో అక్కడికి వెళ్ళొచ్చు. ఒకమాటు ఆర్చిడ్ ఆ ఆలయంలోకి వెళ్ళింది. ఆమె కేమీ అర్థంకాలేదు.

వారు పాడుతున్నపాట ఆమెకు ఏడుపులా వినిపించింది. అందుచే అక్కడినుంచి వెళ్ళిపోయింది.

రోజూ ఒకేరకంభోజనం, ఒకేరకమైనజీవితం. ఆర్చిడ్‌కు విసుకెత్తిపోయింది. ఆమె కేప్పుడైనా తీపిపదార్థాలు తినాలని పించేది. గ్రామంలో ఉన్నప్పుడు రోజూ వీధిలోకి తీపిపదార్థాలు అమ్మడానికి వచ్చేవారు. గంటమోత, వినగానే బయటికి పరుగెత్తుకెళ్ళి ఎక్కువసేపు నమలడానికి వీలైన తీపును కొనుక్కుతినేది. ఆమెపిల్లలకుకూడా ఏమీ తోచడంలేదు. ఆడుకునేందుకు బొమ్మలులేవు. తనవదిన వెళ్ళిపోయినతరువాత ఆర్చిడ్ 'నగరం మళ్ళీ స్తిమితపడింది. ఒకనాటి తెల్లవారు ఝామున నే నెలాగో గేట్లోగుండా తప్పించుకుపోవచ్చు. వదిననుకూడా చూడొచ్చు. భర్తవద్దకు వెళ్ళవచ్చు' అని ఊహించుకోసాగింది. కాని ఎవరితోనూ ఏమీ చెప్ప లేదు. కొందరుస్త్రీలు మెత్తగా ఇతరులుచెప్పినది ఒప్పు కుంటున్నట్టు నటిస్తూ, తమకుతోచినవిధంగా చేస్తారు వారు. ఆర్చిడ్ అలాంటిదే. కొన్నిరోజులతరువాత ఒకఉదయాన అత్త గారితో, 'రాత్రి నేను బాగానిద్రపోలేదు, వెళ్ళికాసేపు పడు కుంటాను. కొంచెం పిల్లల్ని కనిపెట్టిఉండు' మని చెప్పింది.

'మరేమీ పనితోచకపోతే నిద్రపో' అన్నది లింగ్‌సా కొంచెం విసురుగా.

ఆర్చిడ్ నవ్వి మారుచోనగుండా బైటికి వెళ్ళింది. గేటు వద్దకు వచ్చింది. గేటుకాపలాదారు అప్పుడు గేటుమూసి అన్నం తినడానికి వెళతాడని ఆర్చిడ్‌కు తెలుసు. ఆమె నెమ్మదిగా ఎవరూవినకుండా గేటుతలుపు తెరుచుకుని వీధిలోఅడుగు

పెట్టింది. నగరమంతా ప్రశాంతంగా ఉన్నది. ఆర్చిక్ మెల్లగా నడుస్తూ వెళ్ళింది. శత్రువులింకా కనిపెట్టివున్నారని ఆమెకు తెలియదు. బహిరంగంగా దుష్కృత్యాలు చెయ్యకూడదని ఆజ్ఞలుఉన్నాయి. అయినా చాటుగా జరిగే అత్యాచారాలు జరుగుతూనే ఉన్నాయి. హఠాత్తుగా అయిదుగురు శత్రుసైనికులు ఆమెమీద పడ్డారు. ఆర్చిక్‌లాంటి స్త్రీలు ఈమధ్య అసలు కనుపించడమేలేదు ఆర్చిక్‌ను చూడగానే, ఆమె ఒక వేశ్యాంగన అనుకున్నారు.

ఆర్చిక్ చక్కని ముక్కు. గుండ్రనిముఖం. ఎంతో కులాసాగా ఉంటుంది. సుకుమారశరీరం ఎర్రని పెదవులు. శత్రుసైనికులు ఆమెనుపట్టుకుని ఒకనిమిషం ఆమెను తాగినట్టుగా చూచి, ఎవరు ముందు అనుభవించాలా అనే విషయంలో తగాదాపడ్డారు. ఆర్చిక్ సుతిమెత్తని జీవితానికి అలవాటు పడ్డ స్త్రీ. కొద్దికష్టాన్నే భరించలేక అలాంటిస్త్రీలు చచ్చిపోతారు. ఈ సోల్జరముఖాలు చూడగానే ఆమెశక్తి నశించిపోయింది. ఒక్కొక్కరే ఆమెను అనుభవించ నారంభించారు. దారినపొయ్యేవారి కెవరికీ ఈ దురాగతాన్ని ఆపడానికి ధైర్యం చాలలేదు. ఆకలైనకుక్కలకు కుందేటపిల్ల చిక్కినట్లు చిక్కింది ఆమె అరవసాగింది. తరువాత వాళ్ళు ఆమెను అనుభవించడమేకాకుండా చావబాదారు. చిట్టచివరి సైనికుడు ఆమె మృతకళేబరాన్ని మాత్రమే ఉపయోగించుకోవలసి వచ్చింది. ఆమెఅవసరం తీరిపోగానే వాళ్ళు వెళ్ళిపోయారు. కొందరు బాటసారులు ఎలాగో ధైర్యంచేసి ఆమె కళేబరం వద్దకు వచ్చారు. ఆమెఎవరో కనుక్కోలేకపోయారు.

'పల్లెటూరిపిల్లగా కనుపిస్తోంది. పాపం!' అనుకున్నారు. ఎవరూ ఆమెశరీరాన్ని ఇంటికితీసుకుని వెళ్ళడానికి సాహసించ లేదు. వారిలోఒకడు, 'తెల్లదొరసాని వద్దకు తీసుకుపోదాం. ఆమే సమాధిచేస్తుంది'అన్నాడు.

ఒకరిక్షాను పిలిచారు. ముందు ఆ రిక్షావాడు శవాన్ని మోయడానికి అంగీకరించ లేదు. కాని తెల్లదొరసానిపేరు చెప్పగానే, హెచ్చుబాడుగవస్తుందని అంగీకరించాడు. ఒక దగ్గరదోవగుండా భవనంవద్దకు తీసుకెళ్ళాడు. అనతికాలం క్రితమే ఎంతో ఆనందంగా ఆగేటుగుండావచ్చిన ఆర్చిడ్ మృతురాలై మళ్ళీ ఆగేటువద్దకే చేరింది. గేటు మూసిఉంది. గేటుకాపలాదారు భోజనముగించి ఒక స్టూలుమీదకూచుని, పళ్ళుగిల్లుకుంటూ కూచున్నాడు. గేటువద్ద చప్పుడుకాగానే లేచివెళ్ళి గేటుతీశాడు. ఆర్చిడ్‌ను చూడగానే ఇక్కడఉరి‍ త్యాం తీసుకున్న అమ్మాయేమే! అని బిగ్గరగా అరిచాడు.

'ఈ అమ్మాయిని హైటికి ఎవరు పోనిచ్చారు?' అన్నారు వారు.

'నేనుకాదు' అని ప్రమాణంచేశాడు ఆ కాపలాదారు-'నేను ఏ స్త్రీనీ హైటికిపోనివ్వను' అన్నాడు. తరువాత అతనికి ఆ విషయం స్ఫురించింది. అతను భోజనం ముగించివచ్చి చూచేసరికి, తలుపుగడియ తెరిచిఉంది. తనే వృద్ధాప్యంలో ఆదమరుపువల్ల తలుపు గడియవెయ్యలేదేమో ననుకుని మళ్ళీ మూసేశాడు. 'నేను భోజనం చేస్తున్నప్పుడు తప్పించుకుని వెళ్ళిఉంటుంది' అనుకున్నాడు. వెంటనే ఈ విషయంచెప్పడానికి తెల్లదొరసానివద్దకు పరుగెత్తుకెళ్ళాడు.

దొరసాని ప్రార్థనచేసుకుంటోంది. ఆమె ప్రార్థనముగించివచ్చి ఈ విషయంవినేసరికి పాలిపోయిన ఆమెముఖం మరింత కాఠిన్యం వహించింది. 'మీరు ఆమెని ఇక్కడికి తీసుకురావడం మంచిదైంది. చాలారోజులు ఈ అమ్మాయి మాభవనంలోనే ఉన్నది. ఆమె భర్త, తల్లి, పిల్లలు ఇక్కడేఉన్నారు. నేను ఆమెభర్తకోసం కబురుపంపుతాను' అన్నది. రిక్షావాడికి హెచ్చుబాడుగ దొరికింది. అందరూ సంతృప్తిగావెళ్ళారు.

తరువాత ముసలిదొరసాని ఆ శవాన్ని లోనికితీసుకు వెళ్ళేందుకు కొందరిని పిలుచురమ్మని కాపలావానితో చెప్పింది.

వాళ్లువచ్చేవరకూ ఆమె వేచిఉండి, ఆ ర్చిడ్ ను మోయించుకుని తీసుకెళ్ళింది.

తరువాత నెమ్మదిగా జరిగినవిషయమంతా లింగ్‌సాతో చెప్పింది. మొదట్లో లింగ్‌సా ఈ విషయాన్ని నమ్మలేదు. ఎవరో స్త్రీవిషయం చెబుతున్నదనుకుని, మీరు పొరబడు తున్నారు. నాకోడలు నిద్రపోతూవున్నది అన్నది. తెల్లదొర సాని విషాదవదనం ఏమీ చలించలేదు.

లింగ్‌సాచెయ్యిపట్టుకుని మెల్లగావెళ్ళి టేబిల్‌మీద పడుకోబెట్టిఉన్న ఆర్చిడ్ శవాన్ని చూపింది. ఆర్చిడ్ శవాన్ని చూడగానే లింగ్‌సా పెద్దగా విలపించసాగింది.

'రెండుగంటలక్రితం పచ్చగాఉన్నది. ఎంతలో ఎంత జరిగింది!' అని విలపించసాగింది.

'నాభర్తనూ, నాకొడుకునూ పిలిపించండి, ఇప్పుడేం చెయ్యాలో నేనుచెప్పలేను' అన్నది. చీకటిపడగానే వారికోసం కబురు పంపుతానన్నది తెల్లదొరసాని.

తరువాత ఆమె నిశ్చలంగా ఒక ఆలయ సేవకుణ్ణి పిలిచి, ఆర్చిడ్ శవాన్ని గుడ్డతో కప్పింది. లింగ్‌సా ఎంతసేపుకూ ఏడ్పు చాలించలేదు.

తెల్లదొరసాని, 'నేనూ జీవితంలో ఎంతో దుఃఖాన్ని చూచాను. నాకు నవ్వూ, ఏడుపూ – రెండూ ఎం: పోయాయి నన్ను నవ్వించగలదీ, ఏడిపించగలదీ ప్రపంచంలో ఏమీ లేదు' అన్నది. ఆమె పాలిన పసుపుపచ్చని కళ్ళెత్తి ఎక్కడో దూరంలోకిచూడసాగింది. 'మళ్ళీ నా ప్రభువుసన్నిధి లోకి వెళ్ళినప్పుడుకాని నా హృదయం చలించదు' అన్నది.

ఈమాట లింగ్‌సాకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె ఏడుపు ఆపి, 'మీకు వివాహంకాలేదని చెప్పారే?' అన్నది.

'అవును. ఈ లోకపద్ధతిలో నాకు వివాహం కాలేదు. కాని, నా జీవితాన్ని ఈశ్వరునికి అంకితంచేశాను. ఒకనాడు ఆయన నన్ను తనవద్ద చేర్చుకుంటాడు'అన్నది దొరసాని.

ఈ మాటలు విని లింగ్‌సా స్తబ్ధురాలై పోయింది. ఆమె కన్నీళ్లు ఇంకిపోయాయి. తెల్లదొరసాని తనపాలిపోయిన కను లతో లింగ్‌సావంక సూదులుపొడిచినట్టుచూస్తూ 'నిన్నుకూడా ఈశ్వరుడు కోరుతున్నాడు. నీ హృదయాన్ని మృదులంచేసి, నిన్ను తనసాన్నిధ్యానికి చేర్చుకోడానికి ఈశ్వరుడు ఈ కష్టాన్ని కలిగించిఉంటాడు' అన్నది.

లింగ్‌సా వెంటనే 'నేను ఈశ్వరునివద్దకు రానని చెప్పు. నాకు భర్తఉన్నాడు. నేను సాదుకోవలసినపిల్ల లున్నారు. నే నెన్నో బరువులూ, బాధ్యతలూ ఉన్న స్త్రీని'అన్నది.

'నీ ఇంట్లోకూడా నువు ఈశ్వరుణ్ణి సేవించవచ్చు' అన్నది తెల్లదొరసాని. ఇలాఅంటూ లింగ్‌సా వేపు రాసాగింది. లింగ్‌సాదృష్టికి ఆ దొరసాని పెరిగిపోతున్న గోపురంలా మరింత పెద్దదవుతున్నట్లు కనుపించసాగింది. ఆమె ఒక పెద్ద కేకపెట్టి ఆలయంలోనుంచి బైటికి వెళ్ళిపోయింది.

తెల్లదొరసానిమాటలు అందరినీ కలవరపరిచాయి. ఈ చావులన్నిటికీ కారణం తెల్లదొరసానిదేవుడేనని లింగ్‌సా అందరికీ చెప్పింది. అందరూ భయపడసాగారు. తెల్లదొరసాని మాటలలోని అంతరార్థాన్ని వారికి బోధపరిచేసరికి తల ప్రాణం తోకకొచ్చింది.

ఇదంతా జరిగేసరికి రాత్రిపడింది. లింగ్‌సా పసిపిల్లలను నిద్రపుచ్చింది. వారికి మరణమంటేఏమిటో తెలిదు. వారిని నిద్రపుచ్చి లింగ్‌సా వారిప్రక్కన కూచుంది. ఆమె ఆరోజంతా అన్నం తినలేదు. అందుచే చాలా బలహీనంగాఉంది. లింగ్ టాన్, కొడుకుల రాకకోసం ఎదురుచూస్తూ కూచుంది. అర్ధ రాత్రి కావచ్చేసరికి ఎవరిదో అడుగులచప్పుడు వినిపించింది. కళ్ళెత్తిచూచేసరికి కాపలావాడు ఆమెనురమ్మని సైగచేస్తు న్నాడు. ఆమె నెమ్మదిగాలేచి నిద్రిస్తున్నవారి మధ్యనుంచి అతనివెంట వెళ్ళింది. బైట చల్లనిచీకట్లో ఇద్దరువ్యక్తులు ఆమె కోసం కాచుకునిఉన్నారు. ఆమె తనజీవితంలో ఎన్నడూ అంత సంతృప్తి అనుభవించలేదు. వారినిచూడగానే ఆమె వెక్కి వెక్కి 'ఏడ్వసాగింది. ఎంతపనిజరిగింది! ఎంతపనిజరిగింది!'అని ఏడవసాగింది.

వారిని ముందుగా తెల్లదొరసాని కలుసుకుని జరిగిన విషయం చెప్పింది. ఈ సమయంలో ఆమె మళ్ళీవచ్చి 'నాతో రండి' అన్నది వారు అనుసరించారు. ఆమె వారిని ప్రార్ధన చేస్తున్నగదిలోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టినది. వారికి ఇష్టమైతే శవపేటిక తెచ్చి, ఆర్చిడ్‌ను అక్కడే సమాధిచేస్తానని చెప్పింది.

'తరువాత —రోజులుచక్కబడిన తరువాత మీ రామెను తీసుకెళ్ళి సమాధిచేసుకోవచ్చును' అని చెప్పింది.

వారు ఒకరినంక ఒకరు చూచుకున్నారు. అందరి తర ఫున లింగ్‌టాన్ 'సరే, అలాగే చెయ్యండి. మీ దయకు ఎంతో కృతజ్ఞుణ్ణి' అన్నాడు.

తెల్లదొరసాని, 'నాదేమీలేదు. అంతా ఈశ్వరసేవగా భావించి చేస్తాను' అన్నది.

ఈ మాటకు ఎవరూ సమాధానంచెప్పలేదు. ఆమె మాటల్లోనిఅర్ధం ఎవరికీ తెలీయలేదు. లింగ్‌సాకుమాత్రం కొద్ది భయంకలిగింది. ఆ రాత్రే లింగ్‌టాన్‌తోకలిసి ఇంటికి వెళ్ళడానికి నిశ్చయించుకుంది. లింగ్‌టాన్ వెళ్ళడానికిలేచేసరికి ఆమెకూడా లేచింది. 'నేనూ వస్తాను నీతో' అన్నది. 'రోజులు బాగాలేవు. నువురావడం మంచిదికాదు. ముందు ముందు ఈ విజేతలపరిపాలనలో మనజీవితం యెలావుంటుందో చెప్పలేము' అన్నాడు లింగ్‌టాన్.

'వీల్లేదు, నేనూ వస్తాను.'

అతనికి లింగ్‌సాస్వభావం బాగాతెలుసు. ఆమె పట్టు పట్టిందంటే సాధారణంగా వదలదు. 'సరే, నీ మొండిపట్టు యెన్నటికీ వదలవుగా' అన్నాడు విసుగ్గా.

'మన చిన్నపిల్ల నేంచేస్తావు? ఇక్కడ ఒంటరిగా వది లేస్తావా?' అన్నాడు.

లింగ్‌సాకు సమాధానం ఏంచెప్పాలో తోచలేదు. ఈలోగా తెల్లదొరసాని, 'మీరు వెళ్ళినా మీ అమ్మాయిని యిక్కడ వుంచిపోండి. మంచిరోజుల్లో యిక్కడ ఆడపిల్లలబడి వుండేది. ఇప్పుడా బడిని దూరంగా నదివొడ్డుకు మార్చాం. రేపు కొందరు అక్కడికి వెళుతున్నారు. మీ అమ్మాయిని సురక్షితంగా అక్కడికి పంపిస్తాను మీరుకోరినప్పుడు మళ్ళీ తెచ్చుకోవచ్చు' అన్నది. వారందరూ ఒకరినొకరు చూచుకున్నారు. అందరితరపున లింగ్‌టాన్, 'మంచిరోజుల్లోఅయితే మేము యిలా 'టిదానికి ఒప్పుకునేవాళ్ళంకాదు. మేమే మా అమ్మాయిని పెంచుకుని, వివాహంచేసేవాళ్ళం. కాని యిలాంటిసమయంలో వివాహానికి యెవరు తయారుగావుంటారు? మీ యిష్టంవచ్చినట్లే కానీండి. ఆమె బ్రతికివున్నదని మాత్రం మాకు యెప్పుడైనా తెలుపుతూవుండండి' అన్నాడు.

'ఆమెకు వ్రాయడం నేర్పుతాము. ఆమె క్షేమసమాచారాలు ఆమే వ్రాస్తుంది' అన్నది దొరసాని.

పూర్వపురోజుల్లో అయితే, తనకుమార్తె వ్రాతనేర్చుకోడం విని లింగ్‌టాన్ నవ్వేవాడు. కాని సంసారాలు ముక్కచెక్కలై వేర్వేరు ప్రదేశాల్లోఉన్న ఈ సమయంలో విజ్ఞానం యొక్క ఉపయోగాన్ని లింగ్‌టాన్ గుర్తించగలిగాడు.

ఇందరు మాట్లాడుతూన్నా, పెద్దకొడుకు ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ఈ విషయాన్ని ఎవరూ గ్రహించలేదు కూడాను. ఇప్పుడు హఠాత్తుగా మాట్లాడసాగాడు.

'ఒకమాటు నాపిల్లలతల్లిని చూడాలని ఉంది' అన్నాడు మెల్లగా.

ఆర్చిడ్ మరణాన్ని గురించి ఇంతవరకూ వివరాలు ఎవరూ చెప్పనేలేదు. అతను అడగనూలేదు. లింగ్‌సాకూడా హఠాత్తుగా చెప్పకూడదనుకుంది. 'ముందు వెడదాంరా నాయనా' అన్నది.

లింగ్‌సాహృదయంలో ఉన్న విషయాన్ని గ్రహించి నట్టు తెల్లదొరసాని 'నీవు ఆమెనుచూడొచ్చు. ఆమెకళేబ రాన్ని పరిశుభ్రంగా స్నానంచేయించి, కొత్తబట్ట అలంకరించి పడుకోబెట్టాం. ఆమె ప్రశాంతంగా నిద్రిస్తున్నట్టుగా ఉన్నది' అని చెప్పింది.

అతన్ని లాంతరుచూపిస్తూ లోనికి తీసుకెళ్ళింది. లింగ్‌సాకూడా అనుసరించింది. నిశ్శబ్దంగా అందరూ ఆలయం హాలులోకి వెళ్ళారు. తెల్లదొరసాని ఆర్చిడ్ ముసుగుతీసి చూపింది.

ఈవిధంగా భర్త ఆమెనుచూచాడు. నిద్రిస్తున్న ఆమె ముఖంమీద ఒక్కగాయంకూడా లేదు. అందమైన మెత్తని పెదవులు మూసుకునిఉన్నాయి. చిరునవ్వు ఆ పెదవులపైతాండ విస్తోంది. ఆమెను చూడగానే అతనినయనాలు అశ్రుపూరితా లైనాయి. కళ్ళ నీళ్ళు ధారలుగా కారసాగాయి. తెల్లదొర సానిమాత్రం నిశ్చలంగా నిల్చుని చూస్తోంది. చివరకు లాయ్‌టో ముఖంతిప్పేసుకున్నాడు. 'ఇక ముసుగుకప్పండి' అన్నాడు. దొరసాని ముసుగుకప్పింది.

తరువాత వాళ్ళు బైటికి వెళ్ళారు. లింగ్‌సా పిల్లల్ని లేపటానికై హాల్లోకి వెళ్ళింది. లింగ్‌టాన్, అతనికొడుకు వెలుపల చీకట్లో నిల్చున్నారు.

కొడుకు దుఃఖాన్ని తండ్రి చూచాడు. అతను పొరలి వస్తున్నదుఃఖాన్ని బిగబట్టుకుంటున్నాడు. లింగ్‌టాన్ తన కొడుకును ఒకప్రక్కకు తీసుకెళ్ళి, 'హృదయంలోఉన్న దుఃఖాన్నంతా వెళ్ళగక్కు బాబూ. కాని ఒకవిషయం మాత్రం గ్రహించు. అన్నిఏడుపులూ కట్టకడపటికి ఆగిపోతాయి. నివింకా చిన్నవాడివి. నీ పిల్లలకు మరోతల్లి వస్తుంది' అన్నాడు.

'ఆ విషయం ఇప్పుడు మాట్లాడకు నాన్నా' అన్నాడు కొడుకు.

'మాట్లాడను. కాని ఆవిషయంమాత్రంజ్ఞాపకంపెట్టుకో'

కొడుకు సమాధానం చెప్పలేదు. కాని అతని హృదయంలో ఒకభావాన్ని నిక్షేపించాడు. అది అతని దుఃఖభారాన్ని తీసివెయ్యడానికి కాదు. తన సంసారంకోసం జీవయాత్ర సాగించాలని చెప్పడానికి మాత్రమే.

హాలులోపల లింగ్‌సా పిల్లలకు దుస్తులువేసి, పాన్‌షియోతో, 'అమ్మాయ్, నీవు భయపడకూడదు. బడికి వెళ్ళి బాగా చదువుకో'అని చెప్పింది. పాన్‌షియో నిజంగానే భయపడలేదు. ఇంట్లో పల్లెత్తుమాటకూడా మాట్లాడకుండా తల వంచుకుని పనిచేసుకుపోయే పాన్‌షియో భయపడకపోవడం చూచి ఆమెకు ఎంతో ఆశ్చర్యం కలిగింది.

'నేను భయపడనమ్మా'అన్నది పాన్‌షియో.

'నువ్వు వ్రాయటం నేర్చుకోగానే మాకు ఉత్తరం రాయి. మేము చదివించుకుని వింటాం' అన్నది లింగ్‌సా.

'తప్పకుండానమ్మా'అని పాన్‌షియో చిన్నపిల్లనెత్తుకుని తల్లితో ద్వారంవరకూ నడిచింది.

లింగ్‌టాన్‌కూడా కూతురుతో ఎలా ప్రవర్తించుకోవలెనో చెప్పాడు. తరువాత తెల్లదొరసానివంక తిరిగి, 'అమ్మా! ఈ పిచ్చిపిల్లను మీకు ఒప్పజెబుతున్నాను. మీరు ఎలాగైనా కాపాడాలి. మీమాట విననప్పుడు తిరిగి పంపేసి, మమ్మల్ని క్షమించండి' అన్నాడు. తెల్లదొరసాని నవ్వింది. ఆమె నవ్వు లింగ్‌సాచూడడం అదే మొదటిసారి.

'తప్పకుండా వినయ విధేయతలతో ఉంటుందనుకుంటాను'అన్నది దొరసాని.

ఈవిధంగా నమస్కారాలతో, అభివాదాలతో వారు విడిపోయారు. లింగ్‌టాన్ తన చిన్నమనుమణ్ణి, లాయ్‌టా తన పెద్దకొడుకును ఎత్తుకున్నారు. లింగ్‌సాహృదయం ఒక్క క్షణం కూతురువంక పరుగెత్తసాగింది. ఒక్కమాటు వెనుదిరిగి లాంతరువెల్తురులో కూతురుముఖంవంక చూచింది. తెల్లదొరసాని ఆ పిల్లతో 'నువ్వు మాతో సుఖంగా ఉండగలవా?'అని అడగడం, పిల్లముఖం స్వచ్ఛమైన ఆనందంతోనిండి 'చాలా సుఖంగా ఉండగలను'అనడం విన్నది.

ఆ రాత్రి చీకటిలో తండ్రీకొడుకులిద్దరూ నడుస్తున్నారు. శత్రువుల కంటపడకుండా ఉండాలని లాంతరు తీసుకోలేదు. మళ్ళీ ఇంటికి వెడుతున్నామని లింగ్‌సా హృదయంలోఆనందం

నిండింది. గృహం శిథిలమైనదని ఆమెకు తెలుసు. శత్రువు గృహాన్ని శిథిలంచేసినప్పుడు ఆమె అక్కడేఉన్నది. కాని భర్త మళ్ళీ గృహాన్ని చక్కబెట్టి ఉంటాడనుకున్నది.

లింగ్‌టాన్ ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఆర్చిడ్ మరణం అతని మనస్సు నెంతో కుంగదీసింది. అతను మరో విషయం ఇంతవరకూ తనభార్యకు చెప్పలేదు. అది జేద్ వెళ్ళిపోవడం. ఆ విషయం ఆమెతో ఎంతవరకు చెప్పాలో ఎంతవరకు చెప్పకూడదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు లింగ్‌టాన్. ఈ ఆలోచనలో తమఇంటిదగ్గరికి వచ్చిన విషయం కూడా అతనికి తెలీలేదు.

లింగ్‌సా పరుగెత్తుకెళ్ళి ఇంట్లో దీపంవెలిగించింది దీపం వెలిగించి ఇల్లంతా చూచి, ఆమె పెద్దగా ఏడ్వసాగింది. 'నా వస్తువులన్నీ ఏమైనాయి? మనకుర్చీలు ఎక్కడున్నాయి? టేబిల్లు ఏవీ?' అని పెద్దగా అరవసాగింది.

ఇల్లంతాతిరిగి వస్తువులకోసం కలయచూచింది.

'మానాన్నగారింటినుంచి తెచ్చుకున్న వస్తువులన్నీ ఏమైనాయి' అని ఏడ్వసాగింది.

లింగ్‌టాన్, అతనికొడుకు పిల్లల్ని ఎత్తుకుని స్తంభాల్లాగా నిల్చున్నారు. ఆమెదుఃఖానికి అంతులేకుండావుంది. ఆమె జీవితంలో ఎంతో అలసిపోయింది. ఆమెపిల్లలు చనిపోయారు. ఆమెసంసారం విచ్ఛిన్నమైపోయింది. ఆమె ఇంతకుపూర్వం నివసించిన ప్రపంచానికి, ఇకముందు నివసించనున్న ప్రపంచానికి ఎంతో అశాంతం కనుపిస్తోంది.

లింగ్‌టాన్ కూడా భరించలేక పెద్దగా విలపించనారంభించాడు. మొట్టమొదట భార్యను తిట్టాడు. కాని తరువాత అంతటికీ కారణమైన యుద్ధాన్ని తిట్టాడు. యుద్ధాన్ని, సైనికులను, వారినికన్న తల్లులనూ అందరినీ శపించాడు. అతను ఏడవడం చూచేసరికి ఆమె ఏడుపు చాలించి మళ్ళీ లోకంలోకి వచ్చింది. తను భార్యనని గ్రహించింది. అతనిదగ్గరకుచేరి, అతని భుజంమీద చెయ్యివేసి, 'ఏడవకండి, మీ మనస్సుకు కష్టంకలిగించాను. ఇక ఎంతకష్టంవచ్చినా మనం ఇక్కడినుంచి కదలవద్దు' అన్నది. లింగ్‌టాన్ ఏడ్పుమాని కళ్లుతుడుచుకున్నాడు.

తరువాత ఆమె తలయెత్తి 'మూడోఅబ్బాయికి మన రాక తెలీదా?' అన్నది.

ఇక లింగ్‌టాన్ ఆ విషయాన్ని దాచి ఉంచలేకపోయాడు. జరిగినది జరిగినట్టు చెప్పెయ్యడం మంచిదనుకున్నాడు. ఎంతో బరువైన గొంతుకతో, ఎన్నో నిశ్వాసలతో, తమ మూడోకొడుకు వెళ్ళిపోయినగాథంతా చెప్పాడు లింగ్‌టాన్. కథంతా ముగిసేవరకూ ఆమె నెమ్మదిగా విన్నది. చివరకు, 'వాడైనా బ్రతికాడు అంతేచాలు' అన్నది.

'వాడైనా బ్రతికి చల్లగాఉన్నాడు, అంతేచాలు' అన్నాడు లింగ్‌టాన్ కూడా.

తరువాత వాళ్ళు తమగదిలోకి వెళ్ళారు. ఎన్నో ఏకాంతరాత్రులు గడిపినతరువాత ఈనాడు అతనిలో ఎలాంటి వాంఛా లేదు. అతనిజీవితంలో ఒకవిధమైన అలసట నిండింది.

లింగ్‌టాన్‌కుటుంబంలో ఎన్నోకష్టాలూ, కల్లోలాలూ వచ్చాయి.

కాని పైన ఆకాశం ఏ మార్పూ లేకుండా స్వచ్ఛంగా ప్రకాశిస్తోంది. సూర్యు డలాగే ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు ఉదయించి అస్తమిస్తున్నాడు. నక్షత్రాలు అలానే వెలుగుతున్నాయి. జీవితం సాగిపోతూంది. అలాగే లింగ్‌టాన్ కుటుంబజీవితంకూడా సాగిపోతోంది.

ఒకరోజున లింగ్‌టాన్‌కు ఒకజాబు వచ్చింది. లింగ్‌టాన్ ఆ జాబుతీసుకుని తన బంధువువద్దకు వెళ్ళాడు. ఈజాబు ఇంటిల్లిపాది ఆనందంలో ముంచేసింది. లింగ్‌టాన్ జాబు తెరవగానే అందులోనుంచి ఎర్రని సిల్కుగుడ్డపేలిక పడింది. ఎక్కడో దూరాన జేడ్‌కు కొడుకుపుట్టినగుర్తు అది.

---

శ్రీ వేమన గ్రంథాలయము
తెలప్రోలు. (కృష్ణా జిల్లా.)

## 10

సుడిగాలిలా చుట్టిన కష్టాలలో ఈ సుఖంవచ్చింది. ఆ మరునాడు విందుచేసుకున్నారు. లింగ్‌టాన్ ఉత్తరంపట్టుకెళ్ళి బంధువును చదవమన్నాడు.

గ్రామంలో ఒక ఉత్తరంరావడమంటే సామాన్య విషయంకాదు. శత్రువులు వచ్చినప్పటినుంచి ఇంతవరకు ఉత్తరంలేదు అందుచేత ఉత్తరంచదవడమనేది సామాన్య విషయంకాదు.

లింగ్‌టాన్ బంధువు జాబు చదవడానికై కాళ్ళూ ముఖం కడుక్కొని కూచున్నాడు. అతను జాబుచదువు తూంటే చుట్టూ పదిమందీ గుంపుగాచేరారు.

లింగ్‌టాన్, అతనిభార్య జాబువినడానికి శ్రద్ధగా కూచున్నారు. లింగ్‌టాన్ బంధువు లేఖచదవడానికి గొంతు సవరించుకుని పుక్కిలించిఉమ్మేసి ఒకగుక్కెడు టీ సేవించి, చక్కగా గొంతెత్తి చదువసాగాడు.

'పూజనీయులైన తల్లిదండ్రులారా! మీారందరూ క్షేమంగా ఉన్నారని తలుస్తాము. పెద్దన్నకూ, వదినకూ, ఇతర పెద్దలందరికీ మా నమస్కారాలు.

మేము మిమ్మల్ని వదలి వెళ్ళినప్పటినుంచీ ఇప్పటి వరకూ ఒక వెయ్యిమైళ్ళు ప్రయాణం చేసిఉంటాము. శిశు జననం కారణంగా ప్రస్తుతం ఇక్కడ ఆగిపోయాము. అక్కడ శత్రువుల రాకవివరాలు తెలుపవలసింది. ఇక్కడ పని దొరు కుతుంది. నేను రోజూ రిక్షాలాగి బడిపంతులుకన్నా ఎక్కువ సంపాదించగలను.

పదమూడవనెల చివరిరోజున మీా మనుమడు జన్మిం చాడు. తల్లి చాలాదూరం నడవడంవల్ల సకాలంలోకన్న ముందుగా ప్రసవించినా, కుర్రవాడు ఆరోగ్యంగా బలంగానే ఉన్నాడు. రోజులు బాగుపడిన తరువాత మేము తిరిగివచ్చి మనుమణ్ణి చూపించగలం. రోజులు ఇంతకన్న క్లిష్టంగా పరిణ మిస్తే, మేము నదిఉత్తరదిశవరకూ వెళ్ళగలం మళ్ళీ అక్కడి నుంచి ఉత్తరంవ్రాస్తాం. మీారు ఉత్తరం వ్రాసేటట్లయితే

క్రిందిచిరునామాకు వ్రాయండి. 'టా' ఎనిమిదవసోదరుడు, చాపల మార్కెట్, సూదులువీధులుకలిసేసందులోదుకాణం.'

ఉత్తరం ముగిసింది. ఉత్తరం ఇంతత్వరలో ముగియడం లింగ్‌టాన్‌కు అసంతృప్తి కలిగించింది.

లింగ్‌సాకు ఇల్లంతా దిగాలుపడినట్లు కనుపించసాగింది. ఆమె ఈ ఏకాంతాన్ని భరించలేకపోయింది. పూర్వం ప్రతిగది పిల్లలతో కళకళలాడుతూఉండేది. భోజనానికి కూచుంటే అందరూ క్రిక్కిరిసి కూచునేవారు. ఆమె అందరికీ స్వయంగా వడ్డించేది. ఇప్పుడు ఇంట్లో ఎవరూలేరు. ఆమెభర్త, కుమారుడు ఇద్దరే. భయంవల్ల పిల్లలుకూడా పెద్దమనుష్యుల్లాగా నిశ్చలంగా ఉన్నారు.

లింగ్‌టాన్ పెద్దకొడుకు విచిత్రవ్యక్తి. అతను ఒక్క మాటకూడా మాట్లాడడంలేదు. ఇలాటి క్లిష్టపరిస్థితులకు అతను తగడు 'జీవితం చక్కగావున్నట్లయితే అతనెంతో అభివృద్ధిచెందేవాడు. ఎంతో శాంతి, విజ్ఞానసంపత్తిగల వృద్ధుడుగా తయారయ్యేవాడు. గ్రామంలో అందరికి గౌరవ పాత్రుడయ్యేవాడు. కాని యిప్పుడు సంభవించినవైకల్యం అతన్ని అగాధంలో ముంచేసింది. అతన్ని ఒకవిధమైన స్తబ్ధత ఆవరించింది. ఆర్చిడ్‌స్థానాన్ని మరొకరు ఆక్రమిస్తారనడానికి యింతలో ఆశచావలేదు. అందుకని అతను పొలందున్నే దున్నపోతులా మందుడైపోయాడు.

వసంతం వచ్చింది. కాని ఈ వసంతంలో ఆనందం కాని, ఉత్సాహంకాని లేదు. లింగ్‌సా పండుగలేమీచెయ్యలేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా నిశీథంలా వున్నది. లింగ్‌సాకు

నానాటికీ చిరాకు హెచ్చింది. ఒకరోజున లింగ్‌టాన్‌తో, 'మనయిల్లు సమాధిలావుంది. జేద్‌ను, రెండో అబ్బాయిని పంపించకుండావుంటే బావుండేది. పెద్దబ్బాయి అసహాయంగా వున్నాడు. మనం ముసలివాళ్ళమైపోయాం. మన కేదైనా సంభవిస్తే ఈ పసిపిల్లలగతి ఏంకావాలి?' అన్నది.

లింగ్‌టాన్ గంభీరంగా ఈ మాటలన్నీ విన్నాడు. 'జేద్‌నూ, రెండో అబ్బాయినీ పిలిపించమనా నీ అభిప్రాయం? ఆ స్వేచ్ఛాభూమినుంచి ఈ శత్రుదేశంలోకి మన మనుమణ్ణి తీసుకురమ్మంటావా?' అన్నాడు.

'ఇది శత్రువులభూమి కాదు. మనం ఎంతకాలం ఈ భూమిమీద నివసిస్తామో అంతకాలం ఈ భూమి మనదే' ఆమెఅన్న ఈమాటలో ఎంతో అర్థంఉన్నట్లు గోచరించింది లింగ్‌టాన్‌కు. పైపువెలిగించి, ఆమెమాటలువినడానికి ప్రశాంతంగా కూచున్నాడు.

'ఊం. చెప్పు. నీమాటలు వినాలనిఉంది' అన్నాడు లింగ్‌టా.

'మన రెండోఅబ్బాయి తిరిగివచ్చి, మళ్ళీ పూర్వం లాగా యిక్కడే వుండాలని నాఉద్దేశం. మనం శత్రువులకు లొంగిపోకూడదు. మనపిల్లలను పంపించివెయ్యడంవల్ల మనం శత్రువులకు లొంగినవాళ్ళ మవుతాము. మనపిల్లలందరూ వెళ్ళిపోయి, ముసలివాళ్ళంమాత్రం ఉంటే, శత్రువులు మనల్ని పిరికివాళ్ళనుకుంటారు.'

ఆమెమాటల్లో సత్యం ఉంది. లింగ్‌టాన్ కాసేపు పైపుకాల్చాడు. తరువాత 'మనకింకా ఉపద్రవాలు రాను

న్నాయి'అన్నాడు. 'ఎలాంటి ఉపద్రవాలు?'అని అడిగింది లింగ్‌సా. 'మన రైతులకు ఎంతో ఉపద్రవకరమైన చట్టాలు రాబోతున్నవని చెప్పుకుంటున్నారు.

'అలాంటి ఉపద్రవాలేవస్తే మనకు సాయంచెయ్యడానికి మనపిల్లలు దగ్గరే ఉండాలి. రెండో అబ్బాయికి జవాబు రాసేటప్పుడు ఈ విషయం వ్రాయండి.'

ఆ రాత్రంతా లింగ్‌టాన్ ఇలా ఆలోచించాడు-'శత్రువులు మహమ్మారిలా దేశాన్నంతా ఆక్రమించుకుంటారు. మనం పారిపోవడం మంచిదేనా? అలా పారిపోయి మనభూమిని శత్రువుపరంచెయ్యడం సమంజసమేనా? కొందరు ధైర్యం లేక పారిపోతారు. కొందరు ధైర్యంగలవారు కాబట్టి ఉంటారు. నా కొడుకులందరూ ఇక్కడే ఉండాలనిచెప్పడంలో నా భార్యతప్పేమీ లేదు, మనంఎక్కడ జన్మించామో అక్కడే ఉండి, మనభూమిని మనం రక్షించుకోవాలి' అనుకున్నాడు లింగ్‌టాన్.

ఆ వేసవిలో ఉపద్రవంవచ్చింది. భూమిమీద శత్రువులు కొత్తపన్నులు విధించారు. బియ్యంధర విషయంలో ఎంతో అన్యాయంచేశారు.

ఒక్కొక్కరైతు ఏపైరు వెయ్యాలో వారే శాసించారు. లింగ్‌టాన్ ఎన్నడూ కలలోకూడా అనుకోనంత నిరంకుశత్వం, నియంతృత్వం ఏర్పడింది. ఆ సంవత్సరంలో సమాధులకుకూడా స్థలంలేనంతమంది ప్రజలు ఊచకోత కోయబడ్డారు. వీధులనిండా శవాలే. శవాలు నదులలో, ప్రక్క

కాలువలలో తోసివెయ్యబడ్డాయి. అంటువ్యాధులు ప్రబలాయి. మృత్యుదేవత విచ్చలవిడిగా తాండవించింది.

మృత్యువు లింగ్‌టాన్ గృహంలోకూడా ప్రవేశించింది. అందరికీ పదిరోజులపాటు జ్వరాలువచ్చాయి. చిన్నపిల్లలు కలరాతగిలి చనిపోయారు. లింగ్‌సా తనజీవితంలో ఎన్నడూ ఏడవనంతగా ఏడ్చింది. 'ఇంక మిగిలిందేమిటి? పిల్లలేనిఇల్లు ఏంఇల్లు?' అని లింగ్‌సా ఏడ్చింది.

పెద్దకొడుకుమాత్రం ఒక్క కన్నీటిబొట్టుకూడా రాల్చలేదు. ఇంట్లో ఒక నీడలా తిరుగుతూండేవాడు. ఒకరోజున 'ఎక్కడికైనా వెళ్ళివస్తాను నాన్నా' అన్నాడు.

'ఎక్కడికి వెడతావురా నాయనా?' అంటూ తల్లి ఏడ్వసాగింది.

'ఎక్కడికి వెడతానో తెలీదు' వెళ్ళాలనిమాత్రంఉంది అన్నాడు. మందస్వరంతో.

లింగ్‌టాన్ కొంచెం ఆలోచించి, 'నీవు వెళ్ళదలుచుకుంటే కొండలవైపు వెళ్ళు. నీ తమ్ముడు కనుపిస్తే వాడిక్షేమసమాచారాలు మాకు తెలియచెయ్యి. వాడుదొంగలగుంపులో కలిశాడేమోనని నాకు భయంగాఉంది. వాడు వాళ్ళలోఉంటే వాడి నెలాగైనా మంచిదోవలో పెట్టు' అన్నాడు.

'అలాగే' అన్నాడు కొడుకు.

తరువాత కొద్దిరోజుల్లో పెద్దకొడుకు వెళ్ళడానికి ప్రయాణమయ్యాడు.

'పెద్దకొడుకు వెళ్ళిపోతే పొలంపనిఅంతా నువ్వొక్కడివే చూచుకోగలవా?' అన్నది లింగ్‌సా.

'నాకు తెలీదు. అయినా వాడిని వెళ్ళవద్దనడానికి నా కిష్టంలేదు' అన్నాడు లింగ్‌టాన్.

'రెండోకొడుక్కి ఉత్తరంరాసి పిలిపించు' అన్నది లింగ్‌సా.

పెద్దకొడుకు వెళ్ళిపోయేరోజు వచ్చింది. అతను కొండల వేపు వెడుతూంటే, అతను కనుచూపుమేర దాటిపోయే వరకూ చూస్తూనూచున్నారు.

వారిద్దరే మిగిలారు యింట్లో. ఈ యింట్లో వా రెన్నడూ ఒంటరిగాలేరు. లింగ్‌టాన్ తల్లిదండ్రులు చనిపోక ముందే అతనికొడుకులు పుట్టారు.

ఆరోజునుంచి లింగ్‌సా భర్తతో ఉత్తరంవ్రాయమని పోరుపెట్టసాగింది. లింగ్‌టాన్ రోజూ, 'రాయిస్తానులే' అంటూండేవాడు.

లింగ్‌టాన్ ప్రతిరోజూ యుద్ధఫలితాన్ని గురించి ఊహించడంమొదలెట్టాడు. ఎన్ని ఉపద్రవాలువచ్చినా తమ జీవితాన్ని తాము సాగించే, తనలాటివారిద్వారానే యుద్ధ పిశాచం జయింపబడగల దనుకున్నాడు. తనకూ, తన రెండవ కొడుకుకూ యెన్నోపోలికలున్నాయి. ఈయుద్ధం ఒకనాటితో అంతమయ్యేదికాదు. ఎన్నాళ్ళు సాగుతుందో! తన తరతరా లవరకు సాగుతుందేమో! అనుకున్నాడు లింగ్‌టాన్.

ఏడురోజులు పొలంపనిచేస్తూనే లింగ్‌టాన్ ఈవిష యాలే ఆలోచించాడు. రానురాను భావాలన్నీ ఒక సమగ్ర స్వరూపాన్ని తాల్చసాగాయి. ఎనిమిదోరోజు ఉదయాన రెం డవకుమారునికి ఉత్తరంవ్రాయించాలనే నిశ్చయానికివచ్చాడు.

లింగ్‌సాన్ ఆనందానికి మేరలేదు. కొత్తకొత్త వంటలు చేసింది. బుట్టలోనుంచి కోడిగుడ్లుతీసి వండింది. భోజనం ముగించి, లింగ్‌టాన్ తనజ్ఞాతిగృహానికి వెళ్ళాడు. అతనితో ఉత్తరంలో ఏఏ విషయాలు వ్రాయాలో చెబుతూ కూచున్నాడు. లింగ్‌సా సంతోషమల్లా ఒకటే. మళ్ళీ తనకొడుకు, కోడలు వస్తున్నారు. మనుమడూ వస్తున్నాడు. కాని లింగ్‌టాన్ మరింత దూరదృష్టిగలవాడు. తనస్వభావం, తనరెండో కుమారుని స్వభావం లింగ్‌టాన్‌కు తెలుసు గుడ్డిబాని సత్యాన్ని ఇరువురూ నిరోధించగలరని అతనికి తెలుసు. అందుచేత ఉత్తరంలో వ్రాయవలసిన విషయాలు చెబుతూ, మధ్య మధ్య ఆగుతూ బాగా ఆలోచిస్తూ, చెప్పాడు.

'చిట్టచివరకు, ఒక్కమాట వ్రాయి. శాంతికోసం అతను తిరిగిరావడంలేదని గ్రహించాలని వ్రాయి. ఎందుచేతనంటే శాంతికి అవకాశంలేదు. జరిగినరోజులు బాగాలేవు జరుగనున్న రోజులు ఇంతకంటె బాగుంటాయనే ఆశకూడా లేదు. మనం ఎలాంటి విపత్తునైనా భరించడానికి సిద్ధంగాఉండాలి' అని చెప్పాడు. బంధువు యిదంతా వ్రాశాడు. లింగ్‌టాన్ మళ్ళీచెప్పసాగాడు. 'నేనూ, అతని తల్లీ ఒంటరిగా ఉన్నామని వ్రాయి. మిగతాకొడుకులు కొండల్లోకి వెళ్ళారు. పెద్దకొడుకుభార్య, పిల్లలు చనిపోయారు. చిన్నకూతురు తెల్లదొరసానితో వెళ్ళిపోయింది. తల్లి అతన్ని కోరుతున్నది. ఇల్లు ఖాళీగా బోసిపోతున్నది. నువ్వుకూడా నాలాగానే శత్రువును ద్వేషించి, భూమిని ప్రేమిస్తేనే రావలసింది.'

బంధువు ఈ మాట వ్రాస్తూ, ఆగి, 'ఈ ఉత్తరం శత్రువుల చేతుల్లో పడితే మనఊరికివచ్చి, ధ్వంసం చెయ్యరూ?' అన్నాడు, లింగ్‌టాన్, 'ఉత్తరాన్ని ప్రత్యేకంగా పంపుతాను' అన్నాడు అతనికి ధైర్యం కలిగించడానికి.

కొందరు యాత్రికులు ఈ దేశానికి వస్తూంటారు. వారు బిచ్చగాండ్రలాగానో, రైతులలాగానో, అంధుల లాగానో వేషాలు వేసుకొని, చిరుగంటలు మ్రోగించుకుంటూ వస్తారు. వారు గ్రామాల్లో ఆగి, కథలు గాథలు పాటలుపాడు తారు. అలాటివారి ద్వారా లింగ్‌టాన్‌కు తన కొడుకు వ్రాసిన ఉత్తరం వచ్చింది.

బంధువు ఉత్తరంముగించి లింగ్‌టాన్‌కు చదివి వినిపించాడు. ఉత్తరం చక్రసిభాషలో కొత్తకొత్తగా వ్రాశాడు. ఎన్నో అర్థంలేని ఆడంబరపదాలు, కవిత్వం, పూర్వగ్రంథాల్లోని మాటలు వాడాడు. ఆ జాబులో అసలు విషయాలు నాకొడుకు అర్థం చేసుకుంటాడు లే. ఇతను తన ఆడంబరాన్ని చూపదలుచుకున్నాడు లే అనుకున్నాడు లింగ్‌టాన్. జాబు సీలు వేయించి తీసుకుని లింగ్‌టాన్ ఇంటికొచ్చాడు.

యాత్రికులు మళ్ళీ వచ్చేవరకూ వేచిఉన్నారు. లింగ్‌టాన్ రోజూ రాత్రి టీదుకాణానికి వెళ్ళి చూచి వచ్చేవాడు. ఒకరోజున అలాంటివారికి చెందిన ఒక కుర్రవాడు కనుపించాడు. లింగ్‌టాన్ అతనితో మెల్లగా, 'నువ్వు సరిహద్దు వద్దకు వెడుతూంటే ఈ జాబు తీసుకెళ్ళగలవూ?' అని అడిగాడు.

'సరే'నన్నాడు ఆ కుర్రవాడు. లింగ్‌టాన్ అతనికి తన కొడుకు ఎక్కడుంటాడో చెప్పాడు. ఆరాత్రి లింగ్‌టాన్ అతన్ని ఇంటికితీసుకుకొచ్చాడు. అందరూకలిసి భోంచేశారు. భోంచేస్తూ కుర్రవాడు వారికి తెలియనివిషయా లెన్నో చెప్పాడు. సరిహద్దుకావల, స్వతంత్రదేశంలో శత్రువును ప్రతిఘటించడానికై పెద్దసైన్యంసమకూడుతున్నదని చెప్పాడు. అది పూర్వం ఒకప్పుడు చక్రవర్తులు నిర్మించిన పెద్దగోడంత బలీయమైనదని చెప్పాడు. కాని, ఈ గోడ సజీవమానవులతో కట్టినగోడ. ఆ దేశంలో స్కూళ్ళు, గనులు, ఫాక్టరీలు ఎలా వర్ధిల్లుతున్నవో వివరించాడు. ఎందరో శత్రువులదాడినుంచి పారిపోయివచ్చినవారు అక్కడ నివసిస్తున్నారని చెప్పాడు.

లింగ్‌టాన్‌కు ఈ విషయాలన్నీ ధైర్యోత్సాహాలు కలిగించాయి. కాని లింగ్‌టాన్, అతనిభార్య తమ గ్రామాన్ని వదలి వెళ్ళదలచుకోలేదు ఎందుచేతనంటే వారిభూమి ఇక్కడే వున్నది కాని అక్కడ లేదు. తరువాత లింగ్‌టాన్ ఇలా అన్నాడు – 'నీ మాటలు వింటూంటే నా హృదయం పొంగిపోతోంది. విముక్తిసైన్యం వచ్చినరోజున నేనూ, నా కుమారుడూ ఇక్కడే ఉంటాం. ఈ భూమి మాకే ఉంటుంది.

తరువాత అతను కుర్రవాడికి ఉత్తరంఇచ్చాడు. లాయ్ ఎర్ ఎలా ఉంటాడో చెప్పబోయాడు. లింగ్‌సా ఆపి, 'వాడు నాకు తెలిసినంతగా నీకు తెలీదు. నేను వాణ్ణి తొమ్మిదినెలలు మోసి, కన్నాను. వాడి కుడికంటికింద ఒక పుట్టుమచ్చఉంది. వాడికళ్ళు పెద్దవి. వాడిముఖం తండ్రిముఖంలా చదరంగా

ఉంటుంది. వాడినోరు నా నోటిలా పెద్దది' అంటూ ఎంతో ప్రేమాతిశయంతో కొడుకును వర్ణించసాగింది.

లింగ్‌సా అమాయకంగా కొడుకునువర్ణించడం చూచి, లింగ్‌టాన్ పగలబడి నవ్వసాగాడు.

'మనకొడుకుకోసం ఇలా ఎవరైనా వెతుకుతారా ముసలిదానా !' అన్నాడు.

కుర్రవాడితో, 'ఆమెమాటలు పట్టించుకోకండి. ఆడ వాళ్ళందరిలాగానే మాట్లాడుతోంది. నా కొడుకు చాలా బల శాలి, ఆడపిల్లలా ఉండడు' అన్నాడు. ఈమాటవిని లింగ్‌సా తలవాల్చుకుంది. కుర్రవాడులేచి 'ఇక వెళ్ళిపోవాలి'అన్నాడు.

'ఈ ఉత్తరం నా కుమారునికి అందడానికి ఎంతకాలం పట్టుతుంది?'అని అడిగాడు లింగ్‌టాన్.

'నేను చెప్పలేను. అదృష్టం బాగుంటే ఒకనెలలోనే చేర్చగలను' అన్నాడు కుర్రవాడు.

ఈ విధంగా అతన్ని సాగనంపారు. లింగ్‌టాన్ అతనికి కొంతడబ్బు, రొట్టెలూ ఇచ్చాడు ఎప్పుడైనా తమగ్రామం వస్తే, తనుఇంటికి రమ్మని ఆహ్వానించాడు. ఆ కుర్రాడు వారికి కృతజ్ఞత తెలిపి వెళ్ళిపోయాడు. కాని తనపేరు చెప్పలేదు. ఎందువల్లనంటే ఈ రోజుల్లో పేరుచెప్పక పోవడం మంచిది. శత్రువులు అడిగితే 'నా కతనిపేరుకూడా తెలీదు' అని చెప్పవచ్చు.

కుర్రవాడు వెళ్ళిపోయాడు. 'లింగ్‌టాన్, అతనిభార్య వేచియున్నారు. అంతకంటె చెయ్యగలిగిందిమాత్రం ఏము న్నది? ఆ సంవత్సరం లింగ్‌టాన్‌కు పొలంపనిలో భార్యే

సహాయం చేసింది. వరినాటు వేశారు. వేసవి వచ్చేసరికి బాగా పెరుగుదలకువచ్చింది.

జేడ్, మనుముడు వస్తే ఎలాఉంటుందో; ఎప్పుడూ అదే మాట్లాడుకుంటూ ఉండేవారు. ఒకరోజున లింగ్‌సా వారిని దాచడానికి ఒకస్థలం ఉండాలని చెప్పింది.

'ఎక్కడ?'అని అడిగాడు లింగ్‌టాన్. లింగ్‌సా కొన్ని రోజులు ఆలోచించి, 'వంటిల్లో పొయ్యిప్రక్కన త్రవ్వి, క్రింద ఒక గదిలా ఏర్పరుద్దామని చెప్పింది ఆమెఆలోచనకు లింగ్‌టాన్ ఎంతో మెచ్చుకున్నాడు. ఆమె సిగ్గుపడింది.

'నేను నిజంగా అంత ఆలోచించలేదు'అన్నది వినయంగా.

'కాదు, ఇది గొప్పఆలోచనే. నేను ఎందరో స్త్రీలు పొలాల్లో పనిచేస్తూ, ఏమీ ఆలోచించనివారిని చూచాను. కాని నీకూ వారికీ ఎంతో భేదంఉన్నది. నీ మనస్సు ఎప్పుడూ ఏదోఒకటి ఆలోచిస్తూంటుంది. అందుచే నీవంటే ఎన్నడూ నాకు విసుగు కలగలేదు'అన్నాడు ఆమె నోటికి చెయ్యి అడ్డంపెట్టుకుని నవ్వింది.

ఆరాత్రి వారిద్దరూ ఆ కన్నంత్రవ్వడం మొదలెట్టారు. నేల గట్టిగాఉన్నది. కొంత త్రవ్వేసరికి వారికి బాగా అలుపు వచ్చింది. రోజూ కొద్దికొద్దిగా త్రవ్వడం మొదలెట్టారు.

ఒకనాడు లింగ్‌టాన్ పొలంలో పనిచేస్తూండగా శత్రుగుంపొకటి నగరం వేపునుంచి రావడం చూచాడు.

లింగ్‌టాన్‌కు భయంపుట్టింది. ఆరోజుతో తన జీవితం ఆఖరనుకున్నాడు. శత్రువులచేతుల్లో తుపాకులున్నాయి.

ఒకశత్రువుతో మాట్లాడిన తరువాత వాళ్లు చంపడానికి రాలేదని స్థిరమైంది. ఆ శత్రువు చేతిలో ఒక చిన్న పుస్తకం, కలం ఉన్నాయి. అతను లింగ్‌టాన్‌ను కొన్ని ప్రశ్నలడగసాగాడు. అతనిపేరు, అతను ఎన్నాళ్ళనుంచి అక్కడ ఉంటున్నది, అతనికి ఎంత భూమి ఉన్నది, ఎంత ధాన్యంపండేది, నిలవ అన్ని విషయాలూ ప్రశ్నించాడు. లింగ్‌టాన్ భయంతో ఉన్నదున్నట్లు అంతా నిజం చెప్పేశాడు. లింగ్‌టాన్ చెప్పిన వివరాలన్నీ అతనువ్రాసుకున్నాడు. తరువాత పెద్ద గొంతుకతో 'ఓ కర్షకుడా! ఈ దేశం ప్రస్తుతం మాది. మేమీ దేశాన్ని జయించాం. మేము చెప్పినట్లుగా నువ్వు ధాన్యం పండించాలి. మేము చెప్పినధరకు మాకే ధాన్యాన్ని అందచెయ్యాలి. నీ ఇష్టంవచ్చినట్టు కొనడం, అమ్మడం ఇక సాగదు. మేము న్యాయచట్టాన్ని అమలుపెట్టబోతున్నాం అంతా చట్టరీత్యా జరగవలసి ఉంటుంద'న్నాడు.

లింగ్‌టాన్ అనుభవంగలరైతు. తెలివిగలవాడు. ప్రతి సంవత్సరం ధాన్యంధరలు, వాతావరణాన్నిబట్టి, పంటనుబట్టి, అమ్మేవారిని-కొనేవారినిబట్టి మారుతాయని అతనికి తెలుసు. ఇతరపరదేశాలకు ధాన్యంపంపబడుతుందని తెలుసు. అందుచే ముందుగా ఎప్పుడూ బియ్యంధరకాని, మాంసంధరకాని నిర్ణయించలేము. లింగ్‌టాన్‌కు ఈ విషయాలన్నీ తెలుసు. కాబట్టి వినయంగా 'అయ్యా! ధాన్యంధర ముందుగా ఎలా నిర్ణయించగలం? మా దేశంలాటి దేశంలో ఇలాటివిషయాలను ఆకాశమే నిర్ణయిస్తుంది' అన్నాడు.

అంతట ఆ శత్రువు ఉద్రిక్తుడై, 'మే మిప్పుడే అన్నీ నిర్ణయించేస్తాం. మా ఆజ్ఞలు ఉల్లంఘించేవారికి నాటిభూమితో అవసరంలేదు' అన్నాడు.

లింగ్‌టాన్ మరేమీ మాట్లాడలేదు. తలవంచుకుని చల్లనపుడమితల్లికేసి చూచాడు. తరువాత తనకున్న ఆస్తివివరాలన్నీ చెప్పాడు. ఒకదున్నపోతు, రెండుపందులు, ఎనిమిదికోళ్లు, చేపలు, బాతులుగల ఒక చిన్నకొలను, ఇంట్లో తనూ, తనభార్యా.

'నీకు పిల్లలులేరా ?' అనడిగాడు శత్రువు.

లింగ్‌టాన్ తలయెత్తి తొలిసారిగా అబద్ధమాడేడు.

'మేము సంతులేనివారం' శత్రువు ఇదికూడా వ్రాసుకున్నాడు. తరువాత మరోవిషయం చెప్పాడు. 'నెలమొదటి నుంచి మా చట్టాలను అమల్లోపెట్టబోతున్నాం. మేము చేపలుతింటాం. అందుచేత మీ ఇంటికొలనులో చేపలుపడితే, మాకు ఇవ్వవలసిఉంటుంది. నీవు తినడానికి వీల్లేదు' అన్నాడు.

లింగ్‌టాన్ అనాలోచితంగా 'కంటిమాదిగా' అన్నాడు.

తన చిన్నతనంనుంచీ ఆ కుంటలోని చేపలుతింటున్నాడు అందుచేత అలాఅన్నాడు.

'మీదంటూ ఏమీలేదు. మీ గ్రామప్రజలకు మేము మిమ్మల్ని జయించామని ఎన్నటికీ అర్థంకాదేమిటి ?' అని గద్దించాడు ఆ శత్రువు.

లింగ్‌టాన్ శిరమెత్తి చూచాడు. ప్రాణం కాపాడుకోవడంకోసమని పెదవులుబిగించుకున్నాడు. కాని అతనికళ్లు,

'లేదు, మేము జయింపబడినామని ఎన్నటికి అంగీకరించం' అని చెబుతూనేఉన్నాయి.

శత్రువు బిగ్గరగా 'నిన్ను రిజష్టర్ చేసుకున్నాం. నిన్నూ, నీభార్యను, నీపందులనూ, చేపలను, దున్నపోతులనూ అన్నిటినీ రిజిష్టర్ చేసుకున్నాం. మేము చెప్పినట్టు చేస్తే నీవు శాంతంగా ఉండగలవు' అన్నాడు. లింగ్‌టాన్ మాట్లాడలేదు. అలాగే నిల్చున్నాడు.

తరువాత వాళ్లు వెళ్ళిపోయారు. ప్రతిపొలంలో ఆగి ఇలాగే వ్రాసుకుపోయారు.

లింగ్‌టాన్ వారు వెళ్ళిపోయిన తరువాతకాని, ఇంటికి వెళ్ళలేదు. ఏమీ జరగనట్టుగానే ఇంట్లో కన్నం త్రవ్వడం సాగించాడు. కాని అతనిహృదయంమాత్రం ఎంతో బరువుగా ఉన్నది. వాళ్లు వెళ్ళిపోయిన తరువాత గ్రామస్థులందరూ తోటలోచేరి 'ఇంత నిరంకుశత్వాన్ని మన జన్మల్లో ఎన్నడూ చూశ్ళేదు' అనుకున్నారు.

'భరించగలిగితే భరించాలి. లేనిపక్షంలో ఏదోఒక మార్గం వెదుక్కోవాలి' అన్నాడు లింగ్‌టాన్.

అతని రెండవకొడుకు వస్తున్నాడని తెలిసి, లింగ్‌టాన్ హృదయం ఆనందంతో నిండింది. గ్రామస్థులందరూ అతను తమకు నాయకుడు కాగలడనుకున్నారు.

వివిక్తంగా, నిశ్చలంగా ఉన్న వసారాలో కూచుని, లింగ్‌టాన్, అతని భార్య భోజనం ముగించారు

ఆసంవత్సరం వేసవి ఎంతో దీర్ఘంగా గడవసాగింది. లింగ్‌టాన్, అతనిభార్య కొడుకుకోసం వేచిఉన్నారు. ఇంకా

వారు త్రవ్వుతున్న గుంట పూర్తికాలేదు. రోజూ వీధిలోకివెళ్ళి, రెండవకొడుకు రాకకోసం ఎదురుచూచేవారు. రాత్రిలంతా మేల్కొనేవారు. అప్పుడప్పుడూ శత్రుదళాలు గ్రామానికి వచ్చివెడుతున్నవి. ఒక్కోసారి ఇళ్ళకుకూడా వచ్చేవారు. లింగ్‌సా విగ్రహంలా నిశ్చలంగాకూచుని వణుక్కుంటూండేది. వారేదైనా మాట్లాడితే చెవిటిదానివలె నటించేది. జుట్టు దువ్వుకునేదికాదు. ముఖం కడుక్కునేదికాదు. ఎండవేడిమికి ఆమెశరీరం పూర్తిగా నల్లబడిపోయింది.

'ఎంత విరూపంగాఉంటే అంత క్షేమం'అనుకునేది.

కన్నం రోజూ త్రవ్వుతూనేఉన్నారు. జేద్, ఆమె బిడ్డ పట్టేటంత పెద్దదైంది కన్నం.

వేసవి గడిచిపోయింది. ఎండలు తగ్గాయి. ఏనాడయినా కొడుకు రావచ్చు ననుకుంటున్నారు.

ఒకనాటిరాత్రి వారు వేచిఉన్నక్షణం దగ్గరికివచ్చింది. అర్ధరాత్రికావచ్చేసరికి వారు నిద్రమేల్కొనవలసివచ్చింది. మెల్లగా ఎవరో తలుపుతట్టుతున్నశబ్దం వినిపించింది.లింగ్‌టాన్ లేచి తలుపుతీయబోయాడు. కాని లింగ్‌సా అతన్ని ఆపి, 'ఆగు. ముందు దీపం ఆర్పనీ. ఆ వచ్చినవారు మనవాళ్ళు కాకపోతే, మనం తప్పించుకోవచ్చు. వాళ్ళైఅయితే వాళ్లు ఎవరికి కనుపించకుండాఉంటారు'అన్నది.

ఆమె సద్యఃస్ఫూర్తికి లింగ్‌టాన్ మళ్ళి ఆశ్చర్యపోయాడు. ఆమె దీపం ఆర్పినతరువాత తలుపుతెరిచాడు. మసకమసకగాఉన్న నక్షత్రకాంతిలో ఇద్దరి ఆకారాలు కనుపించాయి.

'నాన్నా'!—

అది అతని రెండో కుమారునికంఠం. లింగ్‌టాక్, అతని భార్య ఆ కంఠస్వరం విన్నారు. వెంటనే పరుగెత్తుకునివచ్చి వారిని కౌగలించుకుని లోనికి తీసుకెళ్ళారు. తలుపులుమూసి, లింగ్‌సా దీపంవెలిగించింది. ఆ దీపపుకాంతిలో లాయ్‌ఎర్‌ను జేద్‌ను చూచారు. ఇద్దరూ పురుషుల్లాఉన్నారు. జేద్ తన జుట్టు కత్తిరించుకుంది. పురుషులు ధరించేదుస్తులు ధరించింది. కాళ్ళకు కడియాలువగైరా ఏమీలేవు. మగవారువాడే గడ్డి చెప్పులున్నాయి. ముఖం సన్నగా గోధుమవన్నెగా ఉన్నది. అందుచేత ఆమెను రోడ్డుమీద ఎవరైనాచూస్తే మగవాడనే భావిస్తారు. ఆమెనూ ఒక రైతుకుర్రవా డనుకోవచ్చు. లింగ్‌సా మనుమణ్ణిచూడాలని అలమటించిపోతోంది.

'నా మనుమడు యేడీ? నా చిన్నినాన్న ఎక్కడున్నాడు?' అని అరిచింది.

జేద్ నవ్వుతూ తన వీపునఉన్నబరువు దించింది. ఆ బుట్టలో ఉన్నాడు పసివాడు. లింగ్‌సా మనస్సులో అప్పుడు మనుమని ఆలోచనతప్ప మరేఆలోచనాలేదు ఆమె ముఖమంతా వణికిపోతోంది. ఏడుపు, కన్నీళ్ళు, చెమట ఆమె ముఖాన్ని తడిపేశాయి. పిల్లవాని శరీరమంతా తడివిచూచింది.

'నే నెలా ఊహించానో అచ్చంగా అలాగేఉన్నాడు' అన్నది. భుజంమీద వాల్చుకుని, ఉయ్యాలఊపినట్లు ఆడించసాగింది. 'ఎంత హాయిగాఉంది! ఎంతహాయిగాఉంది!'అన్నది.

ఇతరులందరూ మాటరానంత సంతోషంతో ఆమె చుట్టూ నిల్చున్నారు. అందరికళ్ళలోను నీళ్ళు హృదయాల్లో

ఆనందంతోకూడుకున్న వేదనా నిండిఉన్నాయి. ఇలాంటి ఆనందంలో కొంత దుఃఖంకూడా మిళితమై ఉంటుంది. మొదట దుఃఖం అనుభవించినవారుకాని ఆనందాన్ని- అమితానందాన్ని అనుభవించలేరు. జేద్ ఈ శిశువును ఎన్నో కష్టాలలోకన్నది. అందుచేత ఆ శిశువుపట్ల జేద్‌కు మమత్వంహెచ్చు. జేద్‌కు అసలు ఇంటికి తిరిగిరావాలనేలేదు. పశ్చిమానికి వెడదామన్నది. ఈ విషయాన్నిగురించి ఆమె, ఆమెభర్త తీవ్రంగావాదించుకున్నారు. తల్లి తండ్రులు వ్రాసిన ఉత్తరాన్ననుసరించి ఇంటికి వెడదామన్నాడు భర్త. ఆ ఉత్తరం వారికెంతో ఆలస్యంగా చేరింది. మొట్టమొదట ఆ జాబును తీసుకున్నకుర్రవాణ్ణి శత్రువులు కాల్చారు. అతను కొనఊపిరితో ఉండి తనదగ్గరఉన్న జాబులన్నీ మరొకరిద్వారా పంపించాడు.

ఆ ఉత్తరాన్ని చదివినప్పుడు జేన్ అనంగీకార సూచకంగా తలఊపింది. 'మనం యువకులం. ముందుకు వెళ్లాలికాని, వెనక్కు వెళ్ళకూడదు' అన్నది. 'శిశువు కోసం ఆఊరు వదిలి వచ్చాం. మళ్ళీ శిశువును అక్కడికే తీసుకెళ్ళడమా?' అన్నది.

కాని లాయ్‌ఎక్ 'మనం వదిలివచ్చినప్పుడు మా అన్న అక్కడేఉన్నాడు. చిన్నవాడుకూడా ఉన్నాడు. అప్పుడు మన విషయం మనంచూచుకోడానికి వీలుండేది—ఇప్పుడు వాళ్ళు లేరు. ముసలివారు ఒంటరిగాఉన్నారు. ఇప్పుడు మనం వారిని వదిలేస్తే మనకొడుకుమాత్రం పెద్దతనంలో మనల్ని వదిలెయ్యడూ? మనమిప్పుడు చెడుచేస్తే మనకు మంచికలగదు' అన్నాడు.

ఇదంతా విన్నతరువాత జేద్ ఒప్పుకున్నది. తరువాత వారు తిరుగుప్రయాణమయ్యారు. కాని ఆమెకు అంతగా ఇష్టంలేదు. తనకూ ఈ కుటుంబానికీ ఇంత అవినాభావ సంబంధం ఉన్నదని గ్రహించడం ఇదే మొట్టమొదటిసారి. ఆమె శిశువు అందరిశిశువని ఆమెగ్రహించింది. అందుచేతనే ఆమె ఇతరఅసూయాపరులైన స్త్రీలలాగా లింగ్‌సా చేతుల్లోనుంచితన శిశువును లాక్కోలేదు. లింగ్‌సాను ఇష్టమైనంతసేపు ఎత్తుకో నిచ్చింది. తను ఆరాధించినశిశువును ఇతరులు ఆరాధించడం చూచి ఆనందిస్తూ నిల్చుంది.

ఆ శిశువు జన్మించిననాటినుంచీ ఎన్నెన్నో విచిత్ర నూతనముఖాలను చూచాడు. అందుచేత ఆశిశువుకు ఎవరన్నా భయంకాని, క్రొత్తకాని లేవు. అతన్ని ఈ ముసలిస్త్రీకంటె బాగా ఇంతవరకూ ఎవరూ లాలించలేదు. ఆ పగలంతా శిశువు నిద్రించాడు. కడుపునిండా తల్లిపాలు తాగాడు. వాడి ఏడుపుతో ఇల్లుచేరకుండా జేద్ వాడిని ఆరోజంతా బాగా పోషించింది. అందుకని వాడు నవ్వుతూ వచ్చాడు. లింగ్‌సా వాణ్ణి మోకాళ్ళమీద కూచోబెట్టుకుని, తను వాడి ముఖం చూడడానికై లింగ్‌టాన్‌ను దీపం ఎత్త మన్నప్పుడు వాడు ఎంతో సంతోషంతో నవ్వుతున్నాడు. లింగ్‌సాకోటుగుండీ లాగాడు. లింగ్‌సా ఏడుస్తూనే కన్నీళ్ళతో నవ్వింది. ఆమె కన్నీళ్ళకూ నవ్వుకూ మధ్య మాట్లాడలేక పోయింది. లింగ్‌టాన్ ఆమెకు ఊపిరిసలపడం లేదనుకుని 'జాగ్రత్త ముసలిదానా! నీ గుండెను కాపాడుకో. దానికి లంగరుతప్పినట్టుంది. మితిమించిన దుఃఖంలాగానే మితిమించిన

సౌఖ్యంకూడా చేటుకలిగిస్తుంది' అన్నాడు. ఇలా అంటూ ఆమెచేతిలోనుంచి శిశువును తీసుకున్నాడు. జేద్‌ను కొద్దిగా టీ కలిపి ఇమ్మన్నాడు. లింగ్‌సా ఆ టీ తాగుతూ, కళ్ళనీళ్లు తుడుచుకుంది. అప్పటికి కుదుట పడింది లింగ్‌సా. అప్పుడుకాని లింగ్‌టాను మళ్ళీ కుర్రవాణ్ని లింగ్‌సాకు ఇచ్చాడుకాదు. లింగ్‌టానుకుకూడా మనుమడంటే ఎంతో ఇష్టమైంది. ఆ శిశువు చిన్నశరీరంకూడా తండ్రిశరీరంలాగ బలంగానేవున్నది

'వీడు సామాన్యమైనబిడ్డ కాదు. వీడిముఖం చూడు, ఎంతచదరంగా ఉన్నదో!'అన్నాడు. తండ్రి ఈమాట అనగానే లాయ్‌ఎర్ జేద్‌వంక గర్వంతో చూచాడు. జేద్‌కూడా సగర్వంగా చూచింది.

'మనకుటుంబం ఇలా సాగిపోతూంటే, ఇక శత్రువులు మనల నేంచెయ్యగలరు?' అన్నాడు లింగ్‌టాన్. ఆ శిశువు ఆ కుటుంబంలో ఒక కొత్తధైర్యాన్ని నెలకొల్పాడు.

ఇదంతా అయినతరువాత అంతా లేచారు. లింగ్‌సా పిల్లవాణ్ణి చంకలోపెట్టుకుని లేచింది. జేద్ భోజనం వెచ్చబెట్టింది. లింగ్‌టాన్ కూచుని పైప్‌వెలిగించాడు. కొడుకును కూడా కూచోమన్నాడు. వెళ్ళిననాటినుంచి జరిగిన వివరాలు చెప్పమన్నాడు. తరువాత అందరూ కలిసి భోజనానికి కూచున్నారు.

ఒకచిన్న విషయంలో - వారిఆనందానికి భంగం కలిగింది. లింగ్‌సా తనఎంగిలి మనుమడినోట్లో పెట్టబోయింది. జేద్ అభ్యంతరం చెప్పింది. 'నామీద కోపగించుకోకండి అత్తయ్యా. కాని మీఎంగిలిమాత్రం అబ్బాయినోట్లో పెట్ట

కండి'అన్నది. జేద్ ఈమాట మృదువుగానే చెప్పింది. కాని లింగ్‌సా స్తబ్ధురాలైంది

'నా కొడుకులకు నా ఎంగిలి పెట్టినా వారి కేలాంటి అపాయమూ కలుగలేదే' అన్నది కోపంతో.

'కాని ఈ రోజుల్లో అది మంచిదికాదని భావిస్తున్నారు. నేను నది కావలఉన్న నగరంలో ఒక పుస్తకం కొన్నాను. ఆ పుస్తకంలో శిశువులను ఎలాపోషించాలో వ్రాయబడింది. ఎంగిలి మంచిదికాదని ఆ పుస్తకంలో ఉన్నది' అన్నది జేద్ ధైర్యంగా.

లింగ్‌సాకు కోపంవచ్చింది. కాని లింగ్‌టాను ఆమెను చల్లబరిచాడు. 'మనం పోట్లాడుకోడానికి ఇదేనా సమయం?' అన్నాడు. లింగ్‌సా కోపం చల్లార్చుకున్నది. కాని ఆ విష యాన్ని గురించే ఆలోచించ సాగింది. 'శిశువులకు పుస్తకాలు పోషిస్తాయా? నేనే పుస్తకాలు కొని, నా పిల్లలను పోషించు కున్నాను' అనుకున్నది.

మరునాటి ఉదయాన లింగ్‌టాన్ తనకొడుక్కు, జేద్‌కు పొయ్యి పక్కన తవ్విన కన్నాన్ని చూపించాడు.

'మీరు శత్రువులచే రిజిష్టర్ చెయ్యబడలేదు వాళ్లకు మీరు బ్రతికిఉన్నారనే తెలియదు'అన్నాడు. తనకు పిల్లా జల్లా లేనట్టు తను అబద్ధమాడినవిషయం చెప్పాడు.

'మంచిపనిచేశావు. మేము కొండలలో కొన్ని ప్లానులు వేసుకున్నాం. నాపేరు ఎక్కడా ఉండకపోవడం మంచిది' అన్నాడు కొడుకు.

అతను చెప్పింది లింగ్‌టాన్‌కు అర్థంకాలేదు. కాని చాలా బడలికగా ఉన్నకారణంగా ఆ విషయం మరునాడు అడగవచ్చుననుకున్నాడు.

లాయ్‌ఎక్, జేద్ తను పాతగదిలో ప్రక్కప్రక్కన పడుకున్నారు. వారెంతో అలసిఉన్నారు. సరిగా నిద్రపట్టడం లేదు. ఎంతోదూరం నడిచివచ్చారు. వారు స్వాతంత్ర్యంకోసం వెళ్ళారు. మళ్ళీ స్వాతంత్ర్యంలేనిచోటుకు వచ్చారు. బహుశా మళ్ళీ వారిజీవితంలో స్వేచ్ఛ ఉండకపోవచ్చు.

'మనలోమనం స్వేచ్ఛగాఉండడం నేర్చుకోవాలి' అన్నాడు లాయ్‌ఎక్.

ఆరాత్రి అతను నిద్రపోలేదు. జేద్‌తోకూడాఎక్కువగా మాట్లాడలేదు అతను కళ్ళారా ఎన్నోకష్టాలు, మృత్యువులు చూచాడు అతను, జేద్ రాత్రుల్లు నడిచివెళ్ళి, అలాగే వచ్చారు. కొండలలో నివసించేవారు వారి కెంతో సహాయం చేశారు.

లాయ్‌ఎక్ వారిని వదలివస్తూ, తనతల్లిదండ్రులు ఇంట్లో ఒంటరిగా ఉన్నారనీ వారికోసం తనువెళ్ళవలసినఅవసరం ఉన్నదనీ, వారిపథకాలకు తనశాయశక్తులా సహాయంచెయ్య గలననీ చెప్పాడు.

పొయ్యివెనక కన్నం త్రవ్వినందుకు తనతల్లిదండ్రులను ఎంతో ప్రశంసించాడు. జేద్‌తో 'మన మా కన్నాన్ని మరింత పదిలంగా త్రవ్వి, ఒక చిన్నకోటలా తయారు చెయ్యాలి. మనకేకాక మన వస్తువులనుకూడా దాచగలంత పెద్దదిగా చెయ్యాలి'అన్నాడు.'ఆ పనినేనుచేస్తాను'అన్నది జేద్.

"నేనూ మొట్టమొదట ఆపనే ప్రారంభిస్తాను. తరువాత ఈ విషయం కొంతకాల్లో వారికి తెలుపుతాను' అన్నాడు లాంఘ్‌ఎక్. జేవ్ పిల్లవాణ్ణి రొమ్ములమీాద నిద్రించింది. కాని లాంఘ్‌ఎక్‌కు ఇంకా నిద్రపట్టలేదు. తనతండ్రి నగరాన్ని గురించి చెప్పిన భయానక విషయాలన్నీ జ్ఞాపకానికి వస్తున్నాయి—జరిగినహత్యలు — మానభంగాలు—అన్నీను. ఆ రాత్రి అతను శత్రువును ప్రతిఘటించితీరుతానని ప్రతిజ్ఞ తీసుకున్నాడు. తనతరువాత తనపిల్లలచేత పోరాటం కొనసాగింపచేస్తానని ప్రతిజ్ఞతీసుకున్నాడు. అప్పుడుకాని అతనికి నిద్రపట్టలేదు.

లాంఘ్‌ఎక్ విన్న అన్నివిషయాలలోకి వూలిన్ శత్రుపక్షం వహించాడన్నవిషయం అతని కెక్కువకోపాన్ని కలిగించింది.

'అట్టివారు దేశద్రోహులు. మనం శత్రువును వెళ్ళగొట్టినప్పుడు వారు శత్రువులతో వెళ్ళనైనావెళ్ళాలి, లేదా వారు చంపివెయ్యబడాలి' అన్నాడు తండ్రితో.

'అతను దేశద్రోహి అనుకోను. తనలాభాలు తను చూచుకునేమనిషి. కుక్క కుందేటిని వాసనపట్టినట్టు లాభాలు వాసనపడతాడు. లాభాలకోసం దేన్నీ లెక్కచెయ్యడు' అన్నాడు తండ్రి.

కాని ఈ మాటలు లాంఘ్‌ఎక్‌కు నచ్చలేదు 'ఈ రోజుల్లో ప్రతిస్వార్థపరుడూ దేశద్రోహే' అన్నాడు. లింగ్‌టాన్ సమాధానం చెప్పలేదు. కొడుకుచెప్పినమాటలు వినయంగా విన్నాడు. లింగ్‌టాన్ సహజంగా సాధువు. ఈ రోజులో

యువకులఅభిప్రాయాలే సరైనఅభిప్రాయాలు కావచ్చు' అనుకున్నాడు.

లాయ్ఎర్ 'నాన్నా! మనం మొదట కన్నాన్ని పూర్తిచేద్దాం. ఒక మంచిగదిగా తయారుచేద్దాం. మనం ఉండొచ్చు. ఎవరినైనా దాచవచ్చుకూడాను' అన్నాడు.

'ఇంకెవర్ని?'

'కొండల్లో ఉన్నవారితో మనం నేస్తం కలపాలి. ఒక్కో-సారి వారిని మనం దాచవలసివస్తుంది.'

లింగ్టాన్ ఈ మాటకు సమాధానం చెప్పలేదు. అతని కొడుకులిద్దరూ కొండల్లో నివసిస్తున్నప్పుడు సమాధానం ఎలా చెప్పగలడు?

ఒకనాటిరాత్రి బాగా ఆలోచించినమీదట, లింగ్టాన్ తనకుమారుని బహిరంగంగా టీదుకాణానికి తీసుకెళ్ళాడు. అందరూ అతనికి స్వాగతం చెప్పినతరువాత లింగ్టాన్ లేచి, 'ఈ నా కుమారుడు ఎన్నోవిషయాలు చూచివచ్చాడు. మీరుకోరినపక్షంలో మీకు చెప్పగలడు' అన్నాడు. అందరూ కరతాళధ్వనులు చేశారు. తరువాత లాయ్ఎర్ లేచి నిగర్వంగా తన అనుభవాలన్నీ చెప్పనారంభించాడు. తను ఎలా వేలమైళ్ళు ప్రయాణంచేసినదీ, ప్రతిచోటా ప్రజలందరూ శత్రువుతో పోరాడడానికి ఎలా ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నదీ, ప్రతిఘటిస్తున్నదీ చెప్పాడు.

'స్వార్థపరులు, స్వంత లాభాలు చూచుకునేవారు, బలహీనులు మాత్రమే శత్రువును ప్రతిఘటించడానికి వ్యతిరేకంగాఉన్నారు. అలాంటివారు దేశద్రోహులే' అన్నాడు.

అందరూ కరతాళధ్వనులుగావించారు. ఒకరి ముఖా లొకరు చూచుకుని, అతను చెప్పినది ఎంతో సబబుగాఉన్నదని తలలు పంకించారు. 'స్వతంత్రదేశంలో శత్రువులతో పోరాడు తున్న వారితో మనంకూడా కలవాలి. ఎలా కలవాలి అని మీరడగవచ్చు. కొండల్లో పనిచేస్తున్న తొమ్మిదివేలమందితో రహస్యంగా పనిచెయ్యడంద్వారానే కలవగలం' అన్నాడు.

ఆ గదిలోఉన్న ప్రతివారూ అంగీకారసూచకంగా చేతులెత్తారు. తరువాత లాయ్‌ఎర్, 'దీనిఅర్థం మీరు గ్రహించాలి. దీనిఅర్థం మన బియ్యాన్ని, మన పంటను మనం దాచుకోవాలని; శత్రువులకు దక్కేటట్లు చెయ్యకూడదని. శత్రువులను కనుపించని తుపాకులకు ఎరచెయ్యాలి' అన్నాడు.

వారు ఇదంతా నిశ్శబ్దంగా విన్నారు.

'కాని మనకు తుపాకులులేవుకదా!' అన్నది ఒకగొంతు.

'తుపాకులు ఎలావస్తాయో నాకు తెలుసు. ప్రతిమనిషికీ ఒకతుపాకి ఉంటుంది' అన్నాడు లాయ్‌ఎర్.

ఈ మాటవినడంతోటే అందరూ ఒక్కమాటుగా నిశ్వసించారు. అందరిహృదయాల్లోను ఒకఆనందతరంగం లేచింది.

లింగ్‌టాన్‌హృదయం గర్వాతిరేకంచే పొంగిపోయింది.

'ఈ కొడుకును మళ్ళీ ఇంటికితీసుకురావడం నేను నా జీవితంలోకల్లా చేసిన ఉత్తమకార్యం' అనుకున్నాడు.

తరువాత గ్రామప్రజలు తుపాకులకోసం వేచిఉన్నారు. లాయ్‌ఎర్ నేలగది పూర్తిగావించడంలో నిమగ్నుడైనాడు.

ఇప్పుడతను ఒంటరిగా పనిచెయ్యడంలేదు. గ్రామస్థులు పరస్పరం ఎంతో సహకారంతో మెలగడం గమనించి, వారిలో

కొందరిని తనకు సహాయులుగా ఎన్నుకున్నాడు. అతను అనుకోనంతత్వరలో గని పూర్తిఅయింది.

నలుగురుబలశాలులూ కలిసి త్రివ్వసాగారు. మరొక రహస్యద్వారంకూడా ఏర్పరిచారు.

కొంతదూరం త్రవ్వేసరికి లాయ్‌ఎక్‌కు భూగర్భనది కనుపిస్తుందేమోనని భయమేసింది. కాని ఒక చిన్న జల కన్పించింది. ఆ జలను వెదురుగొట్టాలద్వారా బావిలోకి మళ్ళించాడు. తరువాత ఒక ఇత్తడిపెట్టె కనుపించింది. ఆ పెట్టెలో ముత్యాలుపొదిగిన పాతపిన్నులు, బరువైనబంగారపు అంటుజోళ్ళు ఉన్నాయి. అలాంటివి పీ రెవ్వరూ చూడలేదు.

'ఇవి మా పూర్వులవి వీటినిస్పృశించడానికి మనకు అర్హతలేదు'అన్నాడు లింగ్‌టాన్. భక్తిగౌరవాలతో వాటిని తీసుకెళ్ళి మళ్ళీ గదిగోడలో పూడ్చిపెట్టాడు.

క్రిందిగని ఎంతో పెద్దదిగా, బలంగా కట్టారు.

గదిపూర్తికాగానే, లాయ్‌ఎక్ 'మనతుపాకులు దాచడానికి గది ఏర్పడింది'అన్నాడు.

రహస్యపుగది పూర్తిఅయిననాటిఉదయం తెల్లవారకమునుపే మేల్కొని, అన్నం మూటకట్టుకుని కొండలవైపుకు వెళ్ళాడు.

# 11

ఆ సంవత్సరం వరిపంట కోతకురాగానే ఎంతపండేది అంచనావేసి, నిర్ణీతధరకుమాత్రమే రైతులు అమ్మవలెనని చెప్పడానికి, ప్రతిఊరికీ శత్రువులు కొందరుమనుష్యులను పంపారు. ధర చాలా తక్కువగావున్నది. లింగ్‌టాన్, ఇతర రైతులు శత్రువులఆజ్ఞలను ప్రశాంతంగా విన్నారు. శత్రువులఆజ్ఞలను ఇలా మౌనంగావినడం వారు అలవాటుచేసుకున్నారు.

శత్రువులు మాట్లాడుతున్నప్పుడు లోనుంచి పొంగి వస్తున్నకోపాన్ని, ద్వేషాన్ని ఎంతోయత్నంతో అణుచుకునేవారు. రైతు ఎలాటివిషయాన్నయినా భరిస్తాడుకాని, తన భూమికి, తనపంటకు, అన్యాయంజరుగుతూంటే సహించలేడు. పంటలే అతని జీవితం. పంటపోతే మరి అతనిజీవితం ఏముంది?

శత్రువులుమాట్లాడుతూంటే లింగ్‌టాన్, అతనిసహచరులూ మౌనంగా తలలువంచుకుని నిల్చున్నారు. శత్రువులు వెళ్ళిపోయినతరువాత ధాన్యాన్ని ఎలాదాచవలెనో ఆలోచించసాగారు. అందరూకలిసి త్వరత్వరగా కోతలుకోయడం మొదలెట్టారు. రాత్రిలందే రహస్యంగా నూర్చారు. లింగ్‌టాన్ ఇంట్లో రహస్యపుగది కట్టినట్టుగానే, ఇతరులుకూడా రహస్యపుగదులు కట్టారు. కొందరు కొండల్లోనివసించేబంధువుల ఇండ్లకు తమధాన్యాన్ని తోలారు.

చేపలచట్టం అమలులోపెట్టబడింది. కొలనుల్లో, చెరువుల్లోఉండే చేపలన్నిటిపైన అధికారం శత్రువులదే. ప్రతి

రోజూ శత్రువులు గ్రామానికి వచ్చిపోతున్నారు. గ్రామస్థు లంతా వారిని 'దెయ్యాలు, దెయ్యాలు' అని పిలిచేవారు. వారురావడం కిటికీలోనుంచిచూచి, లింగ్‌సా వెంటనే కోడలికి చెప్పేది. జేద్ బిడ్డనుతీసుకువెళ్ళి రహస్యపుగదిలో దాక్కునేది. జేద్ లోపలికివెళ్ళగానే, లింగ్‌సా తలుపుమూసి పైన గడ్డిపరిచేది. అందుచే అక్కడ రహస్యపుగది ఉన్నదనికూడా ఎవరికీ తెలిసేదికాదు. వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత జేద్ బైటికివచ్చేది. కాని శిశువును అక్కడే ఉంచేది.

బిడ్డను గురించి ఊళ్ళో అందరూ విన్నారు. రోజూ స్త్రీలందరూవచ్చి, ఎత్తుకుని ముద్దాడి వెళ్ళేవారు. జ్ఞాతిభార్య కూడా వచ్చి చూచింది. ఆమెకూడా బిడ్డను మెచ్చుకున్నది. కాని ఆమెలో కొద్దిగా అసూయపొడచూపింది. ఆ కుర్రివాడి అందచందాలు చూచిన తరువాత రెండురోజుల వరకు ఆమె అసూయతో నిద్రపోలేదు. ఒకనాడు ఆమె జేద్ బిడ్డకుపాలిస్తూ ఉండగాచూచి, ఆమెకు కన్నుకుట్టింది. 'ఇంత మంచి బిడ్డ ఉండడం మంచిదికాదు. ఇలాంటిబిడ్డలు ఎక్కువకాలం బ్రతకరు. నా చనిపోయిన బిడ్డ ఇలాగే ఉండేవాడు' అన్నది.

ఈ మాటలు భరించలేక లింగ్‌సా ఆమెమీద మండిపడింది. 'అవేంమాటలు? నువు బిడ్డనుకనినప్పుడు నే నున్నాను. నీ బిడ్డ ఎప్పుడూ అశుద్ధంలో పొర్లుతూండేవాడు' అన్నది.

'నా బిడ్డ సంగతి నా కంటె ఎక్కువ తెలిసినట్టు మాట్లాడుతున్నావే' అన్నది బంధువుభార్య.

జేద్‌కు కోపంవచ్చింది. 'నా జీవితం నాకు సంతృప్తికరంగానే ఉన్నది' అన్నది. బంధువుభార్య వెళ్ళిపోయింది.

జేద్‌కు, లింగ్‌సాకు ఆమెపై కోపం వచ్చింది. ఎన్నడూ బిడ్డను ఆమెను ఎత్తుకోడానికి ఇవ్వకూడదనుకున్నారు.

బంధువుభార్య ఇంటికపోయి తనకొడుక్కు జేద్‌ను పెళ్ళిచెయ్యనందుకు భర్తను తిట్టింది.

ఆమెతిట్లు భరించలేక, ఆ వృద్ధుడు పైటకవెళ్ళి, తల గోడకుబాదుకున్నాడు. లింగ్‌టాన్ ఈ దృశ్యంచూచి, అతన్ని రక్షించడానికి వెళ్ళాడు.

విషయమంతా విన్నతరువాత ఇంటిపోటేసి వ్యక్తి నవ్వినట్లు నవ్వాడు. తరువాత తనబంధువును టీదుకాణానికి తీసుకెళ్ళి, టీ, బిస్కట్లు తెప్పించి, అనేకశాస్త్రాలు చెప్పుకున్నాడు.

అంతానివిని, 'ఈసారి భార్య గయ్యాళిగా ప్రవర్తిస్తే ఉంపుడుగత్తెను తెచ్చుకుంటానని భయపెట్టు' అని సలహా చెప్పాడు లింగ్‌టాన్.

'కాని అలాచెయ్యగలనా? నాకు కావలసింది శాంతి ఒక్కటే' అన్నాడు.

'శాంతి కోరితే రాదు. శాంతికోసం వెదకాలి. శాంతి కోసం ప్రయత్నించాలి. ఒక్కొక్కసారి ఒకగృహంలో కాని, ఒకజాతి చరిత్రలో కాని శాంతికోసం పోరాడవలసి ఉంటుంది కూడాను' అన్నాడు లింగ్‌టాన్.

ముసలి పండితుడు నిశ్వసించి 'నేను చదువునేర్చిన వాణ్ణి. కాని నాకు స్త్రీకున్న బలం ఉండాలంటే ఎలా ఉంటుంది? ప్రపంచంలోకల్లా ఎక్కువ బలంగలది స్త్రీ. స్త్రీకి స్వేచ్ఛ ఇవ్వకూడదన్నాడు కాన్‌ఫ్యూషియస్. మనశాస్త్రాలు పురుషు

లైనందున మనం బ్రతికిపోయాం స్త్రీలయితే ఇహ మనగతి ఏంచెప్పాలి?' అన్నాడు.

ఈ మాట వినేసరికి లింగ్‌టాన్‌కు నవ్వు ఆపుకోవడం ఎంతో కష్టమైంది. 'నువ్వు చెప్పేది నిజమే. కాని నేనైతే అలాంటి స్త్రీని ఎముకలు విరగపొడిచేవాణ్ణి' అన్నాడు.

'అయితే ఒక్కనారి బొక్కవిరగపొడువు బాబూ!' అన్నాడు ముసలాయన.

'నేను కాదు, నువ్వే. స్త్రీని అనుభవించాలి. అవసరమయితే ఒళ్ళువిరగ్గొట్టాలి' అన్నాడు లింగ్‌టాన్.

లింగ్‌టాన్ పొలాల్లో ధాన్యంనూర్పిడం ముగిసింది. ఒకనాడు అర్ధరాత్రి తలుపుకొట్టిన చప్పుడైంది. లింగ్‌టాన్ ఆ చప్పుడు గుర్తుపట్టగలిగాడు. లేచి తలుపుదగ్గరికి వెళ్ళాడు.

'నేను నాన్నా' అని రెండోకొడుకుకంఠధ్వని వినిపించింది. లింగ్‌టాన్ తలుపు తెరిచాడు. రెండోకొడుకుతో మిగతాయిద్దరుకొడుకులుకూడా వచ్చారు. ముగ్గురుకొడుకులనూ లోపలికి తీసుకెళ్ళాడు. మూడోకొడుకు దొంగల గుంపులో చేరనందుకు అతని కెంతో సంతోషంకలిగింది. ముగ్గురుకొడుకులూ ఎంతో బలంగావున్నారు. వాళ్ళకళ్ళల్లో నిర్భీతి కన్పిస్తోంది.

'ఈ కొండలలోనివారు ఎంతో మంచివారు' అన్నాడు లింగ్‌టాన్ మూడోకొడుకుతో.

'పిశాచాలతో యుద్ధం చేసేవారితోనే నేను కలిసి ఉన్నాను' అన్నాడు చిన్నకొడుకు - 'నాకు ఆకలిగాఉంది. వెళ్ళేలోగా అమ్మను అన్నంపెట్టమను' అన్నాడు.

'అప్పుడే వెళ్ళిపోవాలా?' అన్నాడు లింగ్‌టాన్.

'తెల్లవారేలోగా మళ్ళీ కొండలదాపుల్లో ఉండాలి' అన్నాడు కొడుకు.

లింగ్‌టాన్ వారిని రహస్యపుగదిలోకి తీసుకెళ్ళాడు. కొడుకులు తమ భుజాలమీదున్న బరువులు దించారు. అవి తుపాకులు. ఒక్కొక్క కొడుకు ఒక్కొక్కడజను తుపాకులు తెచ్చారు. ఇలాంటితుపాకులను లింగ్‌టాన్ అదివరకెన్నడూ చూడలేదు. విదేశపుతుపాకుల్లా ఉన్నాయి. ఒకతుపాకిని తీసుకుని చూచాడు.

'ఈ తుపాకులు ఎక్కడ తెచ్చారు?' అని అడిగాడు.

చిన్నకొడుకు నవ్వుతూ 'శత్రువులవద్ద లాక్కున్నాం' అన్నాడు.

తరువాత లింగ్‌టాన్ వెళ్ళి లింగ్‌సాను నిద్రలేపాడు. లాయ్‌ఎర్ జేడ్‌ను నిద్రలేపాడు. అందరూ రహస్యపుగదిలో సమావేశమైనారు. అక్కడే లింగ్‌సా చిన్నకొడుక్కు భోజనం పెట్టింది. భోజనసమయంలో ఎన్నో ఆప్యాయమైనకబుర్లు చెప్పుకున్నారు. తరువాత కొడుకులు కొండల్లోకి వెళ్ళిపోయారు.

ఇన్నిరోజులుగడిచినా లింగ్‌టాన్‌కు తన పెద్దకూతురు సంగతికాని, వూలిన్ విషయంకాని తెలీలేదు. ఒకనాడు మధ్యాహ్నం భోజనాలు ముగించినతరువాత లింగ్‌సా గిన్నెలు కడుగుతూండగా వాకిట్లో చప్పుడైంది. జేడ్, లాయ్‌ఎర్ రహస్యపుగదిలోకి వెళ్ళిపోయారు. కానివాకిటివద్ద పెద్దకూతురు గొంతువిని, లింగ్‌సా సంతోషంతో, 'మీనాడ నేనే' అనిఅరిచింది.

లాంయ్ఎక్, అమ్మా! మేము ఇక్కడున్నట్టు చెప్ప కూడదు..' అని జేడ్‌తో, పిల్లవాడితో కలిసి రహస్యపు గది లోకి వెళ్ళాడు.

వెలుపల పెద్దమ్మాయి పెద్దగా కేకలుపెడుతూంది. లింగ్ టాన్ లేచివెళ్ళి తలుపు తెరిచాడు.

'మేమువచ్చాం. నిద్రపోతున్నారా ఏమిటి?' అన్నది పెద్దకూతురు.

తలుపు తెరచిచూచేసరికి లింగ్‌టాన్ తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. తన అల్లుడు వూలిన్, పెద్దకూతురూ బాగా బలిసి, మిసమిసలాడుతున్నారు. కూతురు గర్భంతో ఉన్నది. ఇద్దరు పిల్లలూ బాగా లావెక్కి ఉన్నారు. అందరూ సిల్కులు ధరించారు. వారు రిక్షాల్లోవచ్చారు. ఇద్దరు సోల్జర్లు వారివెంట ఉన్నారు.

లింగ్‌టాన్‌కు భయం, అసహ్యం కలిగాయి. కూతు రిని, అల్లుణ్ణి లోపలికి ఆహ్వానించాడు. కాని ఆ సోల్జర్లను లోనకి రానివ్వనన్నాడు.

వూలిన్ నవ్వి, 'మీ రేమీ భయపడవలసిన అవసరం లేదు. వాళ్ళు నా రక్షణకోసం వచ్చారు'అన్నాడు.

'నాఇంట్లో నీకు రక్షణ ఎందుకు?'

'వీరిని బైటఉంచడం మర్యాదగా ఉండదు'అన్నాడు వూలిన్.

'రక్షణకువచ్చిన సోల్జర్లకు మర్యాదఏమిటి?'

లింగ్‌టాన్ తలుపు తెరవనేలేదు. వూలిన్ మరి లాభం లేదనిగ్రహించి, సోల్జర్లవంకతిరిగి నవ్వుతూ, తనమామగారు

ముసలితనంలో భయంవల్ల అలా మాట్లాడుతున్నాడనీ క్షమించవలసిందనీ చెప్పాడు,

'నాకు భయంలేదు. అయినా నేను వారిని ఇంట్లోకి రానివ్వను' అన్నాడు లింగ్‌టాన్ బిగ్గరగా. స్త్రీలు లోపలికి వెళ్ళారు. లింగ్‌టాన్ రెండుపీటలు, ఒకబెంచీ తీసుకొచ్చి, బెంచి సోల్జర్లకిచ్చాడు. వూలిన్ పీటమీద కూచున్నాడు.

లింగ్‌టాన్ తనఅల్లునిలో ఎంతోమార్పు కనిపెట్టాడు. అతన్నిచూచేకొద్దీ అతనికి అసహ్యంకలుగసాగింది. 'ఇంతలావెక్కా వేమిటి?' అన్నాడు.

'నా వర్తకం బాగాసాగుతోంది' అన్నాడు వూలిన్ ముక్తసరిగా.

'అందరివ్యాపారాలూ కుంటుపడితే నీవ్యాపారం బాగా ఎలాసాగుతోంది?'

వూలిన్ ముఖంమీద, అరచేతుల్లోను కొద్దిగా చెమట పోసింది. సిల్కురుమాలుతో తుడుచుకున్నాడు. తరువాత కొంచెంముందుకువంగి, ఒకచూపు సోల్జర్లపై వుంచి, 'నేను చేసినప్రతిపనీ నా మంచికోసమే చేశానని మీరు గ్రహించాలి' అన్నాడు.

లింగ్‌టాన్ బిగ్గరగా 'ను వ్వేంచేస్తున్నావో నాకు తెలీదు' అన్నాడు.

వూలిన్ మళ్ళీ చెమటతుడుచుకుని 'విజ్ఞుడు తెరచాప లాంటివాడు.. కాలాన్నిబట్టి నడుచుకుంటాడు. మననగరంలో ఒకప్రభుత్వం ఏర్పడనున్నది. అది శత్రువులప్రభుత్వం కాదు,

మనప్రజలతో కూడినప్రభుత్వమే. ప్రస్తుతపరిస్థితుల్లో మనం లొంగివుండడమే మంచిది' అన్నాడు.

'నేను సామాన్యమైనమనిషిని. విషయం విప్పిచెబితేనే కాని నాకు అర్థంకాదు'

వూలిన్ మౌనంగా నవ్వాడు. కొంచెంసేపాగి 'ను వ్విప్పుడు ఎక్కడనివసిస్తున్నావు?' అని అడిగాడు లింగ్‌టాంగ్.

'నార్త్‌గేట్‌వీధివద్ద ఏడవఇంట్లో'

'ఆవీధిలో ఎన్నో అందమైనఇళ్లున్నాయి. నీ వక్కడ ఎలా ఉండగలుగుతున్నావు?'

'న న్నక్కడే నివసించమన్నారు' అన్నాడు వూలిన్.

'నీ దుకాణమో?'

'మళ్ళీ తెరిచాను. సాగుతూనేవుంది. ఇద్దరుగుమాస్తాలను పెట్టాను. వాళ్ళే చూస్తున్నారు.'

'ఇప్పుడేమేవస్తువులు అమ్ముతున్నారేమిటి?'

'బట్టలు వగైరా అన్నిరకాల విదేశీవస్తువులు.'

'మరి నువ్వేంచేస్తావు?'

'నేను కొత్తప్రభుత్వంకోసం పనిచేస్తున్నాను.'

'నీకు వాళ్ళు డబ్బిస్తారా?'

'బాగా డబ్బిస్తారు.'

'అయితే నువు సంతృప్తిగానే వున్నావన్నమాట?'

ఊలిన్ సమాధానంచెప్పలేదు. కాని, మెల్లని గొంతుతో, 'మామగారూ, యిప్పుడు నేను మీకు సహాయం చెయ్యడానికే వచ్చాను. మీరు ప్రస్తుతం అవలంబిస్తున్న విధానం నా కంతగా నచ్చలేదు. మీరు నేనుచెప్పినట్టు

వింటే, మీా జీవితం మరింత సుఖప్రదం అవుతుంది' అన్నాడు.

లింగ్‌టాన్‌కు పట్టరానికోపం వచ్చింది. కాని, కోపం వెలిబుచ్చడానికి అది సమయంకాదు.

'నే నేంచెయ్యాలి?' అని అడిగాడు.

'నేను చెప్పినట్టు చెయ్యి. మీా క్షేమం నేను చూస్తాను' అని కొంచెమాగి వూలిన్ యిలాచెప్పాడు—

'నేను మనదేశానికి దిగుమతిఅయ్యే వస్తువులన్నీ కంట్రోల్ చేస్తాను. బియ్యం, గోధుమ, నల్లమందు వీటన్నిటినీ చెక్ చెయ్యడం నా పని.'

'నల్లమందు!' లింగ్‌టాన్ పెద్దగా అరిచాడు.

వూలిన్‌ముఖం వివర్ణమైపోయింది. తనదుకాణంలో రోజూ ఉపయోగించేవస్తువులలో అదీ ఒకటికావడంవల్ల వూలిన్‌నోటివెంట అప్రియత్నంగా ఆ మాట వచ్చింది. నల్లమందు ఉత్తరాన్నుంచి వస్తుంది.

అన్నివస్తువుల్లోకి ముఖ్యంగా అదొక్కటే ప్రాచ్య సముద్రపజలకు పంపించబడనివస్తువు. ఒకప్పుడు దేశాన్నంతా ఆవరించిన అనర్థాలలో ఇది ఒకటి.

వూలిన్ దగ్గి 'నాకు నేనే యజమానినికాను'అన్నాడు.

లింగ్‌టాన్ సహించలేకపోయాడు. నేలమీాద రెండుసార్లు ఉమ్మేసి 'ఛీ' అన్నాడు.

లోపల లింగ్‌సా కూతురిని, 'ఈ బియ్యం, ఈమాంసం ఇవన్నీ ఎక్కడనుంచి వస్తున్నవే'అని ప్రశ్నిస్తున్నది.

పెద్దకూతురు అమాయకంగా 'ఆహారం కావలసినంత ఉన్నది. బియ్యం బస్తాలాదిగా ఉన్నై. గుడ్లు, మాంసం,

కోళ్లు, అన్నీ మాకు పుష్కలంగా తీసుకనిరాబడుతాయి' అని చెప్పింది.

'ఎవరికీ మాంసం, బియ్యం లేనప్పుడు మీకెలా వస్తున్నాయే ? శత్రువులు గ్రామాలకువచ్చి దోచుకు పోతున్నారుగా !'

'నాకీ విషయం తెలిస్తే నేను మీకోసం కొంత మాంసం వగైరా తెచ్చేదాన్ని' అన్నది కూతురు.

కూతురుఅన్నమాటకు లింగ్సా సంతోషించలేదు. పైగా 'అందరూ మాడిచస్తోంటే మనలోకొందరు ఇలా బలుపుగాఉండడం నాకిష్టంలేదు కరువురోజుల్లో కొద్దిమంది మస్తుగాతినడం మంచిదికాదు' అన్నది.

'నాకు యివ్వబడినదాన్నే నేను తింటున్నాను' అన్నది కూతురు.

'ఎవరిస్తున్నారు?'

'నా భర్త.'

'ఎలా యివ్వగలుగుతున్నాడు?'

కూతురు ఏడుస్తూ 'నీకుతెలీదు, నా భర్త యెంత మంచివాడో! కాలానికి లొంగాడుకాబట్టి, మీరందరూ ఆడి పోస్తున్నారు. నిజానికి ఆయనకూ శత్రువంటే పడదు. కాని, ఆయన వుద్దేశం అదికాదు. ఎవరికితోచినవిధంగా వారు శత్రువును ప్రతిఘటించా లంటూరు; అంతే. శత్రువు పరిపా లిస్తున్నాడు. యెలాగో ఒకలా ఆ పరిపాలనలో మనం బ్రతి కాలిగదా.' అన్నది కూతురు.

కాని, ఆ పరిపాలనలో లాయెక్కరాడదు' అన్నది లింగ్‌సా.

'మనం అన్నంతినడంమానితే శత్రువు చనిపోతాడా ఏమిటి?' అన్నది కూతురు కోపంగా. లింగ్‌సా పిల్లల్నయినా యెత్తుకోలేదు.

'మా బ్రతుకు మేము బ్రతకగలం. మీ సహాయం మాకు అక్కర్లేదులే' అన్నది.

ఈ విధంగా వారిపోట్లాట సమాప్తమైంది. కూతురు, తన పిల్లల్నితీసుకుని వెళ్ళిపోయింది.

వాళ్ళువెళ్ళిపోగానే తలుపులుమూశారు. లింగ్‌సా కన్నంలోగుండా పిలిచింది. జేద్, ఆమెభర్త వచ్చారు. సంగతులన్నీ లాయ్‌ఎర్‌కు చెప్పారు.

విన్నకొద్దీ లాయ్‌ఎర్‌కు కోపంహెచ్చింది.

ఏదోఒకవిధంగా నగరానికివెళ్ళి, నగరంలో ఏం జరుగుతున్నదో, అందరూ శత్రువులకు లొంగిపోయారేమో చూచి వద్దామనుకున్నాడు.

జేద్ పుస్తకాలు చదివిందికావడంచేత, అతన్ని మారు వేషంలో పంపించాలని, ఒక బిచ్చగానిదుస్తులు కుట్టి అతనికి బిచ్చగానివేషంవేసింది. ఎర్రిమన్ను అతనిముఖానికిపూసి, ఒకగాయంలా కనుపించేటట్టుచేసింది. మూతి వంకరగా కనుపించేటట్టుచేసింది. ఒకకన్ను గుడ్డిదిగాఉండేటట్టు చేసింది. లాయ్‌ఎర్ ఈ మారువేషంలో నగరవీధుల్లోకి వెళ్ళాడు. ముఖ్యమైనవీధులుతప్ప ఇతర వీధులన్నీ తిరిగాడు.

అక్కడివృశ్యాలు అతని కెంతో బాధకలిగించాయి. ప్రతిచోటా నల్లమందు అమ్ముతున్నారు. గృహాలన్నీ శిథిలమైనవి. ఆకలితో చనిపోతున్నవారితో వీధులన్నీ క్రిక్కిరిసివున్నాయి. ఒకప్పుడు యెంతో ఆనందంతో, ఉత్సాహంతో నిండిన నగరం శ్మశానంలా కనుపిస్తూంది. వీధులు నిశ్చలంగా నీరవంగా ఉన్నాయి. వేలమంది ప్రాణులు—నవ్వుతూ నడిచినవారు—కళ్లుమూసి, వాడిన కాడలై పడివున్నారు.

వేలవేలమంది నేలకూలిపోయారు. చక్కని సంసారాలతో కళకళలాడుతూవుండే యిండ్లు దహించబడ్డాయి, లేదా ఖాళీగావున్నాయి. ఊలిన్‌లాంటి దేశద్రోహుల దుకాణాలు తప్ప, యితరుల దుకాణాలన్నీ మూసివేయబడినవి. తెరచివున్న దుకాణాలన్నీ నల్లమందు అమ్ముతున్నవే. లాయ్‌ఎర్ ఒక నల్లమందు దుకాణందగ్గర ఆగాడు. గుయ్యారంలావున్న ఆ దుకాణంలోనుంచి ఒక అసహ్యమైనవ్యక్తి కొయ్యకాలితో కుంటుకుంటూ వస్తున్నాడు. పూర్వం యెన్నోసార్లు ఆవ్యక్తిని లాయ్‌ఎర్ చూచాడు. లాయ్‌ఎర్ అతన్నిపట్టుకుని అపరిచితవ్యక్తిని ప్రశ్నించినట్లు, 'ఈదుకాణంలో మందు అమ్ముతారా?' అని అడిగాడు.

ఆ వ్యక్తి తలఊపాడు. 'శత్రువుఅమ్మితే మనం కొనితినవచ్చా?' అన్నాడు లాయ్‌ఎర్. ఆవ్యక్తి లాయ్‌ఎర్‌వంక చూచి, 'నాలాటివారికి ఏంజరిగితేనేం? నాకు పోయినదేదీ మళ్ళీ రాదు. శత్రువులు వెళ్ళిపోయి, మళ్ళీ మంచిరోజులు వచ్చినా నా పోయినకాలు తిరిగిరాదు. నా టీ దుకాణం, నా

భార్య, బిడ్డలు—ఒకప్పుడు నాకు చెందినవేవీ తిరిగిరావు. మనం గెలిచినా ఓడినా నా కొకటే' అన్నాడు.

లాయ్‌ఎక్ ఎంతో బాధపడ్డాడు. ఇలాటివారే నిజంగా పరాజితులనుకున్నాడు. రాత్రికి లాయ్‌ఎక్ ఇంటికితిరిగివచ్చి, తను చూచినవిషయాలన్నీ చెప్పాడు.

దుకాణాలలో ఆహారం అమ్మడం లేదు, నల్లమందు మైమరుపు అమ్ముతున్నారు. లింగ్‌టాన్‌కు నల్లమందు ఎలాంటి విపత్కరమైన మార్పులు తెస్తుందో తెలుసు' తనతల్లి చెప్పింది. ఒకమనిషి అంతరాత్మను పూర్తిగామార్చి, విరూపంచేస్తుంది నల్లమందు.

లింగ్‌టాన్ దుఃఖించాడు. 'ఇంక మనకు గత్యంతరం ఏమిటి ? విమానాలబారినుంచి తప్పించుకోగలం. శిథిలగృహాలను తిరిగి కట్టుకోగలం. కాని మనప్రజలు జరిగిన దురాగతాన్ని మరచిపోతే మన మేం చెయ్యగలం?' శత్రువుచేసిన అన్ని దుర్మార్గాలలోకి ఇదే పెద్దదిగా కనుపించింది లింగ్‌టాన్‌కు.

25)



# 12

యుద్ధం రెండురకాలు: రహస్యంగా జరిగేయుద్ధం; బహిరంగంగా జరిగేయుద్ధం. ఇప్పుడు జరుగుతున్నది రహస్యయుద్ధం. ఈ యుద్ధంచెయ్యడమే కష్టం. శీతాకాలంలో లింగ్టాన్ సచేతనంగా యెలాంటిపనీ చెయ్యకపోయినా భవిష్యత్తును గురించి తీవ్రంగా ఆలోచించసాగాడు. కొడుకులు ప్రతిరాత్రి వచ్చిపోతున్నారు. రహస్యపుగదిలో తుపాకులుసండుకున్నాయి. వసంతఋతువువచ్చేసరికి శత్రువులు కొందరు మరణించినట్టు వార్తలువచ్చాయి. శత్రుపరిపాలకులకు చెప్పరానంత కోపం వచ్చింది. నగరప్రాకారంవద్ద రక్షకసైన్యాలు కూచున్నాయి. రాత్రుళ్లు నగరద్వారాలు మూసివేయబడ్డాయి. గోడఎత్తు 80 అడుగులు. అంత ఎత్తుగోడ ఎవరెక్కగలుగుతారు?

కాని, లింగ్టాన్ చిన్నకొడుకు, ఇంకా అలాంటివారు రాత్రుళ్లు ఏదోఒకసమయంలో ఆ గోడను ఎక్కేవారు. ఇటుక సందుల్లో కాళ్ళుంచి, ద్రాక్షతీగలుపట్టుకుని ప్రాకులాడుతూ ఎక్కేవారు.

శత్రువులు గ్రామాలకు వచ్చినప్పుడు గ్రామస్థులకు వారికి పోరాటాలు జరుగుతున్నాయి. గ్రామప్రజలు తుపాకులతో, వివిధఆయుధాలతో వారిమీదపడి తిరిగి వార్తచెప్పడానికి ఒక్కశత్రువైనా మిగలకుండా హతమారుస్తున్నారు. ఈవిధంగా గ్రామాల్లో గొప్ప రహస్యసన్నాహం జరుగుతోంది.

వేసవి మొదటిమాసంలో లింగ్టాన్ గ్రామానికి ఒక శత్రుదళం వచ్చింది. లింగ్టాన్ రహస్యపుగదిలో పది పాకులు మాత్రమే ఉన్నాయి. గ్రామప్రజలందరూ వాకిళ్ళలోకివచ్చి నిల్చున్నారు. వృద్ధులందరూ వారికి ఆయుధాలు అందివ్వ డానికి లోపలనిల్చున్నారు. లింగ్టాన్ సైగచెయ్యగానే అందరూ శత్రువులమీదపడి హతమార్చసాగారు. ఒక్క ముసలిశత్రువును తప్ప అందరినీ హతంచేశారు. గాయపడిన ఆ ముసలిశత్రువు ప్రాకులాడుకుంటూవచ్చి లింగ్టాన్ పాదాలవద్దగ్గరపడి, అతనికి తెలీనిభాషలో 'నన్ను చంపకండి నన్ను బ్రతికించండి; నాకు భార్యాబిడ్డలున్నారు' అంటూ ప్రాధేయపడసాగాడు. లింగ్టాన్ ఒకచిన్నకత్తితీసి, అతని పొట్టలో పొడిచాడు. అతను లింగ్టాన్ వంక దీనంగాచూచి ప్రాణాలువదిలాడు. ఇంతవరకు మూడుసార్లు శత్రువులను చంపిన లింగ్టాన్ అతని ముఖంచూచి, 'ఈదెయ్యానికి పాము ముఖంలేదు' అన్నాడు. లింగ్టాన్ అతనిజేబులు వెదికేసరికి ఒకసిల్కుకేసు దొరికింది. ఆ సిల్కుకేసులో ఒక అందమైన యువతి, పిల్లలు ఉన్న ఫొటో ఉన్నది. వాళ్లు ఆ చనిపోయిన సైనికుని సంసారం. లింగ్టాన్ కాస్సేపు ఆ బొమ్మవంక చూచాడు. 'వీ రింక ఇతన్ని చూడరుకదా' అనుకున్నాడు.

లింగ్టాన్ యింటికి వెళ్తూ దారిలో ఆగి, 'వెదురు పొదల్లో ఒకశవంవున్నది. ఆ శవాన్నికూడా పూడ్చండి' అని గ్రామప్రజలతో చెప్పాడు. ఇంటికివెళుతూ సిల్కుకేసుకూడా తీసుకుపోయి తనగదిలో వుంచాడు. 'ఈ దెయ్యాలు పూర్తిగా

నశించిపోయినతరువాత అయినా మన అంతరాత్మలు మనం చిక్కబట్టుకోగలమా?' అనుకున్నాడు.

లింగ్‌టాన్ పెద్దకొడుకుది మెత్తనిహృదయం. మొట్ట మొదట శత్రువును చంపవలసివచ్చినప్పుడు అతనికి ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నట్టు తోచింది. కాని తరువాత అతనూ పరివర్తనచెందాడు. ఒకప్పుడు పొలం దున్నినంత సులభంగా శత్రువులనుచంపుతున్నా డిప్పుడు. లింగ్‌టాన్ పెద్దకొడుకు ఒకఎర ఏర్పరిచాడు. ఆ గుంట ఎక్కడ త్రవ్వించాడో ఎవరికీ తెలీదు. ఇలాంటిఎరలు రోడ్లప్రక్కన చాలాచోట్ల ఉంచాడు. పగలూ రాత్రీ వెళ్ళి, ఎరలలో ఎవరైనా పడినదీ లేనిదీ చూచివచ్చేవాడు. ఎవరైనా అమాయకుడు పడిఉంటే, వదలివేసేవాడు. శత్రువు అయితే కత్తితో పొడిచేసేవాడు. ఒకరోజున భోజనంచేస్తున్నవాడల్లా హఠాత్తుగా లేచి వెళ్ళి ఏదో వ్రాసుకోడానికి నాకటిముందుకు వచ్చిన శత్రువును పొడిచివచ్చి, మళ్ళీ భోజనానికికూచున్నాడు.

'చేతులైనాకడుక్కో' అన్నాడు లింగ్‌టాన్. 'ఎందుకు? వాడిని నెదురుపాదంతో తోసేశాను' అన్నాడు కొడుకు.

లింగ్‌టాన్ అనుకున్నాడు—'మళ్ళీ నా కుమారుడు మారుతాడా? శాంతిసమయాల్లో మళ్ళీ అతని మృగత్వం తిరిగివస్తుందా?' అని.

లింగ్‌టాన్‌ను అన్నివిషయాలలోను ఒకటి మరింత బాధించసాగింది. అతని మూడవకొడుక్కు శత్రువులను పరి మార్చడమంటే చెలగాటమైపోయింది.

శత్రువును చంపినప్పుడల్లా ఎక్కడాలేని ఆనందంపొందే వాడు. పూర్వం ఏదో కలకంటున్నట్టుగాఉండే ఈ కుర్రవాడు నానాటికీ ఏదో భీకరమైన సౌందర్యంతో ప్రకాశింపసాగాడు. చాలాపొడుగ్గా ఎదిగాడు. అతన్నిచూడకుండా ఎవరూ ఉండ లేరు. అతనికి శత్రువులనుచంపడం ఆనందమైపోయింది.

లింగ్‌టాన్ తనకడపటికొడుకు ఇంత భీకరవ్యక్తి అవు తాడనుకోలేదు. కొండల్లోఉన్నవారికి ఈవిషయం తెలుసు.

ఇతను వారిలో ఒకభాగానికి అతిసులభంగా నాయ కుడైపోయాడు. అందరికంటె చిన్నవాడైనా, ఆటఆడినంత సులభంగా వాళ్ళకు పథకాలుచెప్పేవాడు.

'నన్ను ఇందుకోసమే ఈశ్వరుడు నిర్దేశించాడు. ఈశ్వ రుడు నాచేతులకు అపూర్వబలం ఇచ్చాడు' అని గర్వించేవాడు.

ఒకరోజున లింగ్‌టాన్ ఈమాటలన్నీ విని, 'ఈశ్వరుడు ఈశ్వరుడు అనకు. ఒకరినొకరు చంపుకోవడం, ఒకరిప్రాణాలు ఒకరు హరించడం ఈశ్వరేచ్ఛకాదు' అన్నాడు.

కొడుకు నవ్వి, 'ఈ పాత సిద్ధాంతాలవల్లనే ఇంత అధోగతిపాలయ్యాం. మనపూర్వులతోపాటు మనమూ సమా ధుల్లో నిద్రించాం. మనంనిద్రిస్తూంటే ఇతరులు ఆయుధాలు తయారుచేసుకున్నారు. మీ ముసలోళ్ళకంటె మా కుర్ర వాళ్ళకు ఎక్కువతెలుసు' అన్నాడు. లింగ్‌టాన్ కోపంపట్టలేక వాడిమూతిమీదకొట్టి 'నోరుముయ్. వేలసంవత్సరాలు మన పూర్వులసిద్ధాంతాలవల్లనే మనం బ్రతకగలిగాం. శాంతివల్ల ప్రజలు జీవిస్తారు. యుద్ధంవల్ల ప్రజలు మృత్యువుపాలవుతారు.

ప్రజలు జీవిస్తే జాతి జీవిస్తుంది. ప్రజలు మరణిస్తే జాతి మరణిస్తుంది' అన్నాడు

కాని లింగ్‌టన్‌కు ఈ కొడుకుయొక్క ప్రస్తుత స్వభావం తెలీదు. వాడు చెయ్యెత్తి తండ్రిమీదికి వచ్చి, 'రోజులుమారాయి. నువు నన్నుకొట్టలేవు. నేను చంపదలుచుకుంటే నిన్నుకూడా చంపగలను' అన్నాడు.

ఈ మాటలు లింగ్‌టాన్ చెవులారా విన్నాడు అతని చేతులు వాలిపోయాయి. కోపంతో జేవురించిన కొడుకు ముఖంవంక చూచాడు.

'చంపుతావు, చంపుతావు, ఇప్పుడెవరినైనా చంపగలవులే' అన్నాడు.

కొడుకు సమాధానం చెప్పలేదు. మౌనంగా వెళ్ళిపోయాడు—చాలారోజులవరకు తిరిగిరాలేదు.

అవి లింగ్‌టన్‌కు మంచిరోజులుకావు. రాత్రుళ్ళు నిద్ర పట్టేదికాదు.

'మనప్రజలగతి ఇంతేనా ? మనమూ ప్రపంచంలో ఇతరయుద్ధోన్మాదులవలె తయారయితే, అది మన అంతమే కదా చంపాలని ప్రీతితో చంపేవాడు బ్రతకడానికి అర్హుడు కాదు. అలాంటివాడు చనిపోవాలి. అలాంటివారు నిరాశులు. మనం సామాన్యప్రజలం. ఎప్పుడూ వారిదయాదాక్షిణ్యాల మీద ఆధారపడిఉండాలి' అనుకునేవాడు లింగ్‌టన్.

ఒకనాటిరాత్రి లింగ్‌సాతో 'మన చిన్నబాబు చచ్చిపోతే బావుంటుంది. వా డెంతో మారిపోయాడు. పూర్వపు [illegible] తనిషుత్రవాడు కాదు.' అన్నాడు.



'మనంమాత్రం మారిపోలేమా?' అన్నది లింగ్‌సా.

'నువు మారిపోయావా?'అని అడిగాడు లింగ్‌టాన్ ఆశ్చర్యంగా.

'మారలేదా మరి? పూర్వపుఅలవాట్లు మళ్ళీ తెచ్చుకో గలనా? మోకాళ్ళమీద పసిపిల్లను ఆడిస్తూకూడా మనం ఏంచేశామో, ఏంచెయ్యాలో మర్చిపోను' అన్నది.

'మనం మరోవిధంగా ప్రవర్తించలేమా?'

'లేదు' అన్నది లింగ్‌సా.

లింగ్‌టాన్ కాస్సేపు ఆలోచించి 'అయినా, ఈసమయంలో శాంతి మంచిదని మనం జ్ఞాపకంఉంచుకోవాలి. కుర్ర వాళ్ళు ఈవిషయం జ్ఞాపకం ఉంచుకోకపోవచ్చు. కాని, జ్ఞాపకం ఉంచుకుని, వాళ్ళకు చెప్పవలసినది మనం. మానవుని ఆహారాలన్నిటిలోకి శాంతి గొప్పదని మనం వారికి నచ్చచెప్పాలి' అన్నాడు.

ఆరాత్రి అతనికి సరిగా నిద్రపట్టలేదు. చాలా ప్రొద్దుపోయాక నిద్రపోయాడు.

శాంతికిమించి జీవితంలో వాంఛనీయమైనది లేదనే నిశ్చయానికి వచ్చాడు లింగ్‌టాన్. శాంతిని గురించి ఆలోచించినకొద్దీ తోటిమానవుణ్ని చంపడం ద్రోహమనే విషయం అతనిమనస్సులో మరింత దృఢంగా నాటుకుంది 'ఇతరులు చంపనీగాక, నేనిక చంపను' అనుకున్నాడు.

తనలోతాను చర్చించుకో సాగాడు. తన పద్ధతిలో తాను సేవచేస్తున్నాడు. శాంతి గొప్పదనే భావాన్ని తనలో సజీవంగా ఉంచుకున్నాడు.

...లింగ్‌టాన్ రెండవకోణుకు పద్ధతి వేరు. అవసర మైనప్పుడు చంపుతాడు, అంతే. పెద్దపెద్ద పథకాలు అమలు పర్చడంలో ఎవరినైనా చంపవలసివస్తే చంపుతాడు. విషయంయొక్క అంతిమప్రయోజనాన్ని చూస్తాడుకాని, సాధనామార్గాన్ని తక్షణకుశాన్ని కాదు. ఈ పథకాలు వేయు డంలో జేద్ సహాయపడినంతగా అతనికెవరూ సహాయపడరు.

'శత్రువులకోటంలో ప్రవేశించడానికి ఫ్రాలిన్‌ను ఒక ద్వారంగా వినియోగించుకోవాలి. అలాంటివాళ్ళను ద్వేషించి, వాళ్ళపై కోపాన్ని ప్రకటించడంవల్ల వచ్చే దేమీ లేదు.' అన్నది లాయ్‌ఎక్‌తో జేద్.

'నువ్వెంతో తెలివిగా మాట్లాడుతావు' అన్నాడు లాయ్‌ఎక్.

ఈ మాటలు మాట్లాడుకుంటున్నప్పుడు వారు తమ రహస్యగదిలో ఉన్నారు. ఆయుధాలకు నూనెరాచి, బాగు చేస్తున్నారు.

'వాళ్ళతో మళ్ళీ స్నేహంఉన్నట్లు ఎలా నటించాలా?' అని జేద్ ఆలోచించసాగింది. ఇలా ఆలోచిస్తూ, మెరుస్తున్న తుపాకిరంధ్రంలోకి చూచింది. తుపాకి కొత్తది. శత్రువులనుంచి లాక్కొని ఎన్నాళ్ళో కాలేదు. కొడుకు ఖాళీతూటాలతో ఆడుకుంటున్నాడు. ఖాళీతూటాలు వాడికి ఆటబొమ్మలుగా ఉపయోగపడుతున్నాయి. వాడికి చిన్న చెప్పులు, బుద్ధుని బొమ్మలతో చిన్న టోపీ కుట్టింది జేద్.

వీరిద్దరూ కలలోకూడా అనుకోకపోయినా, వారు అందులో దాగి ఉన్నారని ఫ్రాలిన్‌కు తెలుసు.

అతనికి వార్తలుచేర్చేవారు ఆగ్రామంలో లేకపోలేదు. జేన్, జేన్‌కుమారునిపట్ల అసూయగలవారే వారు. లింగ్‌టాన్ జ్ఞాతిభార్యకుకూడా వారక్కడ ఉన్నారని తెలుసు. ఒక రోజున ఆమె కొత్తచేపలు తీసుకుని, శత్రువులకు సమర్పించాలనేమిషతో వ్రాలిక గృహానికి వెళ్ళింది. గేటుదగ్గరఉన్న సోల్జర్‌తో తను వ్రాలిక బంధువునని చెప్పి లోపలికి వెళ్ళింది.

వ్రాలిక అందరినీ అభినందించినట్లే, ఆమెను మర్యాదగా అభినందించి కూర్చోబెట్టాడు. భార్యకు కబురుపంపించాడు. ఆమె పాతపరిచయాన్ని పురస్కరించుకుని మాట్లాడుతూ, లింగ్‌టాన్‌నుగురించి, అతని కొడుకులనుగురించి మాట్లాడింది.

'నీ అన్నలు బాగున్నారు. రెండో అతన్ని మొన్ననే చూశాను' అన్నది ఊలిను భార్యతో.

ఊలిను భార్య ఆశ్చర్యంతో, నా రెండో అన్న ఇక్కడున్నాడా?' అని అరిచింది.

"అవును. ఇక్కడేఉన్నాడు. ఒక చక్కని కుర్రాడు కూడా ఉన్నాడు. కాని, వాడి ముఖంచూస్తే బ్రతికి బట్టగడతాడనుకోను' అన్నది.

నీ మిగతా అన్నలుకూడా ఇక్కడే ఉన్నారు. అప్పుడప్పుడు కొండల్లోకి వెళ్ళివస్తుంటారు'

కొండల్లో ఉంటారా?' లింగ్‌టాను పెద్దకూతురు అరిచింది.

'అవును, ఇప్పుడు అక్కడే ఉంటున్నారు' అన్నది బంధువు భార్య, లింగ్‌టాన్ గృహంలో ఉన్నరహస్యపు గదిని

గురించి చెబుదామా వద్దా అని ఆలోచించింది. ఒక నిమిషం ఆలోచించి, ఇప్పుడే చెప్పకూడదనుకుంది.

అవసరమైనప్పుడే ఈ రహస్యం బయటపెట్టవచ్చును కున్నది. తరువాత నిశ్వసించి కళ్ళనీళ్లుపెట్టుకుని, 'నీకు తెలుసు కదూ బాబూ, నా కొడుకు చనిపోయాడు. శత్రువులు కొట్టిన తరువాత, అలాగే పీక్కుని చనిపోయాడు. మీ అత్తగారు వేద్ నుకొన్న నాటినుంచీ, మా కొంపకు కీడుచుట్టుకుంది.' అంటూ ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

ఫూలిన్ ఓదారుస్తూ 'మీ ఆయన బాగున్నాడా?' అని అడిగాడు.

'తిండికి లేనప్పుడు ఏం బాగు?' అన్నది. అప్పుడా బుద్ధిహీనురాలిబుర్రకు ఒక భావం తట్టింది. వెంటనే ఫూలిన్ వంక తిరిగి, 'ఫూలిన్, నీవు చాలా దయామయుడివి. నీలోని దయ అంతా నీ ముఖంలోనే ఉట్టిపడుతూంటుంది. నాకూ, మా ముసలాడికీ ఈ ఇంట్లో ఏదైనా చిన్నపని చూపరాదూ' అన్నది.

'మా నాయన మీ ముసలాణ్ణి రానిస్తాడూ?' అన్నది ఊలిన్ భార్య.

అప్పుడు బంధువుభార్య 'మా ఆయన ఎప్పుడూ నేను చెప్పినట్టే చేస్తాడు. కూటికిలేకపోతే ఊళ్ళోవాళ్ళు పెడతారా?' అన్నది.

ఫూలిన్ ఏంచెప్పాలా అని ఆలోచిస్తూ, 'నువ్వు మీ ఊళ్ళోనేఉండి, మాకు సహాయంచెయ్యడం మంచిది. ఎప్పుడైనా ఇక్కడికి వస్తూఉండు. నీకు ఏదైనా అవసరమైతే

మేం ఇస్తూఉంటాంలే. మాకు వార్తలు అందజేస్తూఉండు. మా అత్తమామల విషయం, మా బావమరదుల విషయాలు చెబుతూండు' అన్నాడు వూలిన్.

అత నీ మాటలు అమాయకంగానే చెప్పాడు. కాని వాటివెనుక ఉన్నఅర్థాన్ని గ్రహించి, ఆమె నవ్వింది.

తరువాత ఆమె వెళ్ళిపోయింది. నగరంలో కావలసిన వస్తువులు కొనుక్కున్నది- సూది, గుడ్డలు, మాంసం ఇలాంటివి.

ఒక దుకాణానికివెళ్ళినిల్చుని, మాంసం వాసనచూచి 'ఈమాంసం ఇలా వాసనేస్తోం దేమిటి? కుక్కమాంసమా? కుక్కమాంసమైతే నేనుతినను' అన్నది.

'కుక్కమాంసం కాకపోతే గాడిదమాంసం! ఉన్న మాంసమంతా వారే తీసుకెళ్ళారు'అన్నాడు ఆ దుకాణంలో దిగులుగాకూచున్న ముసలాడు.

ఆమె ఇంటికి వెడుతూ వీధులన్నీ నిర్జనంగా ఉండడం చూచింది. ఆకలితో చసిపోతున్న వారు ప్రాకులాడుతున్నారు. ఆమె భయంతో, 'వూలినును ఎలాగో ఒకలా ఉపయోగించు కోవాలి. మాడిచచ్చిపోతే ఏం లాభం? నాభర్తతో ఏం చెయ్యాలో చెబుతాను' అనుకున్నది.

ఇంటికివెళ్ళి భర్తకు నూరిపోయడం ప్రారంభించింది. 'ప్రపంచంలో ఇంతమంది మనుష్యులున్నారు. కాని నీ అంత అధమస్థు డెవ్వరూ లేడు. నేను చెప్పినట్టుచేస్తావా చెయ్యవా?' అన్నది.

'ఏమిటీ నువ్వు చెప్పేది?' అన్నాడు ముసలాడు.

'మనకు లింగ్టాను శత్రువు. నే నెప్పుడూ లింగ్టానును ద్వేషిస్తూనే వచ్చాను' అన్నది.

'నే నెప్పుడూ అతన్ని ద్వేషించలేదు. అతను మనకు అనేకసార్లు సహాయంచేశాడు! ఇవన్నీ ఎలామరిచిపోగలం!' అంటూ గొణిగాడు వృద్ధుడు.

'మర్చిపోవడం ఏమీ కష్టంకాదు. తనగొప్పకోసం ఇచ్చుకున్నాడు'అన్నది. ఇలా పోరుపెట్టి అతన్నివంచింది. చివరకు ఆముసలాడు విసుగెత్తి 'సరే, నీఇష్టంవచ్చినట్టు ఏడ్చుకో' అన్నాడు. ఈవిధంగా వారు ఫ్రాలిన్గూఢచారులైనారు.

జేద్కు ఈ విషయం తెలీదు. తనపథకాలు తానువేసుకుంటున్నది. ఒకరోజున తనే ఏదైనా తినుబండారం తీసుకెళ్ళి ఫ్రాలిన్ద్వారంముందు అమ్ముదామనుకున్నది. తను ఏంచెయ్యదలచుకున్నదో జేద్ ఎవ్వరితోనూ చెప్పలేదు. ఎందుచేతనంటే, రహదారిదొంగలా జేద్ ఎంతో నింపాదీ, ధైర్యమూ గలవ్యక్తి. తనభర్త కొండల్లోకి వెళ్ళిననాడు, కొడుకు నిద్రించేవరకూఉండి, నెరిసినజుట్టుగల టోపా పెట్టుకున్నది. ఈ టోపా వాళ్ళు పశ్చిమానికి వెళ్ళినప్పుడు, ఆమె మానాన్ని కాపాడుకోడంకోసమై ఒక నటకులగుంపువద్ద లాయ్ఎర్ ఆమెకోసం కొన్నాడు. ఆ టోపాపెట్టుకుని, ముఖానికి రంగుపూసుకుని ముసలిమసిషిలా అలంకరించుకుని, దొడ్డిద్వారంగుండా వెళ్ళి, దొడ్లో శత్రువుకంటపడకుండా లింగ్టాన్ పెంచుతున్న కాబేజీ ఒకబుట్టెడు కోసుకున్నది. శ్మశానాలగుండా నడిచి, నగరంవేపు వెళ్ళింది.

ఫ్రాలిను ఎక్కడుంటున్నాడో ఆమెకు తెలుసు. అందుచే

సరాసరి ఆ గేటుదగ్గరకు వెళ్ళింది. ఆమెబుట్టలోని కాబేజీలు చూడగానే సోల్జర్‌కు నోరూరింది. మార్కెట్‌లో ఇటీవల ఒక్క పచ్చకూరగడ్డకూడా కనుపించడంలేదు. అందుచేత ఆమె ఫ్రూలిను పేరు చెప్పవలసిన అవసరమే లేకపోయింది. 'వంటింట్లోకి వెళ్లు ముసలిదానా, నీకు డబ్బులిచ్చేస్తారు' అన్నాడు.

'వంటిల్లు ఎక్కడుంది?' అన్నది ముసలిదానిలాగే మాట్లాడుతూ.

'నాతో రా' అంటూ లోపలికి తీసుకెళ్ళాడు. లోపలికి వెళ్ళి, వంటమనిషితో, 'ఈ ముసలిది బంగారం కంటె మంచిపదార్థం తెచ్చింది. తీసుకుని, వండినతరువాత నాకో ప్లేటు ఉంచు' అని నవ్వుతూ వెళ్ళిపోయాడు కాపలాదారు. ఒక లావుపాటి వంటమనిషివచ్చాడు. కాబేజీలకోసం తువాలు పట్టాడు. 'రెండు వెండినాణాలు' ఇస్తానన్నాడు.

ఆమె తలఊపి 'ఇప్పుడు కాబేజీలధర తెలుసా?' అన్నది.

"అయితే మూడు" అన్నాడు వంటమనిషి నిర్లక్ష్యంగా.

"నా డబ్బుతో కాదుగా నేను కొనేది. ఒకపెద్ద విందు జరగబోతున్నది- విందులతో నా దుంప తెగిపోతోంది. నీ దగ్గర మాంసం ఉన్నదా? పందిమాంసం దొరుకుతుందా! పందిమాంసం లేకపోతే ఏం విందు? చివరకు బాతైనా ఉండాలి' అన్నాడు. ఆమె అతనివంక నిశ్చలంగాచూచింది. అతను దోషిష్ట!

'నేను రెండు బాతులు తెచ్చిస్తాను. పది వెండినాణాలు ఇస్తావా?' అన్నది.

'తీసుకురా, నీవే చూస్తావుగా' అన్నాడు. పెట్టెలో నుంచి వెండినాణాలుతీసి, కాబేజీధర ఇచ్చాడు. ఆమె 'విందు ఎప్పుడు?' అన్నది.

'ఇవాళ్టికి రెండురోజులుంది. ఒకసంవత్సరం క్రిందట వారు మనల్నిజయించారు. అందుకని పెద్దలాందరూచేరి విందు కుడుస్తారు' అన్నాడు.

ఆమె అతనిదగ్గరకువంగి 'నువు మనలో ఒకడివా?' అన్నది రహస్యంగా. లావుపాటి వంటమనిషి ఇల్లు నలుమూలలా కలయచూచాడు కాని, సమాధానం చెప్పలేదు.

'అధికారులందరూ ఇక్కడేఉంటారు. నువు ఆహారంలో ఏమైనా పెట్టొచ్చు. మొత్తం వంటవాళ్లు ఎంతమందిఉన్నారు?' అన్నదామె.

'ముగ్గురు'

'ముగ్గురు! పెద్దవిందుకు ముగ్గురు సరిపోతారా? నువు అలాంటిసమయంలో సహాయంకోరకూడదూ? పెద్దవిందుకు పదిమంది వంటవాళ్లుండాలి. బైటనుంచి వంటవాళ్ళను తెప్పిస్తారా?' అన్నది.

'బైటవాళ్ళను ఒప్పుకోరు' అన్నాడు.

రేపు బాతులుతీసుకుని మళ్ళీ రా' అని చెప్పి లోపలికి వెళ్ళాడు.

జేన్ మళ్ళీ గేటుదాటి శూన్యవీధుల్లో ప్రవేశించింది. వంటవాడిమనస్సులో 'విషబీజం' నాటుకుంది. శిథిలవీధులలో నడుస్తూ, ఆమె అక్కడక్కడ ఆగి కొందరితో మాట్లాడింది. వారు రహస్యంగా తమ కష్టాలనుగూర్చి చెప్పారు.

ఒక పాతబట్టలదుకాణంవద్దకు వెళ్ళి, ఒక కోటుకోసం చూచింది. వ్యాపారం ఎలాఉన్నదని అడిగింది. అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'ఇంకా నాకు బాగేమిటి?నా ఒక్కకొడుకుపోయాడు. నా ముగ్గురుకూతుళ్ళూ అంతకంటే అధోగతిపాలయ్యారు' అన్నాడు.

'నీ కొడుకు ఎలాపోయాడు?'అన్నది.

'నిజంచెబుతాను, విను. వాడికి పధ్నాలుగేళ్ళు. అందరి కంటె చిన్నవాడు. ఒకరోజున వాకిట్లో శత్రుపటాలం వెడు తూంటే చూడడానికివెళ్ళి వాకిట్లో నిల్చున్నాడు. చిన్నతనం వల్ల చిలిపిగా వారికి శాల్యూట్‌చేశాడు. చెయ్యగానే ఒక శత్రువు కాల్చేశాడు. వాడు నాచేతుల్లోనే ఒరిగిపోయాడు.

'నిజంగానా?'అన్నది జేద్ విషాదంగా.

'నిజంగా. యింతే జరిగింది' అన్నాడు అతను నిశ్వసిస్తూ.

జేద్ ఇంటికి చేరేసరికి చీకటిపడింది తనపథకాన్ని ఇంట్లోఅందరికీ చెప్పింది. లింగ్‌టాన్ రెండుబాతులు తెచ్చి యిచ్చాడు. జేద్, లింగ్‌సా వాటినిచంపి కడిగి, వాటికడుపులో విషంపెట్టి ఎండబెట్టారు.

మరుసటిరోజు ఉదయాన జేద్ బాతులను తీసుకెళ్ళి లావుపాటివంటమనిషికి ఇచ్చి 'జాగ్రత్తగా వండు. బాగా నూనెవెయ్యి' అని చెప్పింది. అతను తన చిన్నికళ్లను పెద్దవి చేసి, ఆమెవంక నిశ్చలంగాచూచాడు. ఆమె అతనివంక నిశ్చలంగాచూచింది. ఆమె ముసలిదికాదని అతనికి తెలిసింది.

తను చేసినపని ఎలా ఫలించిందో జేద్‌కు ఎలా తెలు

స్తుంది? ఆమె వేచిఉంది. 'ఈ ప్రయత్నం సఫలమయితే మళ్ళీ చేస్తాను దెయ్యాలతో నేను పోరాడేపద్ధతి ఇదే' అనుకున్నది. చివరకు జ్ఞాతి భార్యద్వారా వార్త తెలిసింది. ఒకనాడు ఊలిన్‌ను వీధిలో చూచిందట.ముసలిమేకలా చిక్కి, సన్నంగా ఉన్నాడట. కొందరు శతృవులుకూడా అలాగే అయ్యారట. ఇదంతా ఒక విందు తరువాత జరిగిందట. ఈ వార్త ఆమె తన భర్తతో చెప్పగా అతను లింగ్‌సాకు చెప్పాడు.

లింగ్‌సా సూటిగాచూస్తూ విన్నది. జేద్ రహస్యపు గదిలోకి వెళ్ళింది.

'ఎంతమంది చనిపోయారు? ఎవరు వాళ్ళు?' అని అడిగింది లింగ్‌సా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ. బంధువు 'పెద్ద పెద్దవాళ్ళే చనిపోయారట. అందరికీ జబ్బుగా ఉన్నదట. ఊలిను మాంసం కొద్దిగాతిన్నాడట. అంచేత అతను చనిపోలేదట' అని చెప్పాడు. 'ఎవరైనా బైటనుంచి తెచ్చిపెట్టారేమోనని వెదకుతున్నారట' అన్నాడు ఇంకా.

'మిగిలిన మాంసం వంటవాళ్ళు తినలేదా?' అని అడిగింది లింగ్‌సా.

'శత్రువులు మాంసంకోసం ఆవురావురంటున్నారు. ఎముకలతోసహా నమిలేశారు'

అతను చెప్పినమాట నిజమే. స్త్రీలు, తాగుడు - వీటితరువాత వారి కెక్కువప్రియమైనది మాంసమే.

ఆరాత్రి లింగ్‌సా వూలిన్ విషంతిన్నాడని చెప్పగా అందరూ నిశ్శబ్దంగావిన్నారు. రెండోకొడుకు, 'మరింతతింటే బావుండేది, చనిపోయేవాడు'అన్నాడు.

లింగ్‌సా 'ఏమైనా, నీ భావకదరా' అన్నది.

జేన్ మెల్లగా 'ఈ రోజుల్లో అక్క, అన్నలపట్ల నిర్వహించవలసిన విధికంటె గొప్పవిధి ఉన్నది' అన్నది.

లింగ్‌టాక్, లింగ్‌సా మాట్లాడలేదు. ఇవి తమరోజులు కావనుకుని ఊరుకున్నారు

...'నువు నన్ను ద్వేషిస్తున్నావా?' జేద్ భర్తను అడిగింది. తనపథకం విజయవంతం కావడంవల్ల ఆమెకు భయం కలిగింది.

'నేను నిన్నెలా ద్వేషించగలను?'అన్నాడు లాయ్‌ఎర్.

కండ్లుదించుకుని, తనశరీరంవంక చూచుకున్నది. ఆమె అప్పుడే స్నానంచేసిరావడంవల్ల నగ్నంగాఉన్నది.

'నాలో అందమంతా పోయింది. నాఒళ్ళు ఎంతో గట్టిగాఉంది. ఇవాళ గుడ్డలుఉతుకుతూ నీళ్ళలోకి చూచాను. నాముఖం నల్లగాఉంది. స్త్రీముఖంలా లేదు'అన్నది రొమ్ములకు చేతులు అడ్డంపెట్టుకుని. ఇలా మాట్లాడుతూ ఒక బట్ట తీసుకుని కట్టుకున్నది.

లాయ్‌ఎర్ టేబుల్‌దగ్గరకూచుని నిద్రపోబోయేముందు ఒకకప్పు టీ తాగుతూ 'నన్ను పెళ్ళాడిననాటిలా లేవు, నిజమే' అన్నాడు.

అతన్ని వాలుగాచూస్తూ 'ఇప్పుడున్నట్టు ఉంటే, నన్ను పెండ్లిచేసుకునేవాడివేనా?' అన్నది.

'చెప్పలేను. బహుశా చేసుకునివుండేవాణ్ణి కాదు. అయినా యిప్పుడు నేనుమాత్రం అప్పుడున్నట్టు వున్నానా?' అన్నాడు నవ్వుతూ.

అతని నవ్వు చూచి, ఆమె హృదయం తేలికపడింది. ముఖాన్ని చిరుపిగా పెట్టి, 'ఇప్పుడు నువ్వు పూర్వంవున్నంత అందంగా లేవు. ఎండకు నల్లబడిపోయావు' అన్నది.

'అవును, నల్లగా వున్నాను' అని అంగీకరించాడు.

'నీజుట్టు తుప్పుపట్టినట్టుగా వున్నది.'

'అవును.'

టేబిల్ మీదవున్న చిన్నఅద్దాన్నితీసుకుని 'మగవాడు యెలావుంటే నేం?' అన్నది.

'నీకు యెలావున్నా పరవాలేకపోతే పరవాలేనట్టే' అన్నాడు నవ్వుతూ.

ఆమె అద్దంలో తనముఖాన్ని చూసుకుని నోరు ముద్దుగా పెట్టి 'మళ్ళీ నేను ముఖానికి పౌడరు అద్దుకుని, చెవులకు పోగులు యెప్పుడు పెట్టుకుంటానో!' అన్నది.

'యెవరికి తెలుసు?'

'నువ్వు చెవిపోగులు కొని యిచ్చావుకాదు.'

'నువ్వు పుస్తకం కావాలన్నావుగా.'

ఆమె అద్దం చూచుకుంటూనే, 'బహుశా నేను తప్పు చేశానేమో!' అన్నది.

'అయితే చెవిపోగులు కొనిస్తాలే' అన్నాడు హృదయపూర్వకంగా నవ్వుతూ. వారిద్దరిమధ్యా తీయని వెచ్చదనం వ్యాపిస్తోంది. ఆ వెచ్చదనాన్ని ఎంతటిచల్లదనంకూడా చల్లబరచలేదు. అంతదగ్గరగా ఉన్నారు వారిద్దరూ. అలుపులో, అపాయంలో, వర్తమాన ప్రపంచం యొక్క కల్మషంలో—ఇంకా వారు—పరస్పరం ప్రేమను ఇచ్చిపుచ్చుకుంటున్నారు.

వారివ్రేను అన్నిటికీ అతీతమైనది. ఎప్పుడూ పచ్చగానే వున్నది.

ఆరాత్రి కొంత ప్రొద్దుపోయినాక జేప్ ఏదో అనుమా నంగాఉన్నట్లు తోచింది అతనికి. 'ఏమిటి అలాఉన్నావు?' అన్నాడు అనునయంగా.

తరువాత ఆమె అతనిచేతిక్రింద తలదాచుకుంది. ఆమెకు సిగ్గుకలిగినప్పుడల్లా అలాచేస్తుంది. అతను ఆమెతల ఎత్తాడు. ఆమె తొట్రుపడుతూ అతనిముఖంలోకి తప్ప అన్నిదిక్కులూ చూస్తూ, 'నేనుచేసినపని స్త్రీసహజం కాదంటావేమో?' అన్నది.

'ఏపని? నువ్వెప్పుడూ ఏదోఒకపని చేస్తూనేఉంటావు' అన్నాడు.

'విషంపెట్టడం ఆవిషయం. తలుచుకుంటే నామీదనాకే అసహ్యంవేస్తుంది' అన్నది మెల్లనిగొంతుకతో.

'కాని వారు దెయ్యాలు!'

'నాకుతెలుసు. అయినా శాంతిఏర్పడినతరువాత చాలా రోజులను 'ఇది అన్నంలో విషంపెట్టింది' అనుకుని నన్ను సాధా రణ స్త్రీనిచూచినట్లు చూడవేమో!'

లాయ్‌ఎక్‌కు జేద్ పూర్తిగా అర్థమైంది. ఆమెకు ఎంతో బలంఉంది; సాహసంఉంది. కాని ఆమెలో సిగ్గుతోకూడిన చక్కని సాధుహృదయమూ ఉన్నది అత నామెను గాఢంగా కౌగిలించుకున్నాడు.

'మనకు మళ్ళీ కొంతసుఖకాలిగేసమయం వచ్చింది. నాకు నీనుంచి సంతానంకావాలి. అందరూ నీలాంటివారే కావాలి' అన్నాడు.

# 13

శత్రువు చెబుతూంటే వూలిన్ బ్రష్ పట్టుకుని వ్రాస్తున్నాడు. అతను వ్రాసినదానికి కాపీలు అచ్చువేసి, గోడలకు అంటింపచేస్తాడు శత్రువు.

గదినిండా ఎన్నో విదేశీసామాన్లు ఉన్నాయి. అన్నీ దోచుకున్నవే. మూడుపియానోలు. నేలమీద చక్కటి తివాసీలు పరిచిఉన్నాయి.

ఊలిన్ నిశ్శబ్దంగాకూచుని, శత్రువు చెప్పినది వ్రాస్తున్నాడు. ఒకవాక్యం చెప్పినతరువాత శత్రువు 'నేను చెప్పినట్టు వ్రాశావా?' అంటాడు.

'వ్రాశాను' అంటాడు వూలిన్ మెల్లగా.

'అయితే, ఇహ వ్రాయి' అని మరోవాక్యం చెబుతాడు శత్రువు. వూలిన్ వ్రాస్తాడు. ప్రతిపేజీమీద పెద్దపెద్ద అక్షరాలలో, 'విముక్తితార! ఆగ్నేయఆసియాలో క్రొత్త వ్యవస్థ.' అని వుంటుంది. ఈ మాటలక్రింద చిన్నఅక్షరాల్లో 'సోదరపౌరులారా! వందసంవత్సరాలకుపైగా తెల్లవారి పారతంత్ర్యాన్ని మనం అనుభవించాం. ఈ శతాబ్దంలో ఈ దాస్యాన్నుంచి తప్పించుకోడానికి మనం ఎంతోపోరాడాం. కాని ఫలితం దక్కలేదు' అని వుంటుంది.

ఇక్కడ శత్రువు ఆగి, 'నిజమేనా సైనావాడా?' అన్నాడు.

ఊలిన్ ఆశ్చర్యంతో పైకిచూచి, 'ఏమిటి నిజమంటున్నారు?' అన్నాడు తనసహజమైన మెల్లనిగొంతుతో.

'నువువ్రాసింది ఏమిటోయ్, బుద్ధిహీనుడా!' అని అరిచాడు శత్రువు.

ఊలిన్ క్షమాపణకోరుతూ, 'నేను గమనించలేదు. క్షమించాలి. నిన్నటి నిషాతో నాతల యింకా జుమ్ముజుమ్ముగా వుంది' అన్నాడు.

అది నిజమే. వూలిన్ వలిపోయివున్నాడు. శత్రువు అతనివంక మెరుస్తున్న కండ్లతో చూచి. 'సరే' వ్రాయి' అని చెప్పడం మొదలెట్టాడు—

'దీనికి కారణం ఏమిటి? దేశం బలహీనంగావుంది. అధికారం అశక్తంగావుంది.'

శత్రువు తనమాటలను పిడుగులురిమినట్టు గర్జించాడు. కాని వూలిన్ సౌమ్యవదనంలో మాత్రం మార్పులేదు- అతను వ్రాస్తూనేవున్నాడు.

'కాని, ఇప్పుడు మనఅదృష్టంకొద్దీ ఒక మిత్రజాతి బలాన్ని వినియోగించుకోగల గొప్ప అదృష్టం లభించింది. మన యుగయుగాలవాంఛ తీరేటి, తెల్లజాతిపై పగసాధించ గల అపూర్వ అవకాశం వచ్చింది. మనస్నేహితురాలు 'నిప్పన్' యింత గొప్ప సాహాయ్యాన్ని, యింత గొప్పత్యాగాన్ని మనకోసం చేసినప్పటికి ప్రతిఫలమేమీ కోరదు. తూర్పు ఆసియాలో 'సుస్థిర[illegible]' స్థాపించాలంటుంది; అంతే.'

'హాయి' [illegible] శత్రువు.

'వ్రాస్తు[illegible]' [illegible]లిన్ మెల్లగా అన్నాడు.

'ఈ కొత్త వ్యవస్థ [illegible]మాపధి ఒక్క మన తాత్కాలిక విముక్తిమార్గము కాదు. శాశ్వత దివ్యముక్తికూడాను. సోదరపౌరులారా! ఈ 'జాతీయవ్యవస్థ' మన ముక్తితారక!'

శత్రువు తన ఉద్రేకాన్ని ఆపుకోలేక 'బన్‌జాయ్, బన్

జాయ్' అని అరిచాడు.

ఫూలిన్ పైకిచూచి, 'అదికూడా వ్రాయమంటారా!' అన్నాడు.

'ఈ గొప్పమాటలను 'బన్‌జాయ్' అని చెప్పు'అని గద్దించాడు శత్రువు.

ఫూలిన్ భయంతో, 'బన్‌జాయ్'అని 'క్రింద ఎవరిపేరు పెట్టమంటారు?'అనడిగాడు ఫూలిన్.

'ది గ్రేట్ పీపుల్స్ ఎసోసియేషన్'అని అరిచాడు శత్రువు.

ఆ సంఘం అసలు లేనేలేదు.

'వీటిని ఎక్కడ పెట్టమంటారు సార్?' ఫూలిన్ అడిగాడు.

'ప్రతిచోటా అంటించాలి' గద్దించాడు శత్రువు.

ఫూలిన్ నమస్కరించి వెళ్ళిపోయాడు. బైటికివెళ్ళి తన క్రిందివారికి తనఆజ్ఞలు అందచేసి, బలహీనంగావుండడంవల్ల తన గదిలోకి వెళ్ళిపోయాడు. అతనిభార్య అతనికోసం వేచివున్నది. విషప్రయోగం జరిగిననాటినుంచి ఆమెకు గాభరాఎక్కువైంది. అతనురాగానే ఒకగిన్నెతో కోడిపులుసు అందించి, 'మీప్రాణానికే ఉపద్రవకరమైన ఇక్కడ ఇంకా మనం ఉండడం మంచిదా?' అన్నది.

ప్రాణహాని లేనిచోటు ఈరోజుల్లో ఎక్కడుంది!' అన్నాడు ఫూలిన్.

ఆభవనంవెలుపల కొందరు త్వరత్వరగా ఫూలిన్ వ్రాసిన దాన్ని పెద్దపెద్దఅక్షరాలలో వ్రాసి గోడలకు అంటిస్తున్నారు.

ప్రతిచోటా వాటిని చూడడానికి జనం చిన్న గుంపులుగా పోగవు తున్నారు. ఆ మూగిన గుంపుల్లో కొద్దిమందే ఆ అక్షరాలు చదువుతున్నారు. వీరిలో చాలామంది ఆకలితో అలమటిస్తున్నవారు.

ఆనాడు లిగ్‌టాన్ జ్ఞాతి కూడా ఆ గుంపులో వుండడం తటస్థించింది. అతను గుంపులో దోవ చేసుకుని ముందుకు వెళ్ళి, పాత కళ్ళజోడు పెట్టుకుని పెద్దగా చదవసాగాడు. చుట్టూ చేరిన గుంపంతా భక్తితో వినసాగింది. అతను చదవడం పూర్తి చేసి కళ్ళజోడు తీసేశాడు.

ఆ అక్షరాల్లో వున్న విషయం విన్న తరువాత ఆ గుంపు మరింత నిశ్శబ్దత వహించింది. ఒకప్పుడు ఈ వీధుల్లో విచ్చల విడిగా నవ్వుతూ, తిట్టుతూ, హృదయాల్లో వున్న అభిప్రాయాలు వెలిబుచ్చుతూ నివసించిన ప్రజలు నిశ్చల ప్రతిమల్లా భయభీతులై నిల్చున్నారు. ఈ అక్షరాలు లింగ్‌టాన్ జ్ఞాతి హృదయంలో మరింత పగను, ప్రతీకారవాంఛను పురికొల్పాయి. అతనికి అంతా మరిచిపోవాలనిపించింది.

ఇటీవల అతను నల్లమందుకు అలవాటుపడ్డాడు. నల్లమందులో అతనికి ఎక్కడా లేని సుఖమూ, శాంతీ లభించాయి. అతను మూడు గొందులు దాటి, ఒక చిన్న దుకాణం వద్దకు వెళ్ళాడు. ఒక సన్నని, పసుపుపచ్చని పిల్ల అతన్ని లోపలికి తీసుకెళ్ళి కూర్చోబెట్టి, నల్లమందు గొట్టం అతని నోట్లో పెట్టింది. ఆ తీయని పొగ పీల్చగానే అతను కళ్ళు మూసుకున్నాడు.

'ఎంత శాంతి! ఎంత శాంతి!' అనుకున్నాడు. ఇప్పుడు పరిపాలకులు ఎవరైనా ఒకటే. ఇక్కడ మాత్రం అతన్నెవరూ

పరిపాలించడం లేదు. అతని శరీరం శవంలా బిగిసింది. అతని ఆత్మ ఎక్కడైనా విహరించవచ్చు. ఈ శరీరనుజలకు దూరంగా అతను ముక్తుడు!

ఇది ఎలా సంభవించింది? అతన్ని జీవితం ఒక తిరుగలిలో విసిరినట్టు విసిరింది. తన భార్యకు భయపడి, పూలిన్‌కు వార్తలు అందించడానికి వచ్చాడు.

ఈ వార్తలలో కొన్ని కొన్ని చిన్న చిన్న వార్తలు. లింగ్‌టాన్ కొడుకులను గురించిన వార్తలూ వున్నాయి. ఈ వార్తలు ఏవిధంగానైనా కలుపవచ్చునేమోనని అతను ఆలోచించాడు. కాని అతనికి ధైర్యం చాలలేదు.

ఏ పెద్ద విషయాల కీ వార్తలు అనుబంధాలో అతనికి తెలీదు. తన్ను పట్టుకుని శత్రువులు చిత్రహింస చేస్తారేమోనని భయపడ్డాడు.

'కొత్త వ్యవస్థ'ను కలవరించి, నిద్రలో మునిగిపోయాడు.

బక్క పిల్ల అతనిమీదికి వంగి, 'ఏమిటి అంటున్నావు? అన్నది. కాని అప్పుడే అతను నిద్రాలోకంలోకి వెళ్ళి పోయాడు. మూడు గంటల తరువాత ఆమె అతన్ని నిద్ర లేపు తుంది. అతను ఆ పిల్లకు ఒక చిన్న నాణెమిచ్చి వెళ్ళిపోతాడు. ఆ మత్తులోనే పూలిన్ వద్దకు వెళ్ళి వార్తలు చెబుతాడు. అతనికి కావలసిందల్లా టీ, 'నల్లమందు' లే.

ఈ ముసలివాని విషయం గ్రామంలో ఎవరూ పట్టించుకోలేదు. రోజు రోజుకూ అతను పసుపుబారడం, ఎండిపోవడం లింగ్‌టాన్ గమనించాడు.

ఈ సంవత్సరం వరదలు వచ్చి, పంటలు నాశనమయ్యాయి.

కాని లింగ్టాన్ ఇందుకు ఆకాశాన్నికాని, దేవుణ్ణికాని నిందించలేదు.

నగరంలో వ్రూలిన్ శత్రువులుచెప్పినపనల్లా తిరుగు మాటలేకుండా చేస్తున్నాడు. శత్రువులదృష్టికి అత నొక సౌమ్యమైనవ్యక్తిగా కన్పిస్తున్నాడు. అతను శత్రువులిచ్చిన డబ్బంతా కూడబెట్టుకుంటున్నాడు.

వ్రూలిన్ విచిత్రమైనవ్యక్తి. అతనికున్న నీతినియమాలు అతనికున్నాయి. మళ్ళీ ఈ నగరం స్వతంత్రుల వశమయితే వ్రూలిన్ వారిపక్షమే వహిస్తాడు. ఒకనాటికి ఏదోఒక గొప్ప పని చేసిచూపి, తా నేవిధంగా నిర్దోషిఅవ్వనో రుజువుచెయ్య గలనని అతనివిశ్వాసం. ఈలోగా తనకు తో చినంతలో చిన్న చిన్న మంచిపనులు చేసేవాడు. చిన్నచిన్న రిపోర్టులువ్రాసి శత్రువు కిచ్చేవాడు. కాని లింగ్టాన్ గ్రామంవిషయం మాత్రం వ్రాసేవాడుకాదు.

నగరం సముద్రంమధ్య ద్వీపంలా ఉంది. బైటిప్రపం చంనుంచి వార్తలే రావడంలేదు.

వ్రూలిన్కు శత్రువులలోనే ఒక మంచిస్నేహితు డున్నాడు. అతను సైనికుడుకాదు. బొమ్మలుగీసేవాడు. అతను తమసైనికులు రోజూ చేసే దురాగతాలు కళ్ళారాచూచాడు. వారు తాగి స్త్రీలనుచెరచడం చూచాడు. ఒకరోజున ఒంట రిగా ఉన్నప్పుడు వ్రూలిన్తో 'నాకు మరోచోట హృదయం విప్పి మాట్లాడేస్వేచ్ఛ లేదు. నీతోనైనా మావాళ్ళు మీప్రజలకుచేసిన అపకృతిని నే నెంత ద్వేషిస్తున్నానో, నే నెంత సిగ్గుపడుతున్నానో చెప్పగలను. ఈ దురాగతాలన్నీ

మా చక్రవర్తిచెవినిపడితే బావుండునని నా ఉద్దేశం. కాని ఎవరూ ఆయనచెవిని పడెయ్యరు. మా దేశప్రజలుకూడా తమసోదరులు ఇంత దురాగతానికి పాలుపడ్డారంటే నమ్మరు' అన్నాడు.

వూలిన్ ఈ మాటలువిని, చక్కగా సమాధానం చెప్పాడు. రానురాను వారిద్దరిస్నేహం పెరిగింది.

రోజూ అతనూ, ఊలిన్ మాట్లాడుకుంటూండేవారు. తమమాటలద్వారా ఒక్క తన జాతిలోనేకాక ప్రపంచంలో అన్నిచోట్లా యుద్ధంఉన్నదని తెలియవచ్చింది ఊలిన్‌కు.

'నీ కిదంతా ఎలా తెలుసు?' అని అడిగాడు ఊలిన్.

ఆ వ్యక్తి ఊలిన్‌ను తన గదిలోకి తీసుకెళ్ళి ఒక నల్లని పెట్టె చూపించాడు. ఈ పెట్టెను గురించి ఊలిన్ విన్నాడు; కాని, ఎన్నడూ చూడలేదు. ఒక కీ తిప్పగానే పెట్టెలోనుంచి మెల్లగా ఒకస్వరం వినిపించసాగింది. 'విను'అన్నాడు మిత్రుడు. ఊలిన్ వింటున్నాడు.

ఆ పెట్టె ప్రపంచంలో జరుగుతున్న ఎన్నో పెద్ద పెద్ద సంఘటనలను చెప్పడం మొదలెట్టింది.

ఒక జాతి మరోజాతిపై యుద్ధాన్ని ప్రకటిస్తున్నది. పెద్ద పెద్ద పాశ్చాత్యనగరాలపైకూడా తమనగరంపై కురిసినట్లే బాంబులవర్షం కురుస్తోంది. ఇలాటి సంఘటనలతో పోల్చిచూస్తే ఊలిన్ తనగూఢచారులద్వారా వినేవార్తలుచాలాఅల్పమైనవి.

'ఇలాంటిపెట్టెలు ఎక్కడ దొరుకుతాయి?'అని అడిగాడు వూలిన్.

'నే నొకటి తెచ్చిస్తాన్లే'అన్నాడు స్నేహితుడు. తరువాత వారు భయానక యుద్ధఫలితాలనుగురించి మాట్లాడుకున్నారు. 'ఒకనాటికి యుద్ధంలో-చిక్కుకొనని దేశం ఒక్కటీ ఉండదు' అన్నాడు ఆ వ్యక్తి ఎంతో దిగులుగా.

'మావాళ్ళు ఈ యుద్ధానికి ఎంతో ఆనందిస్తున్నారు. ప్రతివాడూ ఎక్కువధనం, అధికారం వాంఛిస్తున్నారు. 'నేను మాత్రం సముద్రంఒడ్డున ప్రశాంతంగాఉన్న మా చిన్నపట్నానికి వెళ్ళి నా భార్యాబిడ్డలతో, ముసలి తల్లి - దండ్రులతో ప్రశాంతంగా జీవించాలని ఉంది. నే నింకేమీ కోరను' అన్నాడు.

'అది చాలు. అంతకంటె కావలసింది ఏముంది?' అన్నాడు ఊలిన్.

తరువాత కొద్దిరోజులకు ఊలిన్‌కు ఆ స్నేహితుడు ఒక పెట్టె కొనియిచ్చాడు. ఆపెట్టెను తనగదిలో ఉంచుకుని రాత్రిళ్లు తన తీరికసమయాల్లో వింటూండేవాడు. చాలాసేపు ఏవో అర్థరహితమైనమాటలు విన్పించేవి తరువాత విచిత్రమైనసంగీతం వినిపించేది. అప్పుడప్పుడూ నిజం బైటికివచ్చేది. అప్పుడు ఎంతో ఆసక్తితో వినేవాడు ఊలిన్. విదేశప్రజలు ఎలాంటి దురవస్థలపాలవుతున్నదీ, దేశపరిపాలకులు ఎలా పరదేశాలను అన్యాయంగా ఆక్రమిస్తున్నదీ వినేవాడు

ఒకనాడుఅంతా విన్నతరువాత వణికిపోతూ నిద్రపోయాడు. 'పాడుకాలం' అని గొణుక్కున్నాడు.

'ఏమిటి కలవరిస్తున్నావు? నీవుతాగిన కోడిపులుసు

ఏదో పాడువాసన వేస్తోందనుకుంటాను!' అన్నది భార్య. ఊలిన్ మూలిగాడు. ప్రపంచం ఎలా వశించిపోతున్నదీ తన భార్యకు ఎలాచెప్పాలో అతనకి తెలీలేదు.

ఒకరోజున ఊలిన్ ఆ పెట్టెనువింటూండగా లింగ్ టాన్ జ్ఞాతి వచ్చాడు. పెట్టె ఏమిటని అడిగాడు.

ఊలిన్ ఆ పెట్టెనుగురించిన వివరాలన్నీ చెప్పాడు. స్విచ్చివేసి పెట్టెవినిపించేట్టుచేశాడు. అప్పుడు సంగీతం విన్పించింది.

ఆ పెట్టెను వింటూంటే అలాటిది ఒకటి కొను క్కుంటే బావుండుననిపించింది ఆ ముసలాడికి. అలాంటి పెట్టె కొంటే, తను రహస్యంగావిని, టీ దుకాణంలో అందరికీ చెప్పవచ్చు. అలా డబ్బుసంపాదించవచ్చు. అలా డబ్బుతో తన ఇష్టంవచ్చినట్టు ఉండొచ్చు, అనుకున్నాడు ముసలాడు.

ఆ రోజంతా ఆ పెట్టెనువింటున్నట్టు నటిస్తూ కూచు న్నాడు ఆ ముసలాడు. చివరకు ఊలిన్‌ను పిలిచారు.

'నువ్విక్కడ ఉండడం మంచిదికాదు. మనం పెట్టెను వినడం శత్రువులఆజ్ఞలకు విరుద్ధం. నువు ఈ పెట్టెను వింటు న్నట్టు తెలిస్తే, ఏదైనా ఉపద్రవం రావచ్చు', అన్నాడు ఊలిన్.

'ఈ కాస్త వినిపోనీ' అని అర్థించాడు ముసలాడు. ఊలిను సరేనని వెళ్ళిపోయాడు.

ఊలిను వెళ్ళిపోయిన తరువాత ముసలాడు ఆ పెట్టెను చాటుగా చంకలోపెట్టుకుని నల్లమందు దుకాణానికివెళ్ళాడు. అతను యథాస్థానంలో కూచున్నతరువాత ఆ పిల్ల నోట్లోపెపు

పెట్టగానే "నీవు ఇంతకంటె ఎక్కువ డబ్బుచేసుకోదలుచు కున్నావా?" అన్నాడు.

'ఎలా? నువు నన్ను ఉంచుకోదలుచుకున్నావా?' అని అడిగింది ఆ పిల్ల.

'కాదు. నాకు ఇదివరకే ఒకస్త్రీ ఉన్నది' అన్నాడు ముసలాడు.

'అయితే మరేమిటి?'అన్నది ఆ పిల్ల.

'ఒకగుక్క తాగనీ, చెబుతాను'అన్నాడు. ఒకగుక్క తాగి, కాస్సేపు నిద్రించి లేచి, తన ప్లానంతా ఆ పిల్లకు చెప్పాడు. ఆ పిల్ల ముఖాన్ని చిన్నఅరచేయిలా కుంచించుకుని విన్నది.

'పిచ్చిముసలాడా! పెట్టె నిక్కడ ఉంచి వెళ్ళు. ఇక్కడికి ఎవరూ రారులే'అన్నది.

ఆపెట్టె నక్కడ పెట్టి స్విచ్ వేసి కాచుకునికూచున్నాడు. ఒకక్షణం తరువాత ఒకగొంతు మాట్లాడనారంభించింది.

'స్వతంత్రదేశంనుంచి వస్తున్నవార్తలు,' అని ప్రారంభించి, ఆ గొంతు శత్రువుకురిపిస్తున్న బాంబులవర్షాన్నిగురించి చెప్పింది. చివరకు, 'కాని మనం ఒంటరివాళ్ళం కాదు. ఈనాడు పాశ్చాత్యదేశాలలోకూడా ప్రజలు భూమిలో గుంటలుత్రవ్వుకుని, దాక్కుంటున్నారు. ప్రతిచోటా ఒకే శత్రువు ప్రజలను అణుస్తున్నాడు. కాని మనం లొంగం'—

వృద్ధునికి ఒక వింతశబ్దం విన్పించింది. ఒక్కపిల్లవంక చూచాడు. ఆ పిల్లచేతులు గొంతుదగ్గర ఉన్నాయి - గొంతు

నులుముకుంటునట్టు. ముసలాడు స్విచ్చితిప్పేసి, 'ఏమిటి!' అన్నాడు ఆదుర్దాగా.

'ఇంకా శత్రువుతో పోరాడుతున్నారా? పోరాటం ఆగిపోయిందనుకున్నానే!'అన్నది పిల్ల.

'ఈ పెట్టెచెప్పినదల్లా నిజమే!' అన్నాడు ముసలాడు.

'అయితే అదృష్టం మనఅరచేతుల్లో ఉన్నదన్నమాట' అన్నది పిల్ల.

చాలా రోజులవరకూ ఆ ముసలాడు భార్యతో అబద్ధాలుచెప్పడం మొదలెట్టాడు. కొన్నాళ్ళవరకూ అతని అబద్ధాలు నమ్మింది.

ముసలాడు నల్లమందుకు పూర్తిగా అలవాటు పడిపోయాడు. ఎక్కువ ఖరీదుగల నల్లమందుపొగపీల్చి, ఏవేవో కలలుకంటూ నల్లమందు దుకాణంలోనే పడిఉండేవాడు. అత నెక్కడ ఉన్నాడో ఆ బక్కపిల్లకుకూడా తెలీదు.

## 14

ఈలోగా లింగ్‌టానుగ్రామస్థులంతా ఈ ముసలాడు ఎక్కడికిపోయాడా అని ఆశ్చర్యపడసాగారు. అతని భార్య లింగ్‌టాన్‌ను ఆడిపోసింది. రోజూ లింగ్‌టాను ఇంటికి వచ్చి,ఏడుపులూ పెడబొబ్బలూపెట్టేది.

ఆమెభయం ఊలిను ఇంటికి వెళ్ళివస్తూ అతను శత్రువులచేతుల్లో పడ్డాడని. లింగ్‌టానుతో నగరానికివెళ్ళి ముసలాడి విషయం కనుక్కురమ్మని పోరుపెట్టింది.

లింగ్టాను తన రెండో కొడుకుతో ఆలోచించాడు. 'నేను వెడతాను. నేను చాలారోజులనుంచి ఊలినుతో మాట్లాడుదామనుకుంటున్నాను' అన్నాడు రెండో కొడుకు.

'నువ్వు వెడతావంటే నాకు భయం' అన్నాడు తండ్రి. తల్లికూడా వద్దన్నది. కాని ఈ రోజుల్లో లాయ్‌ఎక్, శేద్‌లు తమయిష్టంవచ్చినట్టే చేస్తున్నారు.

ఒకనాడు లాయ్‌ఎర్ ధైర్యంగా ఊలిన్ ఇంటికి వెళ్ళాడు. వాకిట్లో ఊలిన్ బావమరదినని చెప్పి క్షేమంగా లోపలికి వెళ్లాడు. ఒకగదిలో అతన్ని వేచిఉండమని చెప్పారు. లాయ్‌ఎక్ ఆ గదిలోకూచుని నలుమూలలా కలయచూచాడు. ఆ గది అందచందాలకు ఆశ్చర్యపోయాడు. ఊలిన్ చక్కని సిల్కు గౌనువేసుకుని ప్రవేశించాడు. లాయ్‌ఎక్ నిశ్చలంగా నవ్వి, 'ఎంత అందంగా ఉన్నావు బావా!' అన్నాడు. ఊలిన్ తన సహజసౌజన్యంతో 'బాగానేఉన్నాను' అన్నాడు. తనఅత్తవారి క్షేమసమాచారాలు ఎంతో మర్యాదగా విచారించాడు.

లాయ్‌ఎక్ తమబంధువు కనుపించకుండాఉన్నవిషయం చెప్పాడు. ఊలిన్ నవ్వి, లేచి, తలుపుతెరచి ఎవరైనా వింటున్నారేమో చూచివచ్చికూచుని, జరిగినదంతా ఉన్నదున్నట్టుగా చెప్పేశాడు. ఎలా వారు వార్తలు అందచేస్తున్నదీ, ఒకరోజున ముసలాడు పైకైను ఎలా దొంగిలించినదీ చెప్పాడు.

'నాకు నగరంలోకూడా వార్తలందించే వారున్నారు. చివరకు ముసలాణ్ణి కనుకోగలిగాం' అన్నాడు ఊలిను నవ్వుతూ.

'నువు మాకు విరోధివనుకున్నాం. ఒకప్పుడు నీచావునే కోరాను' అన్నాడు లాయ్‌ఎక్.

'నేను ఎవ్వరికీ వ్యతిరేకినికాను,' అన్నాడు ఊలిను తన ప్రశాంతమైన చిరునవ్వుతో.

'నువు మావైపేనా?' అన్నాడు లాయ్‌ఎక్.

'కాలాన్నిబట్టి అవసరమైనంతవరకు' అన్నాడు ఊలిను. తరువాత ముసలాణ్ని ఎక్కడ కనుక్కోగలడో చెప్పాడు. 'ఈ సమయంలో నల్లమందు తాగి పడిఉంటాడు. 'ఎల్లో టీ హౌస్' లోపలి గదిలోకి వెళ్లు. అక్కడ ఉంటాడు' అని చెప్పాడు.

తరువాత లాయ్‌ఎక్‌ను వేచి ఉండమని చెప్పి, తన భార్యా, పిల్లల్ని పిలిచాడు. లాయ్‌ఎక్ తన చెల్లెలిని చూచాడు. ఇప్పుడామె మూడోబిడ్డను కన్నది. పిల్ల లావుగా ఉన్నది.

'నువు కనుపించేటంత సుఖంగా ఉన్నావా?' అని అడిగాడు లాయ్‌ఎక్. ఆమె నవ్వింది.

'నువు సంతృప్తిగా ఉన్నావా?' అని అడిగాడు లాయ్‌ఎక్ ఊలిన్‌ను.

ఊలిను 'యీ ప్రపంచంలో పూర్తిసంతృప్తి ఎవరికున్నది?' అని తను సహజంగా నవ్వే నిశ్చలమైన చిరునవ్వు నవ్వాడు.

అతని పిల్లలు వచ్చీరాని మాటలతో సగం శత్రువుల భాష, సగంతమభాషమాట్లాడుతున్నారు. లాయ్‌ఎక్ ఇదంతా

అయిన తరువాత వీరుకూడ తనరక్తబంధువులే అనేభావంతో వెళ్ళిపోయాడు.

లాయ్‌ఎక్ సరాసరి ఎల్లో టీ హౌస్‌కు వెళ్ళలేదు. మొట్టమొదట తన తండ్రిని తీసుకురావాలనే ఉద్దేశంతో గ్రామానికి వెళ్ళాడు. ఇంటికి వెళ్ళినతరువాత తండ్రితో రహస్యంగా ఊలినుచెప్పిన విషయమంతా చెప్పాడు. లింగ్‌టాను ఇంత వింతగాథ ఎప్పుడూ వినలేదు. తనబంధువూ, అతని భార్యా వార్తాహరులని వినగానే గంభీరత వహించి, పెదవి కొరుక్కుంటూ కూచున్నాడు. చాలసేపు ఈ వార్తలు ఏమై ఉంటాయాఅనిఆలోచించసాగాడు. తనకొడుకునుఎన్నోసూక్ష్మమైన ప్రశ్నలు అడిగాడు. కొడుకు, 'అతను మంచివాడో కాదో మనం చెప్పలేము. అతని కతను మంచివాడు. అలా అయిన పక్షంలో మనకు ప్రమాదంలేదు' అన్నాడు.

'మనరహస్యపుగదివిషయం అతనికి తెలుసా?' అని అడిగాడు లింగ్‌టాన్.

'ఎవరికి తెలుస్తుంది? మనం అతన్ని ఎలా అడగగలం!' అన్నాడు కొడుకు.

'అతనికి తెలిస్తే మనప్రాణాలు అతనిచేతుల్లో ఉన్నాయన్నమాట' అన్నాడు లింగ్‌టాన్. ఇలాఅని తనబంధువు భార్యను తిట్టిపోశాడు. ఆమె కనుపిస్తే గొంతునులిమేద్దామన్నంత కోపంవచ్చింది.

ఆ మరునాడుసాయంత్రం లింగ్‌టాన్, అతనికొడుకు నగరానికి వెళ్ళారు. లింగ్‌సాకుకూడా చెప్పలేదు. సరాసరి ఎల్లో టీ హౌస్‌వైపుకు నడకసాగించారు.

నగరంలో ప్రతివీధిలో ఎంతో మార్పు కన్పించింది. ప్రతిచోటా శత్రువులు వారివస్తువుల, మందుల, వేశ్యల ప్రకటనలు అంటించారు. వారు హెచ్చుగా అమ్మేది మత్తు మందులూ, వేశ్యలూ అనుకున్నాడు లింగ్‌టాన్. నల్లమందు దుకాణాలకు, బోగంకొంపలకు లెక్కే లేదు.

నగరంలోని టీ దుకాణాలలో ఒక కొత్తచెడు ప్రవేశించింది. పూర్వం మర్యాదస్తులైన వెయిటర్ల స్థానంలో చురుకైన స్త్రీలు వచ్చారు. లింగ్‌టాను కూచోగానే ఒక స్త్రీ వెయిటరు వచ్చింది. మొదట లింగ్‌టాను మాట్లాడలేదు. మర్యాదస్తులెవరూ ఆమె చూపుల్ని భరించలేదు. తరువాత కొడుకు తండ్రి చెవిలో రహస్యంగా 'ప్రతిచోటా ఇంతే' అన్నాడు.

'అయితే నువ్వే టీ తెమ్మని చెప్పు' అన్నాడు.

ఆ స్త్రీ విరసంగా నవ్వి వెళ్ళి రెండుగిన్నెలు టీ తీసుకొచ్చి యిచ్చింది.

ఒక గిన్నె టీ ఖరీదు వినేసరికి లింగ్‌టానుకు ఇంచుమించుగా ఏడ్చినంతపనయింది. టీ తాగలేకపోయాడుకూడాను.

'దీనికే నీ వింత భయపడితే దీనికేమంటావ్?' అంటూ తన జాకెట్‌లోనుంచి ఒక వెండిభరిణెతీసి చూపింది. అందులో తెల్లనిపొడివుంది.

'ఒక ఔన్సు 300 వెండిడాలర్లు. ఒక డాలర్‌తో ఒక నాటిసుఖాన్ని కొనుక్కోవచ్చు. బాధలన్నీ తీరుతాయి' అన్నది.

ఎంతో రహస్యంగా చూపుతున్నట్టు చూపి, మళ్ళీ జాకెట్టులో పెట్టేసుకుంది. ఆమె వెళ్ళిపోయిన తరువాత 'దెయ్యపు మందు' అని గొణిగాడు లాయ్‌ఎన్.

వారుకూచున్న గది ఒకప్పుడు ఎంతో అందంగా ఉండేది. ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. శత్రువులు గోడలకు ఉన్న చిత్రాలన్నీచింపేశారు. పొగతో బొమ్మలుగీసిన చూరంతా నల్లబడింది. లింగ్‌టాను, అతనికొడుకూ గది నలుప్రక్కలా కలయచూస్తూ కూచున్నారు.

పూర్వపురోజుల్లో అంతమంచి టీ దుకాణానికి రైతులు వచ్చేవారుకాదు. ఇప్పుడు యుద్ధం అందరినీ దరిద్రులనుచేసింది. అందుచేత అక్కడ అందరూ ఒకేవిధంగా కనుపిస్తున్నారు.

కొద్దిసేపటికి ఒక చిన్న తలుపు తెరుచుకొని లింగ్ టాను బంధువు వచ్చాడు. లింగ్‌టాను తనకళ్ళను తనే నమ్మలేక పోయాడు. ఈ కొద్దికాలంలో ఆ ముసలాడు ఎంతో మారిపోయాడు. ఎక్కడో వేలంలో ఒక మురికి సాటిను అంగరఖాకొని, తగిలించుకున్నాడు. అతని కది చాలా పెద్దదయింది. అతను వాళ్ళను చూడలేదు. కాళ్ళీడ్చుకుంటూ లోపలికి వెళ్ళాడు.

ఒక కుర్చీమీద కూచుని తనను గురువుగా, అందరినీ శిష్యులుగా భావిస్తూ 'వినేవాళ్లువినండి—నేటివార్తలు. కొన్ని మంచివార్తలు. కొన్ని చెడ్డవార్తలు. మన రాజధాని నుంచి చెడువార్తలువచ్చాయి. శత్రువిమానాలు చెప్పరానిఘోరాలు చేస్తున్నాయి. కాని మన నాయకుడు అచంచల ధైర్యంతో ఉన్నాడు. ఆఖరువరకూ అందరూ పోరాడాలి' అన్నాడు.

అందరిలో గుసగుసలు ప్రారంభమైనాయి. ఒకగొంతు 'మనం పోరాడాలంటున్నాడు. మనసైన్యం బలపడుతోందా!' అన్నది.

మళ్ళీ ముసలాడు ప్రారంభించాడు - 'సముద్రాలకవ తలి దేశాలనుంచి వచ్చినవార్తలు కొన్ని మంచివి, కొన్ని చెడువీను. పశ్చిమాన, పశ్చిమశత్రువు ఇంగ్ దేశనగరాలను ధ్వంసంచేస్తున్నాడు.'

అందరూ ఆశ్చర్యంతో వింటున్నారు. ఆ ముసలివాని కీ వార్తలన్నీ ఎలా తెలిసినవో ఎవరికీ తెలీదు.

ముసలాడు మళ్ళీ ప్రారంభించాడు, 'మరోవార్త! ఇంతవరకూ దాచిఉంచాను! అన్నివార్తలలోకి చెడువార్త! ఈ నగరంలో శత్రువు ఒక కీలుబొమ్మను ఉంచబోతున్నాడు! ఆ కీలుబొమ్మ మనలను పరిపాలిస్తాడు! వాడికి మనం ఆజ్ఞా బద్ధులమై ఉండాలి!'

ఈమాట వినేసరికి పెద్ద గొణుగుడు ప్రారంభమైంది. వృద్ధుడు తనకు తెలిసిన వార్తలన్నీ చెప్పడంముగించి లేచి ఒక చిన్నగిన్నె తీసి కుర్చీమీదఉంచి, సిగ్గును కప్పిపుచ్చు కోడానికై వెనుదిరిగి నిల్చున్నాడు. కొందరులేచి ఆ గిన్నెలో చిన్నచిన్ననాణాలు వేశారు. లింగ్‌టాన్, అతనికొడుకుకూడా వేశారు.

తరువాత అందరూ ఇళ్ళకువెళ్ళారు. లింగ్‌టాన్ త్రోవలో ఆ ముసలివాని విషయంకంటె ఆ ఊళ్లో శత్రువులు నెలకొల్పనున్న కీలుబొమ్మవిషయం ఆలోచించసాగాడు. ఆ కీలుబొమ్మనుగురించి ఊహించేకొద్దీ అతనిలో అసహ్యం పొంగెత్తసాగింది.

'ఈ రోజుల్లో ఎవరిహృదయం ఎవరుకనిపెట్టగలరు?' అను కున్నాడు లింగ్‌టాన్.

ఇంటికి వెళ్ళేదారిలో వారిచుట్టూ విశాలమైన పొలాలు వ్యాపించి ఉన్నాయి. గ్రామాలుమాత్రం శిథిలాలై కనుపిస్తున్నాయి. కొన్ని గ్రామాలు కాలి, పొగచూరిఉన్నై. ప్రజలందరూ చెదరిపోయారు. పూర్వం నగరానికి ధాన్యం, కూరలు అమ్మడానికివెళ్ళే రైతులతో నిండిఉండేత్రోవ ఇప్పుడు నిర్జనంగాఉంది.

లింగ్‌టాన్ భూమివంకచూచి, 'మనం పుడమితల్లికి ద్రోహంచెయ్యకూడదు' అన్నాడు.

...మరునాడు లింగ్‌టాన్ బంధువుభార్య తన భర్త విషయం తెలుసుకోడానికి లింగ్‌టాన్ వద్దకు వచ్చింది. లింగ్‌టాన్ ఒక అబద్ధం ఆడాడు: 'నీ భయం నిజమైంది. నీ భర్త చనిపోయాడు. నీ విక అతన్ని చూడలేవు. నువ్వింక విధవరాలివి' అన్నాడు.

ఈ మాట వినీవినడంతోటే ఆమె పెద్దగా విలపించసాగింది.

'ఎలాచనిపోయాడు? అయనశవం ఎక్కడుంది?' అని అరవసాగింది.

'ఆ సంగతి అడగొద్దు. అతని శరీరం మనకు దక్కదు'

ఆమె స్తబ్ధురాలైపోయింది. ఆమె జీవితంలో మొట్టమొదటిసారిగా ఆమెను భయం, దుఃఖం ఆవహించాయి. ఇంటికివెళ్ళి ఏడుస్తూ ఆలోచించసాగింది. ఇక ఒంటరిదైంది. ఆమె గతి ఏంకావాలి? తను వూలిజ్‌కు వార్తలు చేరవేస్తున్నట్టు లింగ్‌టాన్‌కు తెలుసేమోనని భయపడసాగింది.

రెండురోజుల తరువాత వచ్చి లింగ్‌టాన్‌వద్ద మోకరిల్లి 'నీ కంటె నాకీ ప్రపంచంలో ఎవరున్నారు. ఇక నువ్వేదిక్కు' అన్నది.

లింగ్‌టాన్ నిశ్చలంగా 'నేను అన్నం తిన్నంతకాలం నీకూ తిండిపెడతాననినమ్ము' అన్నాడు.

లింగ్‌టాన్ ఈ రహస్యాన్ని తనభార్యకుకూడా చెప్ప లేదు. కాని లాయ్‌ఎర్ జేడ్‌కు అంతా చెప్పేశాడు. లాయ్‌ఎర్‌కు తనలోతనకు ఎంత నమ్మకమున్నదో జేడ్‌లో అంతనమ్మకం ఉంది. ఈ విషయం వినగానే జేడ్ నవ్వింది. కాని కీలుబొమ్మప్రభుత్వంసంగతి వినగానే జేడ్ నిర్విణ్ణురాలైంది. ఈ దుర్వార్తవిన్నతరువాత ఆమె చాలాసేపు అలాగే కూర్చుండిపోయింది. 'ఈ కీలుబొమ్మలు అసలుశత్రువులకంటె పెద్దశత్రువులు' అన్నది.



## 15

కొండలలోవారు, యువకులు, ముసలివారు శత్రువును కడకంట ప్రతిఘటించితీరుతారని ఎవరుచెప్పగలరు? కాని వారా నిశ్చయానికి వచ్చినమాటమాత్రం వాస్తవం. ప్రపంచమంతా ఇలాగే, తమలాటి అభాగ్యులే స్వాతంత్ర్యంకోసం పోరాటంసాగిస్తున్నారు.

లింగ్‌టాన్‌హృదయంలో రానురాను ఒకవిధమైన అలుపు ఏర్పడింది. ఈసంవత్సరం మళ్ళీ పంటరాగానే శత్రువు

నిర్ణయించినధరకు విక్రయించేశాడు లింగ్‌టాన్. శత్రువు ఆ ధాన్యాన్ని మరోచోట హెచ్చుధరకు విక్రయించాడు. లింగ్‌టాన్ మాంసం రహస్యంగా తినవలసివచ్చింది. ఒక రోజున దురదృష్టవశాత్తు అతనిపందుల్ని పట్టుకొని శత్రువులు తీసుకెళ్ళారు. ఎలాగోఒకలా మరొకపందిస సంపాదించవలసి వచ్చింది. పన్నులు అధికమైనాయి. భూమి, నల్లమందు, ధాన్యం, అన్నిటిపైన పన్నులే.

ఈ ప్రళయం ఇలా సాగుతూండగా జేద్‌కు మళ్ళీ నెలలు నిండుతున్నై. లాయ్‌ఎర్ నగరానికి, కొండలకూ వెళ్ళివస్తున్నాడు. ఎన్నోసార్లు అతను ప్రాణాలు గుప్పిట్లోపట్టుకుని తప్పించుకోవలసివచ్చింది. అతన్ని కొండలలోకి పంపేటప్పుడల్లా జేద్ అతనితో, 'జాగ్రత్తగావెళ్ళిరా' అని చెప్పిపంపుతూండేది.

లాయ్‌ఎర్ పని కొండలోకి వెళ్ళడం—అక్కడనుంచి గ్రామాల్లోని రైతులవద్దకురావడం. ఒక ప్లానుపై అందరూ కలసి ఒకేసారి శత్రువును ప్రతిఘటించేట్లు చెయ్యడానికై ఈ యత్నమంత్రాను. లాయ్‌ఎర్ సామాన్యవార్తాహరుడు కాదు. శత్రువులచేతినుంచి తప్పుకోవడంలో మహా నేర్పరి. ఒక్కొక్కసారి వర్తకునివేషంలో, బిచ్చగాని వేషంలో, ముసలివాని వేషంలో—అనేక వేషాల్లో వెళ్ళేవాడు.

లింగ్‌టాన్ చిన్న కొడుకు ఇప్పుడు సైనికులు ధరించే యూనిఫారం ధరిస్తున్నాడు. అతనిమనస్సంతా యుద్ధంతో మృత్యువుతో నిండిఉన్నది. అతనికి ప్రపంచంలో హింసతప్ప అన్ని విషయాలూ అనవసరంగా కనుపిస్తున్నాయి. పుస్తకాలు, విజ్ఞానం, చదువు—అన్నీ పనికిరానివే; తుపాకిఒక్కటే

మంచిది—అతనిఉద్దేశంలో. అత సింకా ఎత్తుగా పెరిగాడు. ఒళ్ళు బంగారంలా మిలమిలా మెరుస్తూంది. కళ్లు పులికళ్ళలా అనుక్షణం అవిరామంగా భయంకరంగా ఉన్నాయి. ఇరవై మందిభార్యలకైనా భర్త కాదగినట్టుగా వున్నాడు.

అతన్నిచూచిన ఏ స్త్రీకూడా అతన్నివరించకుండా వదలిపెట్టదు. శీలవతికి అతన్నివరిస్తున్నట్టు తెలీదు. శీలహీనకు తెలుస్తుంది; అంతే తేడా.

అతన్ని ఎందరో స్త్రీలు ఆహ్వానించారు. కాని అతను అందరినీ అసహ్యించుకున్నాడు. ఒకరిద్దరుస్త్రీలతో సంబంధ మున్నప్పటికి తనకుతగిన స్త్రీ అతనికి కన్పడలేదు.

అలాంటిస్త్రీ ఎక్కడ దొరుకుతుంది?

పదకొండో నెలచివరలో ఒకనాడు లాయ్ఎక్ కొండ ల్లోకి వెడుతూండగా అతనితమ్ముని స్నేహితుడు అతన్ని పిలి చాడు. అది ఒకఆలయంలోనిగది. ఆ ఆలయం దయాదేవత 'క్వాన్—ఇన్'కు చెందినది ఈ దేవతను స్త్రీలుమాత్రమే పూజిస్తారు. లాయ్ఎక్ను లోపలకుతీసుకెళ్ళి తమనాయకుని ఆగ్రహస్వభావాన్ని గూర్చి చెప్పాడు.

'నాతమ్ముడు అంత ఆగ్రహపరుడా?' అన్నాడు లాయ్ఎక్.

'అవును. మే మందు కేమీ అనుకోము. ఆయనకు ప్రస్తుతం కావలసినది ఆయనకుతగినస్త్రీ. అతన్ని చల్లబరచ గలస్త్రీ కావాలి' అన్నాడు.

లాయ్ఎక్ నవ్వాపుకోలేకపోయాడు. 'అలాగే చేస్తాను.

కాని నా తమ్ముడికి ఎలాంటిభార్య కావలెనో నాకు తెలీదే' అన్నాడు.

అతను గభీరంగాచూచి, 'ఆయనకు భార్యదొరకడం సామాన్యంకాదు. అతనిలాగానే బలశాలికావాలి. ఆయన మండిపడితే ఆమె చల్లగావుండాలి.' అన్నాడు.

'అలాంటిస్త్రీలు లోకంలో చాలా తక్కువమంది ఉంటారు.' అన్నాడు లాయ్‌ఎక్. అతనికి జేడ్ జ్ఞాపకం వచ్చింది. జేడ్ కూడా అంత విజ్ఞురాలుకాదు.

ఇరువురూ ఒకనిమిషం మౌనంగా నిల్చున్నారు. తరువాత ఆవ్యక్తి 'ఇక్కడొక విచిత్రదేవత ఉన్నది' అన్నాడు - 'మా నాయకుడు అప్పుడప్పుడూవచ్చి, ఈ దేవతను చూచిపోతుంటాడు' అన్నాడు.

'వచ్చిచూస్తాడా?' అన్నాడు లాయ్‌ఎక్.

'అవును. అలాచూడడంవల్లనే ఆయనకు భార్యకావలెనని మేము గ్రహించాం' అన్నాడు ఆ వ్యక్తి.

'సరే, నేను మా తండ్రితో నువుచెప్పిన విషయాలన్నీ చెబుతాను' అన్నాడు లాయ్‌ఎక్. ఆ వ్యక్తి నమస్కరించి వెళ్ళి పోయాడు. లాయ్‌ఎక్ పైకివెళ్ళి దేవతను చూచాడు. తనజీవితంలో దేవతవంకచూడడం అదే మొట్టమొదటిసారి. అతనుకాని, అతని తండ్రికాని ఎన్నడూ ఆలయాలకువెళ్ళి దేవతలను అర్చించలేదు. ఆవిషయం ఆడంగులకేవదిలిపెట్టారు. లాయ్‌ఎక్ ఈనాడు ఒంటరిగానిల్చుని, దేవతవంక చూచాడు. దేవత విచిత్రంగా ఉంది. దేవతకాళ్లు చిన్నవి. చుట్టచుట్టుకున్న

"డ్రాగన్" పై పెట్టి ఉన్నది. చక్కని అంగవిన్యాసం శిల్పి ఎంతో అందంగా మలిచాడు. జీవం ఉట్టిపడుతోంది. అపూర్వశిల్పి కావడంవల్ల ఒక స్త్రీ ఒక పురుషుని దృష్టిలో ఎలా పరిపూర్ణ స్త్రీ అవుతుందో ఆ పరిపూర్ణతనంతా ఈ విగ్రహంలో నిక్షేపించాడు.

ఒక దేవతను మలచినప్పటికీ ఎంతో రహస్యంగా, ఎంతో తెలివిగా ఆ విగ్రహంలో చక్కని స్త్రీత్వాన్ని మలిచాడు. దీర్ఘమైన కొనలుతేరిన నేత్రాలు తెలివితో నిండి ఉన్నాయి. గర్వంతోకూడిన పెదవుల్లో నాజూకైనవంకెలు తీర్చాడు. దుస్తులవెనకాల కనుపించకుండా కనుపించే రేఖలు, మూసినాదాగని వక్షస్థలం – ఎంతో అందంగాఉంది. ఆ దేవతను చూచినకొద్దీ అతనికి ఎక్కడాలేని స్త్రీత్వం గోచరించింది.

అదేసమయంలో అతనితమ్ముడు అక్కడికివచ్చి, 'ఇక్కడేంచేస్తున్నావు?' అన్నాడు. లాయ్‌ఎక్ దేవతవంకచూపించి, ఇదివరకు ఇంతదగ్గరగా ఈ దేవతను చూడలేదు' అన్నాడు.

'మట్టి, రంగు. మరేమున్నది?' అన్నాడు తమ్ముడు.

'అంతకంటే విశేషంఉన్నది. ఈదేవతను మలిచినశిల్పి ఈదేవతను ప్రేమించాడు' అన్నాడు తనతమ్ముని హృదయ రహస్యం తెలుసుకోడానికి.

అతనితమ్ముడు ఆ దేవతవద్దకువచ్చి చూచి, 'ఇలాంటి స్త్రీలు ఉండరు' అన్నాడు. 'ఉంటే పెళ్ళిచేసుకుంటానంటావా?' లాయ్‌ఎక్‌నవ్వుతూఅడిగాడు.

'నాకు భార్యఎందుకు? నేను పోరాటానికివెడితే ఆమె నేంచేసుకుంటాను?' అన్నాడు లాయ్‌సాన్.

'ఇంట్లో వదలివెళ్ళు' అన్నాడు లాయ్‌ఎక్.

'ఎందుకు? ఏడుస్తూ వెళ్లొద్దని నాకాళ్ళకు అడ్డుపడడానికా?' అన్నాడు.

'ఈ దేవత ఏడవదులే' అన్నాడు లాయ్‌ఎర్. తరువాత వారు యుద్ధాన్నిగురించి మాట్లాడుకున్నారు.

మరుసటిరోజు రాత్రి లాయ్‌ఎక్ ఇంటికి తిరిగివచ్చిన తరువాత తన తమ్ముని విషయం తండ్రితో చెప్పాడు. లింగ్‌సా, జేడ్‌కూడా విన్నారు. తరువాత లింగ్‌టాన్, 'పైకి హాస్యాస్పదంగా కనుపించినా ఈ విషయం తీవ్రమైనదే. నా కుమారుని హింసాప్రతిన నన్నెంతో కలవరపెడుతోంది. ఒకరినిహననం చేసేవాడు అలాగే హననమైపోతాడు. 'ఇలాంటివారు మంచి భర్తలు, మంచి తండ్రులు కారన్నాడు.

'కాని, క్వాన్-ఇన్ లాంటి స్త్రీని ఎక్కడ తీసుకురాగలం?' అన్నది లింగ్‌సా—'దేవతలాంటి స్త్రీని నేనెక్కడా చూడలేదు'

'నేసమాట వాస్తవమే. కాని అతని దృష్టిలో అలా కనుపించే స్త్రీ అయితే చాలు' అని జేడ్ భర్తవంకచూచి నవ్వింది. భర్త నవ్వుతున్నకండ్లతో ఆ నవ్వును స్వీకరించాడు.

'అసలు స్త్రీలే దొరకడం కష్టంగాఉంటే, ఇలాంటి స్త్రీ ఎక్కడ దొరుకుతుంది?' అన్నది లింగ్‌సా.

'ఎలాగో ఒకలా ఒక స్త్రీని స్వేచ్ఛాదేశంనుంచి సంపాదిద్దాం' అన్నది జేడ్.

ఇది ఎలా సాధించడం? వారు పాన్‌షియో క్షేమసమాచారం వినికూడా ఒక సంవత్సరం కావస్తోంది.

ఆ మరునాడు లింగ్‌టాన్ నగరానికి వెళ్ళి, తెల్లదొర సాని భవనంవద్దకు వెళ్ళాడు. ద్వారంమూసిఉన్నది. తలుపులు తట్టగా తట్టగా కాపలావాడు తల బైటికిపెట్టిచూచి 'ఏం కావాలి?' అని అడిగాడు

'తెల్లదొరసానితో మాట్లాడాలి' అన్నాడు లింగ్‌టాన్

'నువు వినలేదా? ఆమె చనిపోయింది' అన్నాడు కాపలావాడు. 'ఒకరోజున ఆలయం తలుపులు తెరచి, లోపలికి వెళ్ళాను. విగ్రహంముందు చనిపోయిపడిఉన్నది' అనిచెప్పాడు కాపలామనిషి-'ముంజేతులు కోసుకుంది. రక్తం ప్రవహిస్తోంది. ఆమెఅంత ఆమే చనిపోయింది.

'అలా చెయ్యడానికి కారణ మేమిటి?' అన్నాడు లింగ్‌టాన్ తొట్రుపడుతున్న స్వరంతో.

కాపలాదారుడు కన్నీళ్లుతుడుచుకుంటూ, 'ఒక ఉత్తరం రాసిపెట్టివెళ్ళిందట. సముద్రంఆవలఉన్న తన బంధువులకు వ్రాసిందట. తను ఓడిపోయానని వ్రాసిందట అందులో'.

'ఓడిపోయింది!' – లింగ్‌టాన్‌కు అర్థంకాలేదు. అతను లోపలికివెళ్ళి వృద్ధకన్యను కలుసుకున్నాడు. ఆమె పాన్‌షియో క్షేమంగానే ఉన్నదని చెప్పింది.

'నేను నా కుమార్తెకు జాబు వ్రాయించదలుచుకున్నాను. చిరునామా ఇస్తారా?'అన్నాడు లింగ్‌టాన్. ఆమె ఒక తెల్లకాగితం మీద చిరునామా వ్రాసియిచ్చింది. లింగ్‌టాన్ ఆ చిరునామా తెచ్చి, జేడ్‌కిచ్చి పాన్‌షియోకు ఉత్తరం వ్రాయమన్నాడు. తనకుమారుని వివాహవిషయంకూడా వ్రాయమన్నాడు.

# 16

గుహలో తన ప్రత్యేకప్రదేశంలో కూచుని, పాన్‌షియో ఉత్తరం చదువుకుంటున్నది. పాన్‌షియో యిప్పుడు ఉత్తరాలు సులభంగా చదివేస్తుంది.

రెండుచేలమైళ్ళ దూరాన్నుంచి జేడ్‌వ్రాసినదే ఈ ఉత్తరం. ఆకాశందాటి, భూమిదాటి, సముద్రందాటి, ఎన్నో చేతులుదాటి వచ్చింది ఈ జాబు. ఈఉత్తరంచేరేసరికి ఇక్కడ మళ్ళీ చలికాలంవచ్చింది. గుహలో చలిగాఉంది.

జాబుచదివిన తరువాత మళ్ళీ ఏమడతకు ఆమడత మడిచింది పాన్‌షియో.

'నేను నా అన్నకు భార్య నెలా సంపాదించగలను? అందులో ఈ అన్నకు!' అనుకున్నది పాన్‌షియో.

తనకుటుంబ మంతటిలోకి పాన్‌షియో మంచి తెలివితేటలుగలది. ఆమెకు వివిధస్వభావాలు బాగా తెలుసు. ఆ కుటుంబం మొత్తంలో పాన్‌షియో ఒక్కతే స్వేచ్ఛాదేశంలో ఉంది.

పాన్‌షియో ఉత్తరందాచి, అటూఇటూ తిరగనారంభించింది. ఆ గుహలో ఇంకా పన్నెండుగురు ఉన్నారు. వారి పక్కచుట్టలుకూడా అక్కడే ఉన్నాయి. కొందరు చదువుకుంటున్నారు. కొందరు మాట్లాడుకుంటున్నారు. కొందరు నవ్వుతూ కబుర్లుచెప్పుకుంటున్నారు. 'వీరిలో తనచిన్నన్నకు తగిన భార్య ఎవరు?' – పాన్‌షియో ఆలోచించింది. కొందరు

ముచ్చటగా ఉన్నారు. కొందరు సాధారణంగా ఉన్నారు. కొందరు పొడుగ్గా, కొందరు పొట్టిగాఉన్నారు. వీరిలో తన అన్నకు తగినభార్య ఎవరూ కనుపించలేదు తండ్రి తనమీద పెద్ద బాధ్యతపెట్టాడు. దేవత! తను దేవతను ఎక్కడ చూచింది.

ఏదో పెద్ద చప్పుడైంది. వారందరూ అరుస్తూ, కేకలు పెడుతూ లేచి, మరోగుహలోకి పరుగెత్తుకెళ్ళారు. అక్కడ వారిఉపాధ్యాయులు వారికోసం వేచిఉన్నారు. మొత్తం 112 మంది అక్కడ సమావేశమైనారు. చిరుచాపలమీద కూచున్నారు.

ఎంతఆలోచించినా పాన్‌షియోకు ఏమీపాలుపోలేదు. అందువల్ల జవాబేమీ వ్రాయలేదు. అనుక్షణం ఆ 112 మందిలో వెదుకసాగింది. వారిలో ఒక్కత్తెకూడా పనికిరాదు.

...కాని ఇటీవల ఆ కొండల్లోకి ఒక స్త్రీ వస్తూండేది. ఆ స్త్రీనిగురించి పాన్‌షియో ఎన్నడూ వినలేదు. ఆమె కొన్నివేలమైళ్ళ దూరంలోఉన్న ఒక విదేశాన్నుంచి ఇక్కడికి వచ్చింది. ఆమెస్వదేశం ఆమెకు జ్ఞాపకంలేదు. కొన్ని సంవత్సరాలక్రితం ఆమెతండ్రి ఆమెను తీసుకొచ్చాడు. ఆమెకు తల్లి లేదు. తండ్రి మళ్ళీ స్వదేశానికి వెళ్ళలేదు. స్వదేశంపేరు చెబితే పిల్లనుకని, చనిపోయిన తనభార్యాస్మృతి అతన్ని బాధించేది. ఆ పిల్ల ఒక మహమ్మదీయ కుటుంబానికి చెందిన స్త్రీ. కనుబొమ్మలు అరవిరిగిన ధనుస్సుల్లా ఉన్నాయి. ముక్కు ఎంతో నాజూకుగాఉంది. కళ్ళు నీలికాంతు లీనుతున్నాయి. సాధారణ స్త్రీలకంటె ఎత్తుగాఉన్నది. తండ్రి ఆ బిడ్డకు ఆ విశిష్టతకే

ఎక్కువగా ప్రేమించాడు. 'మాయలీ' అని నామకరణం చేశాడు.

మాయలీ తన స్వభాష బాగామాట్లాడలేదు దుస్తులు కూడా అధునాతనమైనా స్త్రీలవలెనే అలంకరించుకుంటుంది. తండ్రి ఆమె అభిరుచులకు ఎన్నడూ అడ్డుచెప్పలేదు.

ఒక ఉదయాన ప్రాతఃకాలభోజనంచేస్తూ తన నాజూకైన వృద్ధాంగుళులను వెంటిగిన్నెలో ముంచి, ఇంగ్లీషులో, "నువు దేశానికి తిరిగివెడితే ఏంచేస్తావో ఊహించలేకుండా ఉన్నాను. వారికి ఇంజనీర్లు, మిలిటరీనిపుణులు కావాలి. కాని నీ చదువు ఇంకా పూర్తికాలేదు. పైగా నువు స్త్రీవి'అన్నాడు

మాయ్‌లీకి తల్లిపోలికలు ఉన్నవనుకున్నాడు. కాని ఈ పరదేశంలో పెరగడంవల్ల ఆమెకు కల్లిక స్పష్టంగా భేదం కనుపిస్తోంది. 'ఏదో ఒక పని చూస్తాను' అన్నది మాయ్‌లీ.

ఆమెవిశాలమైన నల్లనికళ్ళు మిలమిలా మెరిశాయి. పధ్నాలుగోసంవత్సరం వచ్చినప్పటినుంచి ఆమెమాట ఆమెదే. తండ్రి ఆమెతో వాదించడంమానేశాడు. ఆమెను వివాహానికి ఒప్పించలేనందుకు తనూ, వూమింగ్ ఇంగ్ (దాసీ నారాయుబారి) రాత్రిలు రాత్రిలు మేల్కొనేవారు. ఆయన గమనించినంత వరకు తనకుమార్తెలో భార్యగాఉండే లక్షణాలు కనుపించలేదు. తన కాబోయేఅల్లుడు ఒకనాడు తన్ను నిందించడం ఊహించుకుని వణికిపోయేవాడు.

మాయ్‌లీని ఎందరో యువకులు ప్రేమించారు. కాని, ఆమె అందరినీ తిరస్కరించింది. ఈవిషయంలో తండ్రిజోక్యం ఏమీలేదు.

'అయితే, నువ్వు వెళుతున్నావన్నమాట' అన్నాడు మిస్టర్ 'ఫూ' నిశ్వసిస్తూ - 'నే నిక ఒంటరిగా ఈ పరదేశంలో ఉండాలన్నమాట!'

మాయ్‌లీ పెద్దగా నవ్వింది. చైనాపిల్లలకంటె బిగ్గరగా నవ్వింది 'నువ్వు ఒంటరిగా ఉండడం నీ తప్పే నాన్నా' అన్నది.

కొన్నివారాలతరువాత మాయ్‌లీ సముద్రప్రయాణం చేస్తోంది. పశ్చిమపర్వతపంక్తియందలి గుహాలలోవున్న స్త్రీల బడి ఆమె కెంతో ఆకర్షణీయంగా కనుపించింది.

ఈ విధంగా ఒక చల్లనిఉదయాన ఆమె పాన్‌షియో బడికి చేరింది. ఒక చిన్న విమానంలో వచ్చింది. దిగిన విమానంపై మంచు పేరుకునివుంది. ఆమెతో రక్షణకైవచ్చిన వారు తిరిగివెళ్ళిపోయారు.

గుహాలో మాయ్‌లీకిచ్చినగది యెంతో బాగున్నది. దక్షిణాన ఒక చిన్న కిటికీ. మాయ్‌లీ కిటికీ తెరచిచూచింది. నగ్నంగావున్న పర్వతపంక్తులు గంభీరసంగీతాన్ని ఆలపిస్తున్న పెద్దసముద్రతరంగాల్లాగా కనుపిస్తున్నాయి. మాయ్‌లి తలుపు తెరచి పర్వతాలనుచూచి ఉద్విగ్నురాలైంది. 'పర్వతాలు నావి, నావి' అనుకున్నది.

ఒక నిమిషం నిశ్చలంగా నిల్చున్నది. మాయ్‌లీకి ఆకలవుతున్నట్లు తోచింది. కొద్దిక్షణాలలో క్లాసులు ప్రారంభిస్తారని వృద్ధసేవకుడు చెప్పాడు. మొట్టమొదట వెళ్ళి, ప్రిన్సిపాల్‌ను చూడాలనుకుంది. ఒక చిన్న అద్దంలో చూచుకుంది. జుట్టుసర్దుకుని, తడితువాలుతో ముఖం తుడుచుకుని

కొద్దిగా పౌడరు అద్దుకున్నది పెదవులకు రంగువేసుకుంది. వూలుగౌను అవతలపెట్టింది.

సిగ్గుపడకుండా తలుపు తెరచుకుని ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళింది. గంభీరంగా కనుపిస్తున్న ఒక తెల్లదొరసాని టేబిల్ దగ్గర కూచుని ఉన్నది.

'మీరేనా మిస్ ఫ్రేం?' అన్నది మాయ్‌లీ.

ఎవరో విదేశీయురాలు మాట్లాడుతున్నట్టు వినిపించి మిస్ ఫ్రేం ఆశ్చర్యంతో తలఎత్తి చూచింది. మాయ్‌లీ ఒక్కతే ఇంగ్లీషు అలామాట్లాడగలదు. 'నా క్రిమె అంటే అంత ఇష్టంకలగడంలేదు' అనుకున్నది మాయ్‌లీ.

'నేను జాగ్రత్తగా ఉండకపోతే ఈ సాహసికురాలివల్ల నాకు చిక్కురావచ్చు' అనుకున్నది మిస్ ఫ్రేం.

ఈవిధంగా ఆ ఇద్దరిజీవితాలూ ప్రారంభమైనాయి.

... పాణషియో మాయ్‌లీని చూడడంతోటే ఆక్రిష్టురాలైంది. విదేశీప్రిన్సిపాల్‌తో కొత్తమాస్టరు వచ్చింది. చిన్నతనంనుంచి ఆమెతో కలిసి పెరిగినంత ధారాళంగా మాట్లాడుతున్నది.

పాణషియో తలఎత్తి చూచింది. పిల్లలలో గుసగుసలు ఆరంభమైనాయి. 'కొత్త పంతులమ్మ!' అని పిల్లలందరూ మాయ్‌లివంక - ఆమెరంగు, ఎత్తు, విదేశస్త్రీలవలె చకచక లాడే ఆమెకదలికలు - ఆశ్చర్యంతో చూడసాగారు.

ఆమెసౌందర్యం పాన్‌షియోను ఆశ్చర్యంలోముంచెత్తింది. టేబిలుకిరింద ఆమెరెండుచేతులూ కరుచుకున్నాయి. ఎక్కడే

నుంచి వచ్చిందో తెలీకుండా ఆమెహృదయంలోకి వెచ్చని మధురానురాగం వచ్చిపడింది.

శిశుసహజమైన అమాయకత్వంతో, 'ఈశ్వరుడు ఈమెను నా అన్నకోసమే పంపించాడు' అనుకున్నది.

మాయ్‌లీ రోజూ ఉదయాన నిద్రలేచి కిటికీలోనుంచి విశాలపర్వతపంక్తినీ—అనంతప్రకృతినీ అవలోకించేది.

కనుచూపుమేరవరకూ పర్వతాలవరుసలు వ్యాపించి ఉన్నాయి. మానవత్వమంతా అరచేతిలో ఇముడగల ఈ చిన్నిగ్రామంలోనే ఉన్నట్టుంది.

ఒకరోజున మాయ్‌లీ క్లాస్‌రూమ్‌లోకివచ్చేసరికి పాన్ షియో వంగికూచుని పుస్తకంచూస్తూ ఏదోగొణుక్కుంటోంది.

'ఏంచదువుతున్నావమ్మాయ్?' అన్నది మాయ్‌లీ అనాసక్తంగా. పాన్ షియో అందరుపిల్లల్లోకి చిన్నదని అనుకున్నది మాయ్‌లీ.

పాన్ షియో తనంతతాను కావాలనే క్లాస్‌రూమ్‌కు పెందరాళే వచ్చింది. ఈ గదిలో కొద్దిసేపట్లో తన ప్రియమైన పంతులమ్మ లెక్కలుచెప్పబోతున్నది. మాయ్‌లీ గదిలోకి వచ్చి ఈ ప్రశ్న అడగ్గానే పాన్ షియో నిశ్శబ్దంగా పుస్తకం పైకెత్తి చూపింది.

'పాల్ రెవరీస్ రైడ్!'—మాయ్‌లీ అన్నది ఒకవిధమైన నిర్లక్ష్యంగా. 'ఈ పుస్తకాన్ని నీవు మననంచెయ్యాలా?' అనడిగింది.

పాన్ షియో తలవూపి 'చాలాకష్టంగాఉన్నది'అన్నది. తన ప్రియమైనపంతులమ్మ తనచేతిలోనుంచి పుస్తకం

తీసి, క్రింద విసరికొట్టేసరికి పాన్‌షియో స్తబ్ధురాలైంది.

'నాన్సెన్స్! ప్రతిరోజూ మనగొరిల్లాలు వీరుల్లా పోరాడుతూంటే, పాల్ రెవరీస్ రైడ్ ఏమిటి?' అన్నది మాయ్‌లీ.

పాన్‌షియో పుస్తకం అందుకోబోయింది. మాయ్‌లీ అడ్డువచ్చింది. తన చిన్నపాదాన్ని పుస్తకంమీదవేసి తొక్కింది. పుస్తకంతీసుకుని గదిలోనుంచిబైటికి వెళ్ళిపోయింది. ఆమె వెళుతూంటే పాన్‌షియో వణికిపోయింది. పంతులమ్మకు కోపం తెప్పించానేమో ననుకున్నది.

మాయ్‌లీ సరాసరి మిస్ ఫ్రేం ఆఫీసుగదిలోకి వెళ్ళింది. మిస్ ఫ్రేమ్ ఉదయాన బైబిల్ చదువుకుంటోంది. మాయ్‌లీ బైబిల్‌మీద ఆ పుస్తకాన్ని పెట్టింది. మిస్ ఫ్రేం మాయ్‌లీ వంక చూచింది. ఒక్క నెలలోనే వారిద్దరూ పదిసార్లయినా పోట్లాడుకునఉంటారు. ఎంతో నిర్భయంగా పోట్లాడుకున్నారు.

'ఇది చూడండి. ఒకమ్మాయి దీన్ని బట్టీపెడుతూండగా చూచాను' అన్నది మాయ్‌లీ నిర్భయంగా.

మిస్ ఫ్రేం కళ్ళజోడు సవరించుకుని పుస్తకంవంకచూచి 'ఇది నేటిఇంగ్లిషుపాఠం. ఒకపక్షంరోజులనుంచి ఈ పుస్తకాన్ని చదువుతున్నారు. ఇవాళ పూర్తిచేయాలి' అన్నది.

'ఇలాంటి చెత్తపుస్తకాలు యెవరు పెట్టమన్నారు? ఒకవైపున యేదేశంలోకూడా కనివిని యెరుగనట్టి స్వాతంత్ర్య పోరాటం ఈ దేశంలో జరుగుతూంటే, ఒక చైనాపిల్ల 'పాల్ రెవరీస్ రైడ్ బట్టీపెడుతూ కూచోవాలా?' అన్నది మాయ్‌లీ.

మిస్ ఫ్రేం చకితురాలైంది. 'సిలబస్‌లో వున్నదే ఈ పుస్తకం' అన్నది నిశ్చితంగా. మాయ్‌లీ పెద్దగా నవ్వింది. 'మిస్ ఫ్రేం, వినండి: ఈ కొండల్లో అమెరికన్ గ్రేడ్ స్కూల్ సిలబస్ అనుసరించడం అవసరమా? మనం ఎక్కడున్నామో ఆలోచించండి. చైనాలో 2000 మైళ్ళలోపల గుహల్లో శత్రువులదాడికి దాక్కున్నాం. మనం యిక్కడ చీనాయువతులకు చదువెందుకు నేర్పుతున్నామో తెలుసుకోవాలి.'

ఇలాఅని ఆపుస్తకాన్ని ముక్కలుముక్కలుగా చింపి, చెత్తబుట్టలో పడేసింది.

మిస్ ఫ్రేం కదల్లేదు, మెదల్లేదు.

పూర్వం ఒకప్పుడు ఆమెతండ్రి 'అమ్మాయీ, నువు కోపాన్ని తగ్గించుకోవాలి. నువు జాగ్రత్తగావుండాలి. లేకపోతే తొందరలో యెప్పుడోఒకప్పుడు యెవరినోఒకరిని చంపిన పాపాన్ని ఒడిగట్టుకుంటావు' అనిచెప్పాడు. ఆమె తనజీవితమంతా ఈ మాటలకు భయపడుతూవచ్చింది. అందుచేతనే యెప్పుడూ టేబిల్‌మీద తనతండ్రియిచ్చిన బైబిల్‌గ్రంథం వుంచుకునేది. ఆమెముఖంలోకి కోపం పొంగిరాగా, చెయ్యి బైబిల్‌మీదఉంచి, రుద్ధకఠంతో 'నేనీ స్కూలుకు ప్రిన్సిపాల్‌ను. చదవవలసినపుస్తకాలను నిర్ణయించేది నేనే' అన్నది.

'నేను బుద్ధిహీనురాల్ని' అనుకుని మాయ్‌లీ మిస్ ఫ్రేం కెదురుగావున్నకుర్చీలో కూచుని, తనముఖాన్ని మిస్‌ఫ్రేం ముఖానికి దాపులోవుంచింది.

'చూడండి, మిస్‌ఫ్రేం, నేను మిమ్మల్ని ఒక్కటేఅడు

గుతున్నాను. మీరు మావద్దనుంచి మా గొప్పతనాన్ని దొంగిలించకండి. ఇది మా స్వాతంత్ర్యపోరాటం. మీ స్వాతంత్ర్యం మీరు సంపాదించుకున్నారు. మా పిల్లలకు మా పాటలు, మా పద్యాలు నేర్పాలి. ఎప్పుడూ దైవభక్తి కీర్తనలు పాడుతూ కూచుంటే ఏంవస్తుంది?మాకు ప్రజాగీతాలు, అభ్యుదయగేయాలు కావాలి' అన్నది.

మిస్ ఫ్రేం లేచివెళ్ళబోతూ, మాయ్‌లీముఖంవంక చూచింది. ఆముఖంలో గొప్ప వేదనకనుపిస్తోంది. ఆమెవెడుతూ 'ఇది రక్షణప్రదేశం అనుకుంటాం' అన్నది.

'మాకు రక్షణఅక్కరలేదు. మేము రణరంగంలో వున్నాం' అన్నది మాయ్‌లీ.

మాయ్‌లీ లేచింది. ఇరువురిమధ్య అడ్డుగోడ పెరిగింది. ఎవరూ మాట్లాడలేదు. మాయ్‌లీ తిరిగి క్లాస్‌రూంలోకి వెళ్ళింది. ఫ్రేం చిరిగినపుస్తకం ముక్కలు ఏరింది. 'పుస్తకాలు విలువైనవి. ఈ పుస్తకం మళ్ళీ సరిచెయ్యా'లనుకున్నది.

మాయ్‌లీ చిందులుతొక్కుకుంటూ క్లాస్‌రూమ్‌లోకి వెళ్ళింది. 'నే నిక్కడ వుండలేను. లక్షలిచ్చినా యిక్కడ వుండలేను, వెళ్ళిపోతాను' అనుకున్నది.

మాయ్‌లీ క్లాస్‌రూమ్ లోకి వచ్చేసరికి పాన్‌షియో అక్కడే కూచునివుంది. ఆమెకళ్ళలో భయం కనుపించింది.

'ఏమిటి అలావున్నావు?' మాయ్‌లీ అడిగింది.

'మీకు కోపం తెప్పించాను' పాన్‌షియో అన్నది.

ఆమెకళ్ళవెంట నీళ్ళుకారసాగాయి. మాయ్‌లీకొంగు పట్టుకుంది.

'నువ్వు వట్టి చిన్నపిల్లవు. నిన్ను ఇంతదూరం ఎలా పంపించారు?' అన్నది మాయ్‌లీ.

'నాకు పదహారేళ్ళు. మూడుసంవత్సరాలు మగ్గం దగ్గర పనిచేశాను. తరువాత శత్రువులు రాగా, మా నాన్న నన్ను పంపించాడు' అన్నది పాన్‌షియో.

తనగ్రామం—తనఇల్లు, తనకుటుంబం, తనబావ ఫూలిన్ ద్రోహిగామారడం—ఈ కథంతా చెప్పింది. ఆమె పూర్తిచేసేలోగా ఇతరపిల్లలంతా వచ్చారు. అందువల్ల మాయ్‌లీ, 'మా అమ్మ నగరంలో పుట్టింది. కాబట్టి నేను ఈ కథంతా వినాలి. ఈ సాయంత్రం నాగదికి రా' అన్నది. పాన్‌షియో తలవూపింది. 'ఇంత చిన్నపిల్ల ఇన్నిబాధలు భరించిందా?' అనుకున్నది మాయ్‌లీ.

ఆ రోజంతా పాన్‌షియోచెప్పిన విషయాలతో ఆలోచించింది.

మిస్ ఫ్రేంతో పోట్లాడిన విషయంకూడా మరిచిపోయింది. మళ్ళీ మిస్ ఫ్రేంతో మాట్లాడింది. ఈశ్వరుడు తనప్రార్థన విని, ఆమెహృదయం మార్చాడనుకున్నది మిస్ ఫ్రేం.

...ఆ సాయంత్రం మాయ్‌లీ పాన్‌షియోకోసం కాచుకునివున్నది. తలుపుదగ్గిర పాన్‌షియోదగ్గు వినగానే లోపలికి రమ్మన్నది. 'ఇక్కడ కూచో' అన్నది ఒకబల్ల చూపిస్తూ. 'నీ కిప్పుడు ఒక తీపిపదార్థం ఇస్తాను. ఈపదార్థం సముద్రంఅవతలినుంచి తీసుకొచ్చాను. చాలాకాలంనుంచి ఈ పదార్థాన్ని ఒక ప్రత్యేకక్షణంకోసం దాచివుంచాను. ఆ క్షణం ఇదే

కాబోలు! దూరదేశంలో ఒక చెట్టునుంచి తయారుచెయ్య బడింది. తిను, బావుంటుంది.' అన్నది.

పాన్ షియో నాలికను రాచుకున్నది. మాయ్‌లీ నవ్వుతూ, 'నీ నాలుక పిల్లిపిల్లనాలుకలా చిన్నదే' అన్నది.

పాన్ షియోకూడా నవ్వింది.

ఆ నవ్వు మేఘంపరుగెత్తుతూన్నట్లుగావుండి, మాయ్‌లీ మనస్సు కెంతో హాయి అనిపించింది.

'నువ్వు నిజంగా క్వాన్ - ఇన్‌లాగా వుంటావు' అని గొణిగింది పాన్ షియో.

మాయ్‌లీ తన పెద్దకళ్లు విప్పారచేసి, 'నువ్వు నన్నేరుగవు. నేను చిన్నప్పుడు బహుకోపిష్టిపిల్లని' అన్నది.

'నేను నమ్మను' అన్నది పాన్ షియో. మాయ్‌లీ ముఖంవంక ధ్యానంగాచూస్తూ 'నేను నిన్నొకటి అడుగుతున్నాను. మా అన్నను పెండ్లిచేసుకుంటావూ?' అన్నది.

మాయ్‌లి పాన్ షియోవంక ఆశ్చర్యంగా చూచింది.

'నా మూడో అన్న. కొండపల్లెజలనాయకుడు. నీలాంటి స్త్రీకోసం వెదుకుతున్నాడు. ఈ దేశంలో వాడికి భార్యను చూడమని ఆజ్ఞాపిస్తూ మా నాన్న ఉత్తరం వ్రాశాడు. నీ రాకకుముందు అందుకుతగినవా రెవరూ కనుపించలేదు'— అన్నది తొట్రుపడుతూ.

భయంతో, వణుకుతున్న వేళ్ళతో ఉత్తరంతీసి చూపింది.

మాయ్‌లీ ఉత్తరంచదివి, మళ్ళీ పాన్ షియోకిచ్చివేసి 'ఈ ఉత్తరం వ్రాసినది మీ అన్నయ్యేనా?' అని అడిగింది.

'మా అన్నయ్యా! ఊహు. కాదు, వాడికి చదవడం వ్రాయడం రాదు' అన్నది పాన్‌షియో.

'అయితే చదువూ, వ్రాతా రానివాణ్ణి వివాహంచేసుకోవడం కష్టమేనే' అన్నది మాయ్‌లీ

'చదువురాకపోయినా మంచి తెలివిగలవాడు' పాన్‌షియో అన్నది బిగ్గరగా- 'నీవు చదువునేర్పితే, త్వరలోనే నేర్చుకోగలడు.'

'నేనెన్నడూ చూడనివ్యక్తిని ఎలా పెండ్లిచేసుకోవడం?' అన్నది మాయ్‌లీ మెల్లగా.

'చూచి ఎవరు చేసుకుంటారు పెళ్ళి?' అన్నది పాన్‌షియో ఆశ్చర్యంగా.

'మీ అన్నగురించి ఇంకా చెప్పు' అన్నది మాయ్‌లీ.

పాన్‌షియో తనకుజ్ఞాపకంఉన్నంతవరకు తన అన్నను గురించి చెప్పింది. చిన్ననాటిసంఘటనలన్నీ చెప్పింది. మాయ్‌లీ నవ్వింది.

అతనివీరకృత్యాలు వర్ణిస్తూంటే మాయ్‌లీ గంభీరంగా విన్నది. అంతా విని 'నాకు అర్థమైందిలే.'

అని 'అంతా ఒక కథలాఉంది. ఇక వెళ్ళి నిద్రపో' అన్నది పాన్‌షియోతో.

పాన్‌షియో వెళ్ళిపోయినతరువాత మాయ్‌లీకి ఆ గది అంతా ఒక కొండగుహగా మారినట్టు తోచింది. ఆమెలో పెద్ద మార్పుకనుపించింది ఒక యువకగొరిల్లానాయకుడు ఆమెముందు పెద్ద నీడలా నిల్చున్నాడు. 'అలాంటివాడు చదువుకుంటే?- చదువుకుంటే మరింత సాహసి కాడూ?' అను

కున్నది. ఆమెకు ఉపయోగజరిగినది జ్ఞాపకంవచ్చింది. చిరునవ్వు నవ్వుకున్నది. 'పాల్ రెవెరెకూడా చదువుకోలేదేమో' అనుకున్నది. తరువాత లేచివెళ్ళి కిటికీ తెరచి చూచింది. చాలాసేపు అలాగే చూస్తూనిల్చున్నది నగ్నపర్వతపంక్తులపై చంద్రుడు వెన్నెలవెదజల్లుతున్నాడు. ఆమె అటువైపు చూస్తూ నిశ్చలంగా నిల్చుని—కాస్సేపాగి 'మరీ బుద్ధిలేనిదాన్నవుతున్నాను' అనుకొని పోయి పడుకున్నది.

## 17

కొన్నాళ్ళవరకు పాన్షియోవంక సూటిగా చూచేది కాదు మాయ్లీ. 'ఎప్పుడైనా చూపుకలిస్తే చిరునవ్వునవ్వి చూపు తిప్పేసుకునేది.

మాయ్లీ రోజూ పర్వతపంక్తులను చూస్తూండేది. ఆ పర్వతపంక్తులు ఆమెలో ఏదోశక్తిని మేల్కొలిపేవి.

'నేను ఈ బడిపంతులుపని చెయ్యలేను. ఈ కీర్తనలు పాడుతూ కూచోలేను' అనుకునేది.

ఆమె ఊహించుకోసాగింది. ఆమె ఎక్కడికి వెళ్ళాలి? ఏంచేయాలి? తల్లిగారికుటుంబానికా? వారు చెల్లాచెదరైపోయారు. నగరాన్ని శత్రువులు ఆక్రమించుకున్నారు. ఆమె ఒంటరిగా ఏంచేస్తుంది? ఏమీచెయ్యలేను. ఏదో సంబంధం పెట్టుకోవాలి? ఏంసంబంధం? ఉత్తరాన సైన్యాలు పోరాడుతున్నాయి. అందరిలో ఒకతెగా తాను పోరాడదలుచుకోలేదు.

తనకు ప్రత్యేకస్థానం కావాలి. ఆమెకు ప్రపంచప్రఖ్యాతి వహించిన ఒక స్త్రీవిషయం జ్ఞాపకంవచ్చింది. ఆమెకూడా తన జాతికిచెందినదే. అంధగత్తె, శ్రీమంతురాలు. పాశ్చాత్య దేశాలలో చదువుకున్నది. ఒక సైన్యాధిపతిని పెళ్ళిచేసుకున్నది. అతను అజ్ఞానిఅయినా, బలశాలినిపెళ్ళాడి విశ్వవిఖ్యాతి వహించిన పరిపాలకుడుగా తయారుచేసింది.

తనూ అలాచేస్తే?.........మాయ్‌లీ ఒంటరిగా గదిలోకూచుని రేడియోతిప్పింది. రోజూ రాత్రి రెండు, మూడుగంటలమధ్య వార్తలువస్తాయి. తన దేశప్రజలు ఎలా పోరాడుతున్నదీ వినవస్తుంది.

'నే నిక్కడనుంచి తక్షణం వెళ్ళిపోవాలి' అనుకున్నది మాయ్‌లీ.........కాని, ప్రిన్సిపాలే మాయ్‌లీకి విడుదల నిచ్చింది. మిస్ ఫేం తనతోటిపంతులమ్మలతో ఇలా చెప్పింది నాకు ఈశ్వరుడు శక్తినిచ్చాడు. కొన్నివారాలబట్టి భగవంతుడు ఈ బరువు నెలా తొలగిస్తాడా అని ప్రార్థిస్తున్నాను. కాని, నాకు ఎన్నాళ్ళకూ దారి కనుపించిందికాదు. ఒకనాడు నా చెవులారా నేను విన్నాను.

'నాగక్షణలోఉన్నపిల్లలను పారిపొమ్మని చెబుతూంది. ఆమె క్లాస్‌రూమ్‌పక్కగుండా వెడుతూ విన్నాను. అది అమెరికన్‌చరిత్ర చెప్పవలసినక్లాసు. కాని, ఆమె, 'ఇతర జాతులు ఏంచేసినవో చదువుతూ, మన మీా గృహాలలోపడి ఉండడం నీచం, మనందరం బైటికివెళ్ళి మన పోరాటాన్ని మనం పోరాడాలి. నాతో రండి—ఎవరు వస్తారో'అంటున్నది.

నేను తలుపు తెరుసుకుని లోపలికి వెళ్ళి, 'మిస్ మాయ్‌లీ, మన కాంట్రాక్టు రద్దయింది' అన్నాను.

మిస్ ఫ్రేంమాటలువిని వినయవిధేయతలుగలపంతులమ్మలు గుసగుసలాడారు. అందరూ ఒకప్పుడు మిస్ ఫ్రేం దగ్గర చదువుకున్నవారే. మాయ్‌లీ తరువాత ఒకపంతులమ్మద్వారా ఈ మాటలువిని, 'ఆమెను ఈశ్వరుడు ఎలా వినియోగించాడో ఆమెకు తెలుసా ? నాకు విముక్తికలిగించడానికి వినియోగించాడు' అని పెద్దగా నవ్వింది. ఎంతో నిరసనగా తన పూర్తి జీతాన్ని తీసుకొని ఒక కొండరాయబారిద్వారా పైలట్‌ను పిలిపించి పాన్‌షియోనుకూడా చూడకుండా వెళ్ళిపోయింది.

తనదేవత వెళ్ళిపోయిందని తెలిసి పాన్‌షియో ఎంతోసేపు రహస్యంగా ఏడ్చింది.

మాయ్‌లీ విమానంలోకూచుని 'మళ్ళీ తీరానికి వెళ్ళనీ' అన్నది. ఆమె అందులోకూచుని, ఇకముందు ఏం చెయ్యాలో ఆలోచించసాగింది. ఇంత పూర్తిస్వేచ్ఛ ఆమెకెప్పుడూ దొరకలేదు. తనముందు ఒకవ్యక్తికూచుని విమానం నడుపుతున్నాడు. కాని, ఆ వ్యక్తికూడా విమానంలో భాగమే. ఆమె నిశ్చలంగా ఆకాశంవంకచూస్తూ ప్రయాణం సాగిస్తోంది.

ఆమెమనస్సుకు ఎంతో హాయిూ స్వేచ్ఛ చిక్కినట్టుంది. హాయిగావున్న మనస్సులోనుంచి ఒక పథకం రూపొందుతూ వున్నది. తనేవెళ్ళి పాన్‌షియోఅన్ననుచూస్తే? పాన్‌షియో ఎన్నోసార్లు స్త్రీ సహజమైన తెలివితో తనఅన్న అందా

గురించిచెప్పింది. 'చాలాపొడుగ్గా వుంటాడు. నీకంటె ఎంతో పొడుగ్గావుంటాడు' అని చెప్పింది.

మాయ్‌లీ చాలావిచిత్రమైన స్త్రీ. ఆమె ఎన్నడూ తనతో సమానుడైన పురుషుణ్ణి చూడలేదు. ఆమెకు మగవారంటే ఒకవిధమైన అసహ్యం. కాని సహజంగా ఉద్రేకస్వభావంగలవ్యక్తి. తనకంటే ఎంతో బలశాలిని, కాని, ప్రతి విషయానికి తనమీదఆధారపడివుండే వ్యక్తిని తనభర్తగా ఊహించుకునేది.

ఆనాడంతా మాయ్‌లీ అతన్ని ఎలాకలునుకోగలనా అని ఆలోచించసాగింది. అందులో అంత కష్టమేమీలేదు. పాపియో ఫూలిన్‌విషయం చెప్పింది. తను తల్లిసమాధిని దర్శించేమిషతో నగరానికి వెళ్ళవచ్చు. అక్కడనుంచి ఫూలిన్ గృహాన్ని కనుక్కొని, పరిసరగ్రామమైన లింగ్‌టాన్‌గ్రామానికి వెళ్ళవచ్చు. ఈవిధంగా ఊహించసాగింది మాయ్‌లీ.

మాయలీ వెంటనే తన పథకాన్ని ఆచరణలోపెట్టింది. నగరంలోని కీలుబొమ్మప్రభుత్వాధికారికి తన రాకను టెలిగ్రాంద్వారా తెలిపింది.

కొద్దిగంటలలో తిరుగుజవాబువచ్చింది. ఆమెను వెంటనే రావలసిందని, ట్రెయిన్‌లో ప్రత్యేకంగా చోటు ఏర్పాటు చేశాననీ, స్వంతకారులోవచ్చి కలుసుకుంటాననీ వ్రాశాడు. ఆమెకు తగినరక్షణ ఇస్తాననికూడా తెలిపాడు.

మాయ్‌లీ రెండురోజులు ఆగింది. కొత్తబట్టలు, ముత్యాలు కొనుక్కున్నది. తరువాత ఆమె రైలెక్కి నగరానికి బయలుదేరి ఆరాత్రే నగరంచేరింది.

......కీలుబొమ్మపరిపాలకుడు వచ్చి ఆమెను కలుసుకున్నాడు.

'నేను ఒంటరిగా ఉంటున్నాను' అని చెప్పాడు.

'అది సహజమే. నీవుచేసినపని నిన్ను ఇతరులనుంచి విడదీసింది' అన్నది ప్రశాంతంగా. ఇద్దరికి ఇంగ్లిషువచ్చును కాబట్టి ఇంగ్లీషులోనే మాట్లాడుకున్నారు.

'కాని నీవు నన్ను అర్థంచేసుకోవాలి. నేను ద్రోహిని కాను. వాస్తవికవాదిని. పాశ్చ్యసముద్రప్రజలు మనదేశాన్ని సగానికిపైగా జయించారన్న సత్యాన్ని మనం గమనిస్తే, మనం నారితో కలసి పనిచెయ్యడం తప్ప మరి మనకు భవిష్యత్తు లేదు. అంతేకాక నేనుచేస్తున్నది పూర్తిగా చీనాసాంప్రదాయానికి అనుకూలమైనది. చరిత్రలో మనమెప్పుడూ శత్రువులకు లొంగినట్లు కనుపించి శత్రువులను జయించాం' అన్నాడు.

'ఆరోజుల్లో మనం విజేతలకంటె బలంగా ఉండేవాళ్ళం. ఇప్పుడు అలా ఉన్నామా?' అన్నది మాయ్‌లీ.

అతను సమాధానంచెప్పలేదు. ఈలోగా ఆ గదిలోకి ఒకవ్యక్తి వచ్చాడు. వచ్చి వెంటనే వెనక్కుతిరిగి వెళ్ళబోయాడు. పరిపాలకుడు అతన్ని ఆపి, 'ఇతను ఊలిన్, నా సెక్రెటరీ, చాలా నమ్మకస్థుడు. నన్ను బాగా అర్థంచేసుకున్న వ్యక్తి' అని మాయ్‌లీకి పరిచయంచేశాడు.

వూలిన్ మాయ్‌లీని సూటిగాచూడకుండానే నమస్కరించాడు. ఇలాంటిమర్యాద శ్రీమంతుకాండ్రయిన స్త్రీలకు వస్తువులమ్మేసందర్భంలో వూలిన్‌కు వాళ్ళతండ్రి నేర్పాడు.

తరువాత పరిపాలకునితో, 'మీ సంభాషణకు అంతరాయం కలిగించినందుకు చింతిస్తున్నాను. ఒక దుర్వార్తవచ్చింది' అన్నాడు.

కీలుబొమ్మపరిపాలకుడు లేచి బైటికి వెళ్ళాడు. మాయ్‌లీ వూలినునుగురించి ఆలోచిస్తూ కూచుంది.

పరిపాలకుడు తిరిగివచ్చాడు.

అతనిముఖం కొంచెం వివర్ణంగా ఉన్నది.

'క్షమించాలి. ఒక ఉపద్రవకరమైన సంఘటన జరిగింది. కొండల్లోనుంచి ఒకగుంపు వచ్చి, కొండదిగువన ఉన్న మా సైన్యపటాలాన్ని ధ్వంసంచేసింది' అన్నాడు.

'ఇందుకు బాధ్యత నీదేనా? నిన్నేమైనా అంటారా?' అని అడిగింది మాయ్‌లీ.

'కొంతవరకు సహజంగా నన్నూ నిందిస్తారు' అన్నాడు.

తరువాత ఊలిన్‌తో, 'మన అతిథిని ఆమెగదిలోకి తీసుకెళ్ళు' అని చెప్పాడు.

అవతలికి వెళ్ళినతరువాత వూలిన్‌ను, 'రేపు నగరంలో తిరగడానికి వీలుంటుందా?' అని అడిగింది మాయ్‌లీ.

'రక్షకదళంతో వెళ్ళవచ్చు'

'నగరం బయటికి?'

'రక్షకదళంతో వెళ్ళవచ్చు'

'సైనికులే కావాలా? శత్రుసైనికులను తీసుకెళ్ళడం బాగుండదే. ఇది నా తల్లి పుట్టినస్థలం' అన్నది.

'మీతో నేనే రావడానికి ప్రయత్నిస్తాను. రక్షక దళాన్ని దూరంగా ఉంచవచ్చు' అన్నాడు వూలిన్.

ఆమె తనగదిలోకి వెళ్ళింది.

గది శత్రువులదైనా బాగా అలంకరింపబడిఉన్నది. ఆమెకు బాగా నిద్రపట్టింది.

ఆమరునాడు ఆమె ఫూలిన్‌ను పిలిపించింది. గ్రామాల పేర్లు ఫూలినుభార్యకు ఎక్కువగా తెలిసివుండడంవల్ల అతను భార్యనుపిలిచాడు. ఫూలిన్ భార్యను చూడగానే మాయ్‌లీకి పాన్‌షియోపోలికలు కనుపించాయి. 'మీతల్లిసమాధివున్న స్మశానం మా తండ్రిగారిగ్రామానికి పశ్చిమాన వుండివుం టుంది. అదొక్కటే ఈ చుట్టుప్రక్కలవున్న మహమ్మదీయుల శ్మశానభూమి' అన్నది ఫూలిన్ భార్య.

తనుకూడా కన్నవారివూరికి వస్తానని చెప్పింది.

# 18

లింగ్‌టాన్ బెంచీమీద కూచునివున్నాడు. రాత్రంతా నిద్రలేకపోవడంచేత బద్ధకంగావున్నాడు. కళ్లు ఎర్రగా వున్నాయి. అతను బద్ధకంగా కళ్ళెత్తి రోడ్డుకేసి చూచాడు. ఫూలిన్, తనకుమార్తె, పిల్లలు రావడం కనుపించింది. అతన్నిచూడగానే వారు గుజ్జుపుబగ్గిదిగి నడిచి రాసాగారు. వారు సమీపించినకొద్దీ వారితో మరొకరుకూడావున్నట్టు కన్పించింది లింగ్‌టాన్‌కు. శత్రుస్త్రీయేమో ననుకున్నాడు.

వారు సమీపించినతరువాత 'వచ్చారా?' అన్నాడు.

'వచ్చాం' అన్నాడు ఊలిన్ సౌమ్యంగా.

'నాన్నా, నేనూ పిల్లలూ వచ్చాం. మాపై వారిని చూచిపోవడానికి వచ్చింది ఈమె. మహమ్మదీయశ్మశాన భూమిలో తనతల్లిసమాధి చూడాలనివచ్చింది' అన్నది కుమార్తె.

లింగ్‌టాన్ ఆమె శత్రుస్త్రీ కాదనుకున్నాడు. లేచి మాయ్‌లీతో 'నీవు శత్రుస్త్రీవేమోననుకున్నాను' అన్నాడు.

ఆమె నవ్వింది 'నా రాకవల్ల మీకు కష్టంకలిగించి ఉంటాను' అన్నది.

'ఎబ్బె, ఏం కష్టంలేదు' అన్నాడు లింగ్‌టాన్.

అతనిదృష్టికి ఆమె సాధారణస్త్రీలా కనుపించలేదు. గొప్పకుటుంబానికిచెందినస్త్రీలా ఉన్నది.

ఈలోగా అతని కడసారికొడుకు గేటుదగ్గరకు వచ్చి నిల్చున్నాడు. ఒంటేలుపోసుకోబోతున్నాడు.

'ఆగు. ఇక్కడ కొత్తమ్మాయి ఉంది' అని అరిచాడు లింగ్‌టాన్. మాయ్‌లీ నవ్వింది.

లాయ్‌సా తిరిగిచూచాడు. అతను తిరిగిచూచేసరికి మాయలీ నవ్వుతోంది ఆమె ముఖంమీద ఎండపొడ పడుతూ ఉంది. నల్లనిజుట్టు, ఎర్రనిచెక్కిళ్ళు, ఎర్రనిపెదవులు. తెల్లనిపళ్లు, నవ్వుతో వెనక్కువంచినతల. మూడోకొడుకు తనమీద కత్తి వ్రేటుపడినట్టు చూచాడు.

'చిన్నతమ్ముడుకదూ' అన్నది ఊలిన్‌భార్య.

అప్పుడు లింగ్‌టాన్ ఎప్పుడూ కలలోకూడా అనుకోని పని చేశాడు. తనకొడుకుల ప్రాణాలు ఊలిన్ చేతులో ఉన్నవను కుని, ఊలిన్‌కు మోకరిల్లాడు. తలనేలకుఆనించాడు. లింగ్‌టాన్ ఇలా ఎందుకుచేశాడో ఊలిన్‌కు తెలుసు. వెంటనే ఊలిను లింగ్‌టానును లేవదీసి తనభార్యవంక తిరిగి, 'నే నెవరినీ చూడ లేదే' అన్నాడు.

ఊలిను తనకొడుకులకు ద్రోహంచెయ్యనని వాగ్దానం చేశాడని లింగ్‌టానుకు తెలుసు. ఆ క్షణంలో అతనిహృదయం మార్పుచెందింది. 'నే నిక ఎన్నటికి నిర్ణయించను. నిర్ణయించే అధికారం ఒక్క దేవునికేఉన్నది' అన్నాడు వినయంగా.

లింగ్‌టాన్ పిల్లలందరినీ పిలిచాడు. భార్యనుపిలిచి, టీ చెయ్యమన్నాడు.

తనకళ్ళఎదుట ఆ కుటుంబమంతా ఒకచోటచేరడం మాయ్‌లీ చూచింది, వారిమాటలు విన్నది. వారిని పరిశీలిం చింది. గర్భవతిగాఉన్న జేద్‌ను చూచింది. జేద్ అంటే మాయ్ లీకి ఎంతో ఇష్టమైంది.

కాని, మూడవకొడుకుమాత్రం రాలేదు. కోపంతో రహస్యపుగదిలో పడుకునిఉన్నాడు.

తల్లి లోపలికి వెళ్ళి, చెవిపట్టుకుని అతన్ని తీసుకొచ్చింది.

అందరూ వసారాలో కూచున్నారు. లాయ్‌సాన్ మాయలీవంక తేరిచూచాడు. ఆమె అతనివంకచూచింది.

'ఇలాటిస్త్రీని చూస్తానని కలలోనైనాఅనుకోలేదే!' అనుకున్నాడు లాయ్‌సా.

'ఇతను అచ్చంగా షాన్‌షియా చెప్పినట్టే ఉన్నాడు' అనుకున్నది మాయ్‌లీ.

'నే నిక వెళ్ళాలి' అంటూ మాయ్‌లీ లేచింది.

వూలిన్ కూడా లేచాడు. భార్యతో, 'నీవు ఇక్కడే ఉండు, మేము వెళ్ళివస్తాం' అన్నాడు. వూలిను, మాయ్‌లీ బైటికి వెళ్ళారు.

లింగ్‌టాను గేటువరకు వెళ్ళి తిరిగివచ్చాడు. లింగ్‌టాను తిరిగివచ్చినతరువాత చిన్నకొడుకు తనతో మాట్లాడాలనుకుంటున్నాడని గ్రహించాడు. తలఊపి, లోపలిగదిలోకి వెళ్లాడు. తండ్రికూడా వాడివెంట వెళ్ళాడు, చేతిలో టీగిన్నెతో సహా. 'ఏమిటి?' అని లింగ్‌టాను అడిగాడు. వాడిముఖం జేవురించి ఉన్నది.

'ఆ అమ్మాయి—' లాయ్‌సాన్ గొణిగాడు.

'ఏఅమ్మాయి?'

'ఆ పైక్లోడ్ వేసుకున్నఅమ్మాయి—ఆమెనిచ్చి నాకు పెండ్లిచెయ్యి నాన్నా' అన్నాడు.

లింగ్‌టాన్ చేతులువిచ్చుకుని చక్కని టీకప్పు కిందపడి ముక్కలైంది. లింగ్‌సా ఈ చప్పుడువిని లోపలికి వచ్చింది.

'ఏమి టేమిటి? గిన్నె పగిలిందా?'అన్నది.

లింగ్‌టాన్ విసుగ్గా కోపంతో, 'గిన్నె కాదే. ఈ నీ కొడుకు సూర్యచంద్రులను మింగాలనిచూస్తున్నాడు.' అన్నాడు. అందరూ అక్కడ పోగైనారు.

కూతురు కొత్తగిన్నెతో టీ తెచ్చిచ్చింది. లింగ్‌టాన్

టీ తాగి, 'ఏ అమ్మాయినీ పెండ్లిచేసుకోనన్నవీడు—ఆ పిల్ల నిచ్చి, పెళ్ళిచెయ్యమంటున్నాడు' అని చెప్పాడు.

'ఏ అమ్మాయి?' లింగ్‌సా ఆశ్చర్యంగా ఆనందంతో అడిగింది.

'ఆ కొత్తపిల్ల' అన్నాడు లింగ్‌టాన్.

అందరూ స్తబ్ధులైపోయారు. లాయ్‌సాన్ సింహంలా లేచి 'నే నెవర్నో మీ కెవరికీ తెలీదు. మీ దృష్టిలో నేను పసివాణ్ణి.కాని, నే నెంతమాత్రం పసివాణ్ణికాదు. అమ్మా, నేను నీపాలుతాగినట్టుకూడా మరచిపోయాను. నాన్నా, నేను నీ అన్నంతినడంలేదు. ఇక నా కెవ్వరూలేరు. నాకు అక్కలులేరు, చెల్లెళ్ళులేరు. బంధువులులేరు. ఇహ చస్తే ఈ ఇంట్లో అడుగు పెట్టను' అంటూ చరచరా వాకిలివేపుకు నడచిపోసాగాడు.

తల్లి అతనివెంట పరుగెత్తుకెళ్ళి చెయ్యిపట్టుకుని బ్రతిమలాడింది.

'నాకు కావలసినది మీరు ఇచ్చినప్పుడు, మళ్ళీ ఈ ఇంటికి తిరిగివస్తాను' అన్నాడు.

వాళ్లు బైటికి వెళ్ళిచూచేసరికి త్వరత్వరగా కొండల వైపుకు నడచిపోతున్నాడు.

లింగ్‌టాన్ తల చేతుల్లో ఉంచుకుని, 'ఇలాంటివాడు నీకడుపున ఎలాపుట్టాడే' అని ఏడ్వసాగాడు.

తరువాత లింగ్‌సా తనకూతురిని ఒకప్రక్కకు తీసుకెళ్ళి 'అమ్మాయ్, నీ కన్నీ తెలుసు. నువ్వేమంటావే?' అన్నది.

'ఆ అమ్మాయి బాగాచదువుకున్నది' అన్నది కూతురు 'నేను నాన్నతో మాట్లాడి చెబుతాలే.'

'ఎలాగైనా ఈ సంబంధం ఏర్పాటుచెయ్యి. ఈ ఒక్క సహాయం చేసిపెట్టు బాబు' అని తల్లి కూతురిని బ్రతిమలాడు కోసాగింది.

'నేను చెయ్యగలిగింది చేస్తాలే' అన్నది కుమార్తె.

లింగ్సా కూతురుతోమాట్లాడినవిషయం భర్తతో చెప్పింది.'

'ఏదోఒకటి ఏడవండి. మీ ఆడంగులగొడవ అగమ్యగోచరం' అన్నాడు లింగ్టాన్.

...లాయ్సాన్ కొండల్లోకి వెళ్ళలేదు. కొంతదూరం వెళ్ళిపడమరకుతిరిగి మహమ్మదీయుల శ్మశానభూమికి వెళ్లాడు.

మాయ్లీ తనతల్లి సమాధివద్ద నిల్చునిఉన్నది.

'చాలా ఎత్తుగాఉన్నది' అనుకున్నాడు లాయ్సాన్.

మాయలీ పొడుగ్గాఉండడం లాయ్సాన్కు ఎంతో నచ్చింది. లాయ్సాన్ కొండపులిలా నిశ్శబ్దంగా గడ్డిలో కూచుని ఆమెను పరిశీలింపసాగాడు. కొంతసేపైనతరువాత ఆమె, వూలిన్ లింగ్టాన్ఇంటివైపుకు నడకసాగించారు.

ఈలోగా జేడ్ లాయ్ఎన్ను రహస్యపుగదిలోనికి తీసుకెళ్ళి 'కనిపెట్టావా?' అన్నది.

'ఏమిటి?' అన్నాడు లాయ్ఎన్;

'ఆమే ఆమె' అన్నది జేడ్.

'ఆమెఅంటే ఎవరు?'

'సీతమ్మనిదేవత! 'వీరిద్దరినీ ఎలా కలపాలి?' అన్నది జేడ్.

...మాయలీ నగరానికి తిరిగివచ్చింది. సరాసరి తన గదిలోకి వెళ్ళింది. స్నానంచేసి తలదువ్వుకున్నది. తరువాత

ఒక చిన్న టేబిల్‌ముందు కూచుని, చాలాసేపు అద్దంలో తన ప్రతిబింబం చూచుకున్నది. ఆనాటి ఉదయం ఆమె హృదయానికి ఒక విధమైన మృదులత్వం వచ్చింది. తన తల్లి సమాధిని దర్శించడం వల్ల ఆమెమనస్సులో ఏవేవో అవ్యక్త స్మృతులు మేల్కొన్నాయి.

ఆమె హృదయంలో ఇప్పుడొక యువకునిముఖం అంకితమైఉన్నది. అతను విద్యావిహీనుడు కావచ్చు. కాని అతనిముఖంలో గొప్ప ధైర్యం, శక్తి, ప్రేమ కన్పిస్తున్నాయి. ఇవన్నీ కలిసి ఒకే వ్యక్తిలో ఉండడం ఆమె ఎన్నడూ చూడలేదు.

...లింగ్‌టాన్‌కు అతనిభార్యకు నిద్రపట్టలేదు. లాయఎర్‌కు, జేడ్‌కు ఈ ఆకాశదేవతను ఎలా భూమికి దించుకురావాలో తెలీడంలేదు. తనభార్య ఈ విషయం ప్రస్తావించగా వూలిను తలఊపాడు. కాని, 'అసాధ్యం' అన్నాడు. తరువాత ఒక విచిత్రం జరిగింది. మాయలి తనంతతానే లింగ్‌టానుగృహానికి వెళ్ళింది.

రెండోనాడు మధ్యాహ్నం కీలుబొమ్మప్రభుత్వ భవనాన్ని వదలి, నిర్భయంగా బైటికివచ్చి ఒకగుర్రపుబగ్గీ మాట్లాడుకుని, బయలుదేరింది. గుర్రపుబగ్గీని లింగ్‌టాన్ ఇంటిముందు ఆపి, తలుపుతట్టింది. వాకిట్లోవున్న జేడ్, 'ఎవరూ?' అన్నది.

'నేను' అన్నది మాయ్‌లీ.

జేడ్ తలుపుతెరచిచూచి ఆశ్చర్యపడింది. మాయ్‌లీని

లోపలికి తీసుకెళ్ళి కూర్చోబెట్టింది. టీ తెచ్చిఇచ్చింది. మాయలీ జేడ్ కొడుకును ఎత్తుకుని ఆడించింది. తరువాత 'మొన్నవచ్చినప్పుడు స్వేచ్ఛగా మాట్లాడలేకపోయాను. ఇవాళ హాయిగా మాట్లాడుకోవచ్చని వచ్చాను. మీ ఫారోషిరోను నేనుఎరుగుదును. కొన్నాళ్లు నేను చదువుకూడా చెప్పాను' అన్నది.

ఈ మాటలువిన్నప్పుడు మొదట జేడ్ నమ్మలేక పోయింది. కాని మాయ్‌లీ అన్నీ వివరంగాచెప్పింది.

'ఫారోషిరో మాఅందర్నిగురించి చెప్పిందా?' అని అడిగింది జేడ్.

'అందర్నిగురించీ చెప్పింది. మిమ్మల్నిచూడగానే మీపేర్లు తెలుసుకోగలిగాను' అన్నది మాయ్‌లీ.

నేను వ్రాసినవుత్తరం చూపించిందా?' అన్నది జేడ్.

'నేనా ఉత్తరం చూచాను' ఆమెధైర్యం జేడ్‌కు కూడా ధైర్యంకలిగించింది.

'మా మరిది నిన్నుచూడగానే ప్రేమించాడు'

'కొందరుపురుషు లంతే' అన్నది మాయ్‌లీ.

'అతను అందరిలాంటివాడు కాదు' అన్నది జేడ్. మాయ్‌లీ జేడ్‌దీర్ఘమైనకళ్ళల్లోకి చూచింది.

'నువు ఎంతపొడుగ్గా వున్నావు! నాకంటె పొడుగ్గా వున్నావే!' అన్నది జేడ్.

'అవును, నేను చాలా పొడుగు' అని చిరునవ్వు నవ్వింది మాయ్‌లీ. 'అతనికి పొడుగైనస్త్రీలంటే యిష్టం'

అన్నది జేడ్. తరువాత మాయ్‌లీ ఆమెకు తనజాకెట్‌లో నుంచితీసి, సిల్కుతో చేసిన చిన్న స్వతంత్రపతాకం ఇచ్చింది.

'స్వతంత్రపతాక!' అన్నది జేడ్.

'నేను స్వేచ్ఛాదేశానికి వెడుతున్నానని అతనితో చెప్పు. నేను 'కన్మింగ్'కు వెడుతున్నాను' అన్నది మాయ్‌లీ.

# 19

మాయ్‌లీ వెళ్ళిపోయింది. జేడ్ చాలాసేపు అలాగే కూచున్నది. కాళ్ళదగ్గర ఆడుకుంటున్నబిడ్డను చూస్తూ కూచున్నది. ఆమెగర్భంలో మరో శిశువు కదులుతున్నది. ఆమె హృదయంలో స్వేచ్ఛాపతాక రెపరెపలాడింది!

'నేనూ, నాభర్తా స్వేచ్ఛాదేశంలో ఉండిఉన్నట్లయితే- అనుకున్నది. కాని ఆమె భర్తతో కలిసి ఈ పంజరంలోకి వచ్చింది.

మధ్యాహ్నం అందరూ భోజనానికి వచ్చారు. జేడ్ హృదయాన్ని ఏదో మబ్బుఆవరించిఉన్నట్టు లాయ్‌ఎన్ గమనించాడు.

జేడ్ మాయలీరాకవిషయం చెప్పింది.

వారికి స్వేచ్ఛాపతాకను చూపింది. లింగ్‌టాన్ ఆ పతాకను రహస్యపుగదిలో దాచమని చెప్పాడు.

'నా కుమారుణ్ణి అక్కడికి రమ్మన్నదా? నే నెక్కడా ఇలాంటివిడ్డూరం చూడలేదు. స్త్రీలు పురుషుణ్ణి వెదు

క్కుంటూవస్తారు కాని, పురుషుడు స్త్రీని వెదుక్కుంటూ వెళ్ళడు' అన్నది లింగ్సా కోపంతో.

'అలాంటిపిల్ల ఎప్పుడూ కోడలుకాలేదు' అన్నాడు లింగ్టాన్.

'నా కొడుకుభార్య నాకు కోడలుకాకుండా ఎలా వుంటుంది?' అన్నది లింగ్సా.

'రేపు పెళ్ళయినతరువాత చూద్దువుగానిలే' అన్నాడు లింగ్టాన్.

'అయితే అది ఆడదికాదన్నమాట!' అన్నది లింగ్సా.

తరువాత లింగ్టాన్ లాయఎర్తో, 'నీవు వెళ్ళి నీ తమ్ముడితో నేనా పిల్లకోసం వెళ్ళలేనని చెప్పు. నేను నా భూమినివదిలిపెట్టి వెళ్ళను. వాడికి ఇలాంటిబంధాలు ఏమీ లేవు. కాబట్టి వాడు ఎక్కడికైనా వెళ్ళొచ్చు. వెళ్ళేటప్పుడు మనతో చెప్పిమాత్రం వెళ్ళమను' అన్నాడు.

లాయఎర్ గౌరవంతో తలవంచాడు.

ఇది ఇలాఉండగా లింగ్టాన్ పెద్దకొడుకు కొండల్లో ఉండి తనశాయశక్తులా తనవిద్యుక్తధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. అక్కడక్కడ ఎరలుపెట్టి శత్రువులనుపట్టుకుంటున్నాడు. ఎవరైనా సామాన్యరైతో బిచ్చగాడో, యాత్రికుడో ఎరలో పడితే వదలిపెడతాడు. అతనికి ఆర్చిడ్ పోయినతరువాత మళ్ళీ ఆ మెస్థానాన్ని అలంకరించదగినస్త్రీ దొరకలేదు.

ఇలాఉండగా ఒకరోజున విచిత్రంగా ఒక స్త్రీదొరికింది. కొత్తరోడ్డుమీద ఎరవేశాడు. మరునాడు ఆ ఎర తీసిచూచే సరికి అందులో ఒకస్త్రీ పడిఉన్నది. రాత్రంతా అక్కడే పడి

ఉన్నది. అతను లోపలికిచూచి ఆమె శత్రువుకాదని గ్రహించాడు. అతను ఎరలోకి దూకి, ఆమెను బయటికితీశాడు. ఆమె ఒక అనాథస్త్రీ. ఆమె భర్తను శత్రువులు చంపారు. ఆమె అత్తమామలఇల్లు వెతుక్కుంటూ వెళుతున్నది. ఆమె తన కథంతా చెప్పి, ఏడ్వసాగింది. అతను ఆమెను దగ్గర్లోని హోటలుకు తీసుకెళ్ళి భోజనంపెట్టించాడు.

'ఈశ్వరుడు ఈస్త్రీని నాకొరకే పంపించాడు' అనుకున్నాడు. తరువాత ఆమెతో, 'మా తండ్రిగారిఇల్లు ఇక్కడికి సమీపంలోనే ఉన్నది మాఅమ్మ చాలా మంచిది. నిన్ను అక్కడికి తీసుకెళ్తాను' అన్నాడు. ఆమె అంగీకరించింది. ఇద్దరూ నడుస్తున్నారు. కొంతదూరం నడచినతర్వాత 'నాకూ భార్యా—బిడ్డలు పోయారు. నీకు నీ భర్తపోయాడు. మనం కలిసి వుంటే–' అన్నాడు.

ఆమె సిగ్గుతో తలవంచుకుంది. ఆనాటినుండియే జేద్ కు నొప్పులురావడం ప్రారంభించాయి.

లింగ్ సా తనపెద్దకొడుకు కొత్త స్త్రీతో రావడం చూచింది. అతను ఇంట్లోఅడుగుపెడుతూనే 'అమ్మా! కోడలిని తెచ్చాను' అన్నాడు.

'ఉండరా, కోడలూ నువ్వూను. జేద్ బిడ్డనుకనలేక అవస్థపడుతోంది' అన్నది తల్లి.

కోడలు ఆ యిల్లు చూడగానే అది తగినయిల్లేననుకున్నది. వెంటనే లింగ్ సా ఆ కొత్తస్త్రీని చెయ్యిపట్టుకుని, జేద్ పక్కదగ్గరకు తీసుకెళ్ళి 'అమ్మాయ్, ఈశ్వరుడు ఈమెను మనకు సహాయంగా పంపించాడు' అన్నది.

తరువాత ఆ కొత్తస్త్రీ జేద్‌గర్భాన్ని మెల్లగా సవరించింది. జేద్‌కు కొంత ధైర్యంవచ్చినట్టయింది. తరువాత ఆమె జేద్‌కడుపువద్దకు చెయ్యిపోనిచ్చి 'మగపిల్లాడులా వున్నాడు'అన్నది.

తరువాత రెండుగంటలకు శిశువు బైటపడ్డాడు. ఆ స్త్రీ జేద్‌వంకచూచి 'మరోఅబ్బాయి' అని మళ్ళీ తనపనిలో నిమగ్నురాలైంది. ఆ కొత్తస్త్రీని ఈశ్వరుడు తనసహాయం కోసమే పిలిపించాడనుకున్నది లింగ్‌సా. తరువాత ఆమెను, 'నీ కేమైనా పిల్లలా?' అని అడిగింది. ఆ అనాథస్త్రీ తన సంసారం శత్రువులచేతుల్లో నశించిన ఉదంతమంతా చెప్పింది. 'యెంతఘోరం!' అని గొణుక్కున్నది లింగ్‌సా.

## 20

లింగ్‌టాన్ ఇల్లు మళ్ళీ నిడింది. కాని, ఇంకా శత్రువుల ఒత్తిడి తగ్గలేదు. లింగ్‌టాన్‌జీవితం సాగిపోతూనేఉంది. శత్రువులువిధించిన ఘోరమైనపన్నులు, పెట్టేబాధలురైతులందరివలె అతనూ ప్రశాంతంగా భరిస్తున్నాడు. శత్రువులు తమదేశాన్ని పూర్తిగా దోచుకున్నారు. ఒక్క పుడమితల్లినిమాత్రమే వాళ్ళు తమదేశానికి తరలించుకుపోలేకపోయారు' అనుకునేవాడు లింగ్‌టాన్. పూర్వపురోజుల్లో లింగ్‌టాన్‌పుట్టినరోజన ఊరంతా పెద్దపండుగగా ఉండేది. తనస్నేహితులందరినీ పిలిచి, పెద్ద విందుచేసేవాడు. ఇప్పుడు లింగ్‌టాన్ తన అరవయ్యోపుట్టినరోజుపండుగకు ఎదురుచూస్తున్నాడు.

తనచిన్న కొడుకు దూరంగా స్వేచ్ఛాదేశంలో ఉన్నాడు. పెద్దకొడుకు కొండలకూ ఇంటికీ తిరుగుతున్నాడు. తనపుట్టినరోజు దగ్గరకువస్తోంది. తనఇంట్లో మాంసంకాని, మాంసంకొనడానికి డబ్బులుకాని లేవు. లింగ్‌టాలో వృద్ధాప్యం బాగా నెలకొన్నది. అతనిలో ఒకవిధమైన అలుపు ఏర్పడింది. ఒకరోజున పొలాన ఇలా అనుకున్నాడు—'నేను నా భూమినిచూచికూడా సంతోషించలేకుండా వున్నాను. పంటంతా శత్రువులపరమైపోతున్నది. ఈ శత్రువు లున్నంత కాలం ఈ దేశంలో యెవరికీసంతోషం లేదు. ప్రపంచంలో మనుష్యులంతా స్వార్థపరులు. యెవరిగొడవవారికే' అనుకున్నాడు.

ఒకరోజున కొడుకుతో ఇలా అన్నాడు—'మనుష్యులందరూ చెడిపోయారు. ధర్మాధర్మాలు యోచించేవారెవరూ లేరు.' రానురాను అతనికి భోజనంమీద యిచ్ఛకూడా సన్నగిలింది. పనికూడా తగ్గింది. ఈ విచిత్రపరివర్తన చూచి, లింగ్‌సాకు భయంకలిగింది. కొడుకును ప్రక్కకుపిలిచి 'మీనాన్న నిరాశగావుండడం నే నెన్నడూ చూడలేదు. నాకు భయంవేస్తోంది. ఎలాగైనా ఆశకలిగించండి' అన్నది.

'మనం కృత్రిమంగా ఆశ కలిగించలేం. అలాకలిగిస్తే అది కలే అవుతుంది' అన్నాడు కొడుకు.

'అయితే మీతండ్రి జీవితం ముగిసిందన్నమాటే. మన దీర్ఘసమరంసమాప్తమైనదన్నమాట' అన్నదిలింగ్‌సాదుఃఖిస్తూ. తరువాత తనగదిలోకివెళ్ళి తలుపులు మూసుకునిఏడ్చింది.

నగరంలో కీలుబొమ్మ ప్రభుత్వం సాగుతూనేఉన్నది. ఇప్పటికీఎన్నోహత్యలూ, దురంతాలూసాగుతూనే ఉన్నాయి.

ప్రతిమనిషిహృదయాన్నీ నల్లమందు తినేస్తోంది.
లాయ్‌ఎక్‌కు తమ ముసలిజ్ఞాతి జ్ఞాపకంవచ్చాడు. అతను బ్రతికేఉన్నాడని లాయఎక్‌కు తెలుసు.

లింగ్‌టాంగ్ పుట్టినరోజు వచ్చింది. పెద్ద విందేమీలేదు. ...టుగాపట్టిన చేపనుమాత్రం వండారు. ఆరాత్రి లాయఎక్ ...తో,

'ఇవాళరాత్రి నగరానికివెళ్ళి మన ముసలిబంధువు ...విందాం నాన్నా' అన్నాడు.

...గ్‌టాంగ్ బద్ధకంగాఉన్నదని మొదటవెళ్ళడానికి ఒప్పు... ...త మనస్సుమార్చుకుని, 'సరే పద'అన్నాడు. ...న్, అతనికొడుకు మళ్ళీ టీ దుకాణానికి ...్యంలాగానే లోపలిగదిలోకి వెళ్ళారు. ముసలి ...ుడు. చిక్కి, ఎండి, బెరడులాగా ఉన్నాడు. ...సమయంలో వెళ్ళి, తనెవరోచెబితే, నల్లమందు ...నెవరోకూడా వృద్ధునికి అర్థమయ్యేదికాదు.

...ముసలివాడు వచ్చికూచుని, మెల్లగా తన లోతైన ...తుతో 'నేను నిన్న మీకు ఇద్దరు గొప్ప తెల్లవారిమధ్య జరిగిన సమావేశాన్నిగురించి చెప్పాను.

'ఒక తెల్లదొర 'మీ'నుంచి వచ్చాడు; మరోతెల్లదొర 'ఇంగ్'నుంచి వచ్చాడు. ఇద్దరూ కొద్దికాలంమాత్రమే కలుసుకున్నారు. ఈవాళ ఇంగ్‌నుంచి వచ్చిన దొర ఇలా చెప్పాడు.

అని వృద్ధుడు ఎంతో యత్నంతో కళ్ళ జోడు ...ుకుని జేబులోనుంచి ఒకచిన్నకాగితంతీసి 'పరాజితులజీవ...త దుర్భరమైనది. మనం వారికి ఆశకల్గించాలి.

వారిబాధలూ, పోరాటాలు నిష్ఫలంకావు. సారంగం చాలా పొడుగైనదీ, చీకటిమయమైనదే. కాని చివరకు వెలుగు చూడగలం' అని బిగ్గరగా చదివాడు.

అసహ్యమై శిథిలంగావున్న ఆ గదిలోకూచుని లింగ్ టాన్ ఈ ధైర్యోపేతమైనమాటలు విన్నాడు. అ తృషిత హృదయానికి ధాన్యబీజాలు చల్లినంత వున్నాయి ఈ మాటలు. లింగ్‌టాన్ జీవితమందలి అలుపులోనుంచి కన్నీరుఅతనికళ్ళల్లోకి ఉబికివచ్చింది ఈ కష్టదినాల్లో అత నెన్నడూ యేడ్వలేదు గ్రామంలో, ప్రతిచోటా మృత్యువు స్వైరవి చూచాడు. కాని, అత నెన్నడూ కన్నీటిబొట్ట లేదు. ఇప్పుడుమాత్రం ఏడ్పు ఆగలేదు.

'ఇక వెడదాం' అన్నాడు కొడుకుతో.

కొడుకు లేచాడు. ఇరువురూకలిసి నగరంవెల

శిథిలనగరంబయట చిందరవందరగాఉన్న నడుస్తున్నారు కొండలు నల్లగా కనుపిస్తున్నాయి. అప్ప వెన్నెలలేదు. చీకటిగావుంది. తండ్రి ముందునడుస్తున్నా కొడుకు వెనుక నడుస్తున్నాడు. తండ్రి ఆగి 'వానవచ్చేటట్లు అన్నాడు. చాలారోజులనుంచి వానకోసం ఎదురుచూస్తున్నా

'అవును. వస్తుంది, తప్పకుండా వస్తుంది' అన్నా లాయ్ఎర్.

ఆ ఆశతో ఇద్దరూ చరచర ముందుకు సాగిపోతునా

సమాప్తం



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B155 |
| పుస్తకం పేరు | బీజలక్ష్మి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 271 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | pravallika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |